డా॥ ఆరుద్ర

# గుడిలో సెక్స్




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, బ్యాంక్ స్ట్రీట్, విజ్ఞాన భవన్, హైదరాబాద్ - 500 001.

**GUDILO SEX** - By **Dr. Arudra**

ప్రచురణ : 2350/2232

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మార్చి, 1994

ద్వితీయ ముద్రణ : డిసెంబర్, 2000

తృతీయ ముద్రణ : జూన్, 2008



టైటిల్ డిజైన్ : రాజా

**వెల : రూ.60**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్- 500 001.

ఫోన్స్: 24744580/24735905

e-mail : visalaandhra ph@yahoo.com
www. visalaandhraph.com

**విశాలాంధ్ర బుక్ హౌస్**

అబిడ్స్ & సుల్తాన్ బజార్ - హైదరాబాద్, విజయవాడ,
విశాఖపట్నం, హన్మకొండ, అనంతపురం,
గుంటూరు, తిరుపతి, కాకినాడ, కరీంనగర్.



ముద్రణ : శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్.

# నిత్య కల్యాణం

అమెరికాలో ఇటీవల హిందూ దేవాలయాలు ముమ్మరంగా నిర్మితమయ్యాయి. భారతదేశంలోలాగే అంగ భోగాలు, రంగ భోగాలు, అర్జిత సేవలు యధావిధిగా అక్కడ కూడా జరిపిస్తున్నారు. పిట్స్‌బర్గ్‌లోని వెంకటేశ్వరాలయంలో శని ఆదివారాల నాడు కల్యాణోత్సవాలు చేయడం పరిపాటి. పాతికముప్పై మంది దంపతులు స్వామి వారికి అమ్మ వారిని కన్యాదానం చేస్తూవుంటారు. ఒకే ఒక్క దేవతను యింత మంది కన్యాదానం చేయడం ఏమిటి? అని ఆశ్చర్యం చెందిన ఒక స్నేహితురాలు నన్ను అందులోని అంతరార్థం చెప్పమని అడిగింది. పూర్వకాలాల్లో వుండే గుడిలో సెక్సుకు యిది ప్రత్యామ్నాయమని చెప్పాను. ఆమె వివరించమంటే నేను యిలా వివరించాను!

లోకమందరి మంచి చెడ్డలు ఆదిలో లోకులు ఎరుగుదురు. లోక వ్యాపారం, అందులోను, ముఖ్యంగా వుత్పత్తి, పునరుత్పత్తి అవిచ్ఛిన్నంగా సాగాలంటే ప్రకృతి శక్తులు సృష్టి కార్యాన్ని కొనసాగించాలి. సెక్సు చర్యలు కావించాలి. దేవతల చేత మానవులు ఈ పనులు చేయించడం ఆది నుండి వస్తున్న ఆచారమే. మనుషులు చేసిన దేవుళ్ళు మనుషులలాగే వుండేవారు. వాళ్లకు ప్రాచీన పరిణామ దశలో యిళ్లు, గుళ్లు వుండేవి కావు. అందువల్ల మానవుల భౌతిక కాయాలలోనే దేవతలు, పితృదేవతలు అవసరమైనపుడు ఆవహించి కావలసినంత సేపు వాసం చేసే వారు. సింధూనాగరికతలోనే వ్యవసాయిక సమాజంలో పుష్కరిణి చెంత పశుపాలక సంస్కృతి కల ఆర్యుల యజ్ఞయాగాలలో మానవులు తమ భౌతిక కాయాలతో దేవతలు చేయవలసిన సెక్సు పనులు చేసే వారు. పునరుత్పత్తి నిరాఘాటంగా కొనసాగుతుందని తృప్తి చెందేవారు.

యాగ శాలల స్థానంలో దేవాలయాలు వచ్చాక ఆ పవిత్ర స్థలాలలోనే పరమ శ్రద్ధా భక్తులతో చేసేవారు. వుత్తరోత్తర అసంఖ్యాక ప్రజానీకానికి కొన్ని వర్గాల వారు కొన్ని జనజాతుల వారు ప్రాతినిధ్యం వహించి గుడిలో సెక్సును సాగించేవారు. అయితే ఆచార వ్యవహారాలు మారుతూ వచ్చాయి. కాని ఆశయంలోని ప్రాధాన్యాంశం మాత్రం చెక్కు చెదరలేదు. కాలక్రమేణా స్వామి వారికి అమ్మవారికి పెళ్లి చేయించి వారిని కాపురం చెయ్యమని సృష్టి కార్యం కావించమని కోరుకొనవలసి వచ్చింది. నేటి కల్యాణోత్సవాలలో నాటి గుడిలో సెక్సు బీజాలు వున్నాయి.

అయితే నాటికి, నేటికి మధ్య ఎన్నో పరిణామ దశలు వున్నాయి. వాటినే అవగాహన చేసుకోవాలన్న ప్రయత్నంగా నేను 'గుడిలో సెక్సు' అనే ప్రాథమిక పరిశోధన గ్రంథం వ్రాశానని అమెరికాలోని స్నేహితురాలికి చెప్పాను. ఆమెతోబాటు ఈ విశ్లేషణ విన్న స్నేహితులు పుస్తకం ఎప్పుడు వస్తుందని అడిగారు. యిప్పటికి వచ్చింది.

- డా. ఆరుద్ర

# ఇందులో..

# అంకితం

సొంత పుంతలు తొక్కించి
వింత మలుపులు తిప్పించి
పత్రికా పరిశ్రమకు
కొత్త వరవళ్ళు పెట్టిన
ప్రయోజనాత్మక ప్రయోగశీలి
ప్రతిభాశీలి శ్రీ చెరుకూరి రామోజీరావు గారికి
అభిమాన చిహ్నంగా.....

# ఇది ఎందుకు ?

అయిదు దశాబ్దాల క్రిందట, ఆ మాట కొస్తే అప్పటికి రెండు మూడేళ్ళ క్రిందట ఆంధ్ర విశారద తాపీ ధర్మారావుగారికి ఎన్నో సందేహాలు కలిగాయి. ఎంతో పరిశోధన చేశాక, ఎన్నెన్నో సమాధానాలు లభ్యమైనాయి. బాధ్యత గల పరిశోధకుడు తాను తెలుసుకున్న విషయాలను, తాను సంపాదించిన జ్ఞాన సంపదను జాతి జనులతో పంచుకొంటాడు. కనుక తాపీ వారు తమ సందేహాలను, సమాధాలను మొదట వ్యాసాల రూపంలోను తదుపరి పుస్తకరూపంలోను ఆంధ్ర పాఠకలోకానికి అందించారు.

1936లో "దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు?" అనే పేరుతో వారు ఒక పుస్తకం ప్రచురించారు. దాని తొలి కూర్పులోని మనవి మాటలలో ఆ వ్యాసాలన్నీ 'ప్రజామిత్ర' పత్రికలో వారం వారం పడ్డాయని తెలియచేశారు. ఆంధ్ర పాఠకలోకం అపారమైన ఆదరం చూపెట్టి పుస్తక ప్రచురణను వాంఛించి వ్యాసాల రూపంలోనూ, పుస్త రూపంలోనూ చాలా పెద్ద సంచలనం కలిగించిన ఈ ప్రశ్న కొట్టవచ్చినట్టు కనబడినా కొట్టిపారవేయవలసిన విషయం కాదు. కళ్ళు మూసుకు దాటెయ్యవలసిన ఘట్టం కాదు. కారణాలు కప్పి పెట్టవలసిన కాలం వెళ్ళిపోయింది. 'సత్యమేవజయతే' అన్న నినాదంగా మన జాతి మరొక శ్లోకాన్ని వర్లిస్తూ వుంటుంది.

సత్యం బ్రూయా త్ప్రియం బ్రూయాన్న బ్రూయా త్సత్య మప్రియం
ప్రియంచ నానృతం బ్రూయా దేషధర్మ స్సనాతనః

మనస్మృతి (4-138)లోని ఈ శ్లోకం నిజమైన మాటలను, ప్రియమైన మాటలను మాట్లాడమని చెప్తుంది. నిజమే కదా అని అప్రియమైన మాటలు గానీ, ప్రీతిని కలిగిస్తాయి కదా అని అసత్యమైన మాటలను గాని చెప్పకూడదంటుంది. ఇది సనాతన ధర్మమని చాటుతుంది. మన సనాతన ధర్మాలలో చాలా సత్యాలు విడమర్చకుండా చెప్తే అప్రియాల లాగ కనబడతాయి. పూర్వం విడమర్చి చెప్పలేకపోయారు. ఈ శతాబ్దంలో వివిధ శాస్త్రాల పరిచయంతో ముఖ్యంగా సామాజిక శాస్త్ర సహాయంతో, విశ్లేషణ సాధ్యమై వివిధ విషయాలు విశ్లేషించి విడమర్చే అవకాశాలు కలిగాయి.

తాపీవారు ఆదిలో 'ప్రజామిత్ర' పత్రికలో వ్యాస రూపంలో ప్రచురించినప్పుడూ, తర్వాత పుస్తక రూపంలో తెచ్చినప్పుడూ వారి పుస్తకంలోని సత్యాలు అప్రియాలుగానే ఎందరికో తోచినా ఆ సంగతులు అసత్యాలని మాత్రం ఎవరూ అనలేకపోయారు. ఏ మేధావైనా సరే తన ముందు కనబడే సత్యాలను చూసి ప్రశ్నించుకోకుండా వుండడు. తొలికూర్పు మనవి మాటలలో తాపీ వారు అందుకే ఇలాగ ఆదిలోనే చెప్పారు.

"అది నా తత్వంలో వున్న లోపమో, చదువులో వున్న దోషమో, శిక్షణలో వున్న కొరతో తెలియదు. నాకు ప్రశ్నలు నిశేషం. దాని అర్థం ఏమిటి? ఇది ఎందుకిలాగుంది? అది కాకపోతేనో ? ఇలాంటి ప్రశ్నలు వేలకి వేలు పుడుతూనే వుంటాయి." సంగతేమిటో తెలియాలని తెలుసుకుందామని ప్రయత్నిస్తున్న రోజులలోనే తాపీ వారికి "దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకు?" అనే ప్రాథమిక ప్రశ్నకు

అనుబంధంగా చాలా ప్రశ్నలు పుట్టాయి. వాటిని ఆయన ఇలాగ బేరీజువేశారు.

1. కోవెల అంటే అర్థం ఏమిటి?
2. అది ఇలాగే కట్టడమెందుకు?
3. వాటి మీదనూ, లోపలనూ ఆ బూతు బొమ్మలెందుకుండాలి?
4. ఈ వెంట్రుకల మొక్కుబడులేమిటి?
5. ఆ దేవత విగ్రహం అలా ఎందుకుంది?
6. ఈ దేవదాసీలెందుకు?
7. ఆ కామ దహనాలేమిటి?
8. ఈ పూజారుల ఆచారాలేమిటి?
9. వీళ్ళకున్న పేర్లెందుకొచ్చాయి?
10. ఆ సహస్రనామాల అర్థాలు తెలుసునా?

ఈ ప్రశ్నలన్నింటికీ కాకపోయినా కొన్నిటికైనా కొంతవరకైనా సమాధానాలు చెప్పడానికి తాపీవారు ప్రయత్నించారు. దేవాలయం మీద బూతుబొమ్మ లెందుకు? అనే ప్రశ్నకు స్పష్టంగా సమాధానం చెప్పారు. "బూతు అంటే ఇప్పుడు మనం చాలా అసహ్యంగా చూస్తూ వున్నాము గాని అది లో అది ఒక మహాకార్యం. ఒక ప్రజాసేవ, ఒక మహాభక్తి, ఒక పవిత్ర ఆరాధన. ఘనకార్యం... ఆ బూతు పనులు ఎక్కడో చెయ్యడంకాదు. సాక్షాత్తూ దేవాలయంలోనే చేయాలి. దేవుడి సన్నిధానంలోనే చెయ్యాలి. అందరికీ తెలిసినట్టే చెయ్యాలి. సిగ్గూ దాపరికమూ వుండనక్కరలేదు. ఇది అంతా నిజము." అని తాపీవారు స్పష్టపరిచారు. ఈ అదిమ సత్యాన్ని చాటడానికి అనేక దేశాల ఆచార వ్యవహారాలను తార్కాణాలుగా చూపారు. మన దేశంలోనివి కొంచెం తక్కువగానే ఉదహరించారు. దానికి కారణం కూడా చెప్పారు. "ఊరకే మన వాళ్ళకి కోపం తెప్పించడం ఎందుకని నేను ఇతర దేశాలకి పోతాను." అని విశదపరిచారు. (పుట - 75) "నేను ప్రత్యేకంగా మన దేశాన్ని గురించి వ్రాయవలసింది ఇంకా ఉంది." అని కూడా చెప్పారు. (పుట-80).

తాపీ వారి పుస్తకం రెండవ కూర్పు 1962లో బయటకు వచ్చింది. రెండవ ముద్రణ గురించి వారికి కొన్ని అభిప్రాయాలున్నాయి. "అనేక ఫోటోలతోనూ, విదేశీ మ్యూజియములలోనున్న చిత్రములతోనూ, చాలా ఖరీదైన కాగితముతో ఉదాత్తమైన పరిశోధన ప్రచురణగా ముద్రించవలెనని"వారి ఊహ. అయితే అది నెరవేరలేదు.

రెండవ ముద్రణ పాతికేళ్ళ క్రిందట జరిగింది. ఆ పుస్తకం బయటకు వచ్చాక నేను తాపీ వారిని చాలాసార్లు కలిశాను. ఇద్దరం కలసి ఎన్నో సినిమా చిత్రాలకు పనిచేశాం. "తాతాజీ! మీరు తెద్దామనుకున్న ఉదాత్తమైన ప్రచురణ సంగతేం చేశారు. కొంత పని జరిగిందన్నారు కదా!" అని అడిగేవాడిని. "ఇంకా జరగాలి భాయి ! టైము చిక్కడం లేదు." అనేవారు. ఏళ్ళు గడిచిపోయాయి. అర్థ శతాబ్దం క్రిందట సేకరించిన ఆధారాలతో రచించిన తొలి కూర్పు పాఠమే ఇప్పుడు ప్రచారంలో ఉంది.

ఈ ఏభై సంవత్సరాలలో పరిశోధనలు చాలా విస్తృతంగా జరిగాయి. సోషల్ ఆంత్రోపాలజీ, ఇండాలజీ మొదలైన శాస్త్రాల సహాయంలో ఆదిమ సమాజ లక్షణాలను

శాస్త్రీయ సామ్యవాద సిద్ధాంతాల వెలుగులో పరిశీలించి ఎన్నో కొత్త విషయాలను గుర్తించి ఒకనాటి సనాతన ధర్మం ఏమిటో అర్థం చేసుకునే స్థితిలో మనమిప్పుడున్నాం. డి.డి. కోశాంబి, రొమేలా థాపర్ వంటి మేధావులు మన ప్రాచీన చరిత్రను మార్క్సిస్టు దృక్పథంతో ఎలా అవగాహన చేసుకోవాలో నేర్పారు. ముఖ్యంగా కోశాంబి పరిశోధనా విధానాలకు నమూనాలా అన్నట్టు స్వీయ రచనలు పాఠ్య గ్రంథాలను చేశారు.

శూద్రుకుని మృచ్ఛకటిక నాటకంలోని మొట్టమొదటి సంభాషణా శకలాన్ని తీసుకుని ఆ మహోపాధ్యాయుడు మాతృకల పుట్టుపూర్వోత్తరాలపై గొప్ప పరిశోధన చేశాడు. తెర లేవగానే చారుదత్తుడు తన మిత్రుడు మైత్రేయుని చూసి "కృతొమయా గృహ దేవతాభ్యో బలిః గచ్ఛాత్వం అపి చతుష్పథే చమాతృ భ్యో బలిం వుసహార" అన్న డైలాగులోని చీలుదారులు, మాతృకలు, బలి అన్న మాటలలో ఆదిమ సమాజంలోని ఆచార వ్యవహారాలనూ, ఆర్థిక సూత్రాలను అట్టు పుట్టు ఆనవాళ్ళతో పరిశీలించి ఒక సమన్వయ సిద్ధాంతాన్ని కోశాంబి ప్రవచించాడు. ఆయన చూపించిన బాటలో సాగి పరిశోధనలు చేస్తే మన 'సనాతన' ధర్మాల స్వరూప స్వభావాలు స్పష్టమవుతాయి.

తాతాజీ తెద్దామనుకుని తీసుకారాలేకపోయిన ఉదాత్తమైన కూర్పు "దేవాలయంపై బూతు బొమ్మలెందుకు?"అనే అంశంపై ఎన్నాళ్ళ కిందటో రావలసి వుంది రాలేదు. తొలి కూర్పును కాగితం మీద పెట్టడానికే తాతాజీ ఎంతో జాప్యం చేశారు. 1926లో (అంటే నేను ఏడాది పిల్లాడిగా వున్న రోజులలో) తాతాజీ ఈ విషయంపై మిత్రలతో చర్చిస్తూ వుండేవారట. ఈ విషయాలు ప్రకటించమని స్నేహితులు శతపోరేవారట. మీరు రాయకపోతే ఎవరైనా రాసేస్తారని బెదిరించారట. ఆ గొప్ప వాళ్ళకెందుకు పోవాలి అని అడిగేవారట. "మరేమీ ఫరవా లేదు. అయిదు సంవత్సరాలు గడువు ఇస్తాను. ఈలోగా ఎవ్వరూ ఆ పని చేయరు అని కొంచెం గర్వంగా" తాతాజీ చెప్పారట. ఆ అయిదూ, మరి అయిదూ కూడా అయినాయి, సంవత్సరాలు–ఈ విషయం ఎవరూ తలపెట్టలేదు. అని తాతాజీ 1936లో తొలి కూర్పు మనవి మాటలలో చెప్పారు.

ఉదాత్తమైన ప్రచురణ కోసం నేను తాతాజీని "వేధిస్తు"న్న రోజులనుంచే ఈ సమస్య మీద ఎవరైనా ఒక కొత్త కూర్పును తెస్తారా అని ఎదురుచూస్తూనే వున్నాను. ఇప్పటి దాకా ఆ విషయం ఎవరూ తల పెట్టలేదు. నా దగ్గర ఆకరాలెన్నో వున్నాయి. తీసుకున్న నోట్సు ఇన్నీ అన్నీ కావు. శాస్త్రీయ సామ్యవాద దృక్పథంతో ఈ అంశాన్ని ఇప్పటికే కొంత మధించి వున్నాను. సమగ్ర ఆంధ్ర సాహిత్యం పూర్తి చేసే ముందు ఈ సమస్య మీద ఒక గ్రంథం రాద్దామా అనే ఆలోచన లేకపోలేదు. రాయమంటున్నారు ప్రకాశకులు. రాయనా? మాననా? అన్న ఊగిసలాట ఆగిపోయింది. రాయడానికే నిశ్చయించాను. విబుధవరులవల్ల విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేటపరచటం బాధ్యతగల పరిశోధకుని ప్రథమ కర్తవ్యం.

# గుడిలో సెక్సు కార్యం

ప్ర: దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు?

జవాబు: దేవాలయాలలోనే ఈ బూతు పనులు చేయాలి కాబట్టి!

ఆ ప్రశ్న గానీ ఈ జవాబుగానీ ఈనాడు కొందరికి వెగటుగా ఉండొచ్చు. దేవాలయం చాలా పవిత్రమైన ప్రదేశం కనుక అక్కడ పుణ్యకార్యాలూ, శుభప్రదమైన పూజలూ, అర్చనలూ మొదలైనవి జరుగుతాయి అనే భావం ప్రజలలో వేళ్ళూని దిట్టంగా ఉంది. కనుక – "దేవాలయంలోనే బూతు పనులు జరగాలి" అనే వాదన విడ్డూరంగా ఉన్నట్టు తోచడంలో ఆశ్చర్యం లేదు.

అయితే బూతు అపవిత్రమైన కార్యం కాదు. బూతు లేకపోతే సృష్టి లేదు. ఎనభై నాలుగు లక్షల జీవరాశిలో ఏ ఒక్కటీ బూతులేక పుట్టలేదు. బూతుకు కావలసిన రసాయనిక తతంగం శారీరకంగా జరగకపోతే జీవోత్పత్తి జరిగే అవకాశమే లేదు.

ఇంతకీ "బూతు"అనే మాటకు అర్థమేమిటి?

తెలుగు, కన్నడ భాషలలో ఈ పదముంది. రెండింటిలోనూ ఒకే రకమైన అర్థాలను నిఘంటువులు చెపుతున్నాయి. అయితే "బూతు"అన్న దానిని కేవలం నోటి మాటకే పరిమితం చేశారు. బూతంటే కుచ్చితపు తిట్టు, అశ్లీల పదం, సిగ్గులేని మాట మొదలైన అర్థాలే ఇచ్చారు. లోకుల వాడుకలో బూతు అనే పదాన్ని మాటకే కాక చేతకు కూడా విశేషణంగా వాడతారు. మాట నలుగురిలోనూ అంటే తప్పు కనుక చేత ఎలాగూ బాహాటంగా చేసేది కాదు కనుక మాట గురించే పట్టింపు వచ్చింది.

ఆధునిక సభ్య సమాజంలో బూతు లేక సెక్సు అనే చేతలు నాలుగు గోడల మధ్య ఇతరుల కళ్ళపడకుండా స్త్రీ పురుషుల మధ్య గుట్టుగా జరిగే కాముక వ్యాపారం అన్న భావం చాలా ప్రబలంగా ఉండడం వల్ల, ఆరాధనలు జరిగే ఆలయంలో బూతు పనులు చేయడమనే ఆలోచనే ఘోరాతి ఘోరంగా, మహా పాతకంగా తోచడం తప్పు కాదు. అందుకే గుడిలో మానవ మాత్రుల సెక్సు ఎంత మాత్రం పనికి రాదు. అది నుండీ ఆలయం దివ్య సెక్సుకే అంకితం.

దేవాలయాలలో మగ దేవతలూ ఉంటారు; ఆడ దేవతలూ ఉంటాయి. ఈ దంపతులను విడి విడి గర్భాలయాలలో ప్రతిష్ఠ చేసి ఉంటే రాత్రిపూట పవళింపు సేవలలో వాళ్ళను కలపడం గుడి సేవలలో ముఖ్యమైనది. తెల్లవారు ఝామున అమ్మవారు తన కేళికా మందిరంనుండి స్వీయమందిరానికి వెళ్ళిపోతుంది. ఆ వెళ్ళే తీరు ఎంత మనోహరంగా ఉంటుందో క్షేత్రయ్య లాంటి భక్తులు ఊహించుకుని ఆ సౌందర్యాన్ని శృంగార పదాలలో నిక్షిప్తం చేశారు. మోహన రాగంలో క్షేత్రయ్య పాడిన పదాన్ని చూడండి.

మగువ తన కేళికా మందిరము వెడలే
వగకాడ మాకంచి వరద తెలవారెననుచు ॥ మగువ ॥

విడజారు గొజ్జంగి విరిదండ తోను
కడు చిక్కు బడి పెనగు కంటసరితోను
నిదుదకన్నులదేరు నిదుర మబ్బుతోను
తొడరి పదయుగమున దడబడెడు నడతోను ॥మగువ॥
సొగసి సొగయని వలపు సొలపు జూపులతోను
వగవగల ఘనసార వాసనలతోను
జిగిమించు కెమ్మోని చిగురు కెంపుల తోను
నగముకుచముల విదియ చందురులతోను ॥మగువ॥
తరితీపు సేయు సమసురతి బడలికతోను
చిరుతపావడ జిలుగు జార్పయిట తోను
యిరుగడల కైదండలిచ్చు తరుణుల తోను
పరమాత్మ మువ్వగోపాల! తెల్లవారెననుంచు ॥మగువ॥

ఈ పదంలో తెల్లవార్లూ రతికేళిలో పారవశ్యం చెంది అలసి సొలసిన నాయిక వర్ణన మనోజ్ఞంగా ఉంది. దీనిని ఏ పరిస్థితిలో క్షేత్రయ్య రచించాడో వివరించే ఐతిహ్యం కూడా ఒకటి ప్రచారంలో ఉంది. ఈ కథను శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు చెప్పారంటూ శ్రీ విస్సా అప్పారావు గారు తాము సంకలనం చేసిన "క్షేత్రయ్య పదములు" అనే గ్రంథం పీఠికలో చెప్పారు.

"ఒకనాడు క్షేత్రయ్య కంచి వరదరాజుల దేవళమందు రాత్రి పూజలను దర్శించినాడు. రాత్రి వరదునికి శయ్యాసనము సమర్పించి అర్చకులు, భక్తులు అమ్మవారి విగ్రహమును ఆమె ఆలయము నుండి వరదరాజు దేవళమునకు తీసుకొనివచ్చి విజయం చేయించి, తలుపులు వేసి వెడలిపోయిరి. ఏ మూలనో చీకటిలో కంబమునకు చేరగిలబడి కన్నులు మూసికొనియున్న ఈ పదాల పిచ్చయ్య నెవ్వరును గమనించలేదు. ఇతని ధ్యాంతర దృష్టి యంతయును కేళీ మందిరంలోని అమ్మ, అయ్యల అలౌకిక శృంగార రసానుభవ భావనలో లీనమైయున్నది. (1)

తెల్లవారు ఝామున నితడు యోగ నిద్ర మేల్కొని కన్నులు తెరవగా మెట్ల నుండి దిగివచ్చుచున్నట్లు ఒకానొక, స్త్రీ వ్యక్తి కనిపించెనట. వెంటనే మోహన రాగము ఝంపె తాళములో "మగువ తన కేళికా మందిరము వెడలె..." అను పదము పాడెనట. ఈ పదమును గూర్చి వేరొక రీతిని నేను విని యున్నాను. తంజావూరులో ఒకనాడు క్షేత్రయ్య తాను రాసిన పదములను వీర రాఘవునికి వినిపించుటకై ఉదయముననే కోటలోనికి వెళ్ళు సమయమున వీరరాఘవుని పట్టపుదేవి కేళికా మందిరము నుండి తెల్లవారెనను ఆత్రముతో వెడలి వచ్చుట క్షేత్రయ్య చూచెనట, అందుపైని వెంటనే ఆ దృశ్యమును తొందరగా పద రూపమున వర్ణించి వీరరాఘవునికి వినిపించెనట" *

* గమనిక: తంజావూరు పాలకుడు విజయ రాఘవనాయకుడు గాని రాళ్లపల్లి వారు చెప్పినట్లుగా వీర రాఘవుడు కాదు.

కవులు దేవాలయంలోని కేళికా మందిరంలోని "అమ్మ, అయ్యలు ఆడే అలౌకిక శృంగార రసానుభవ భావన చేయడం ఏ భాషా సాహిత్యంలోనైనా మామూలే. మానవులలాగే వాళ్ళూ రతిలో అలసిపోతారు. క్షేత్రయ్య కన్నా ముందువాడు అన్నమాచార్యులు కూడా "అమ్మ, అయ్యల అలౌకిక శృంగార రసానుభవ భావన" చేశారు. రతికేళిలో అలసిపోయిన అలమేలు మంగ అయ్య శయ్యపైన నిదురించే దృశ్యాన్ని ఇలా వర్ణించారు.

పలుకుతేనెల తల్లి పవళించెను.
కలికితనముల విభుని కలసినదిగాన ॥ పలుకు ॥
నిగనిగని మోముపై నెరులు గెలకుల చెదర
పగలైనదాక చెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారినదాక
జగదేకపతి మనసు జట్టిగొనెగాన ॥ పలుకు ॥
కొంగు జారిన మెరుగు గుబ్బలొలయగ తరుణి
బంగారు మేడపై పవళించెను
చెంగలువ కనుగొనల సింగారములుదొలక
అంగజగురునితోడ – అలసినదిగాన ॥ పలుకు ॥
మురిపెంపునటనతో ముత్యాల మలగుపై
పరవశంబున తరుణి పవళించెను
తిరువెంకటాచలాధిపుని కౌగిటగలసి
అరవిరై నునుచెమట నంటినదిగాన ॥ పలుకు ॥

[4.74]

అన్నమాచార్యులు క్రీస్తు శకం 15వ శతాబ్దం కవి. క్షేత్రయ్య 17వ శతాబ్దంలోని పదకర్త. ఈ శృంగార కవుల కాలంలో తెలుగుదేశంలోని దేవాలయాలలో అమ్మ – అయ్యల విగ్రహాలనే శయ్యాసనాలపై పడుక్కోబెట్టి "అలౌకిక శృంగార రసానుభవ భావన" మాత్రమే జరిగేదనుకోరాదు. కేవలం విగ్రహాల మూలంగానే కాక ప్రాణమున్న వ్యక్తుల ద్వారా "లౌకిక శృంగార రసానుభవ భావన" కూడా జరిగేది. గుళ్లో సెక్సు సేవల కోసమే దేవదాసీలను అంకితం చేశారు.

దేవదాసీలు దేవుని వధువులు. రజస్వల కాక ముందే గుడి సేవ కోసం ప్రత్యేకించిన అమ్మాయికి దేవునితో పెళ్ళి అయిపోతుంది. పెళ్ళయ్యాక గుడి ఏ రాజు గారి ధర్మకర్తృత్వంలో ఉందో ఆయన గారి పడక గదికి వెళ్ళి ఆ దేవవధువు ప్రభువు గారి శయ్యను చేతితో స్పృశించాలి. రాజుగారు ఆమె కళ్ళల్లో కళ్ళు పెట్టి చూస్తారు. ఈ చూపుల కలయిక ఉత్తరోత్తరా పిల్ల ఈడేరాక జరిగే అంగ సంగమానికి నాంది. దేవదాసీ పెద్ద మనిషి అయ్యాక దేవునితో కాక దేవుని ప్రతినిధి అయిన రాజుతోగాని, ఆలయానికి చెందిన ప్రధాన బ్రాహ్మణునితో గాని ప్రథమ సంయోగం విధిగా జరగాలి.

అంతేకాదు. పూర్వకాలంలో, సత్య యుగంలో అని చెప్పుకునే ప్రాచీన యుగంలో, దేవదాసీలు దేవుని శయ్యాసనం కింద రాత్రిపూట పడుకునే వాళ్ళు. రాత్రి

కట్టకడపటి సేవ ముగిశాక దేవదాసీ గర్భ గృహంలోనికి ప్రవేశించేది. మిగతా అర్చకులూ, అందరూ బయటికి వచ్చేసి – గర్భగృహం తలుపులు బయట నుంచి మూసేసేవారు. దేవదాసీ కాషాయ వస్త్రాలు ధరించేది. తెల్లని పూలను ముడుచుకునేది. తలకు నూనె రాసుకొనడంగానీ, కురులు దువ్వుకొనడంగానీ నిషిద్ధం. దేవదాసీ కేవలం సన్యాసిగానే గర్భగుడిలో శయనించాలి. తెల్లారాక గుడి సేవకులు వచ్చి బీగముద్రలు పరీక్షించి తలుపులు తెరిచాక దేవదాసీ బయటకి వచ్చేది. ఇది పూరీ జగన్నాథంలో జరిగే తంతు.[1]

మన తెలుగునాడులో కూడా ఇటువంటి ఆచారం లేకపోలేదు. గోదావరి మండలంలోని పలివెల గ్రామంలోని కొప్పేశ్వర స్వామి ఆలయంలోని దేవదాసీలు తమ సేవా జీవితాన్ని ప్రారంభించినప్పుడు గర్భ గుడిలో మూడు రాత్రులు వరుసగా మూడు నిద్రలు చేసేవారు. ఒకసారి ఒక అర్థరాత్రి పూట ఒకానొక దేవదాసీ "అదృశ్యం" కావడం వల్ల ఈ ఆచారానికి స్వస్తి చెప్పారట.[2]

గుడి సేవకు అంకితమైన దేవ వధువులుండే ఇతర దేవాలయాల్లో కూడా ఈ ఆచారం ఉండే ఉండాలి. పూరీ జగన్నాథంలోనూ, పలివెలలోనూ దేవదాసీ రాత్రుల్లా గర్భ గుడిలో పడుకునే సంప్రదాయం ఉండ బట్టి రెండుచోట్లా ఒకే రకం కథలు కూడా ప్రచారంలోకి వచ్చాయి.

పలివెలలోని దేవుని పేరు ఆదిలో అగస్త్యేశ్వరుడు. ఈ స్వామికి కొప్పేశ్వరుడనే పేరు రావడానికి ఒక కథ చెప్పారు. ఆ స్వామికి అర్చనలు చేసే పూజారి యువకుడు వేశ్యాలోలుడయ్యాయట. ఇది ఊరి వారికి కిట్టలేదు. అందుచేత పూజారి చిన్నవాడి గురించి రాజుకు ఫిర్యాదు చేశారు. నిజా నిజాలు తెలుసుకుందామని ఒకనాడు రాజు అకస్మికంగా ఆ గ్రామానికి, గుడికి విచ్చేశాడు. పూజారి యువకుడు వేశ్యా గృహంలో సల్లాపమ్మాడుతున్నాడు. రాజు వచ్చాడు కనుక గుడి తలుపులు తెరిచి దేవుని నిర్మాల్య రూపంలో ఒక మాలికను రాజుకు ఇవ్వడం ఆచారం. గుళ్ళో దేవునికేవిధమైన పుష్పమాలతో సేవ చేయలేదు. కనుక పూజారి చిన్నవాడి వేశ్య జడలోని పూల దండను తీసుకొని గుడికి చేరుకున్నాడు. రాజు తల మీద స్వామి వారి పాదుకలను ఉంచి, దోసిట్లో ఆ మాలను ఈశ్వర నిర్మాల్యంగా ఉంచాడు.

ఆ దండలో వేశ్య శిరోజ మొకటి అంటుకొని ఉంటే దాన్ని పూజారి యువకుడు గుర్తించలేదు. జనం చూశారు. రాజు చూశాడు.– "ఏమిటీ తలవెంట్రుక. నీ వేశ్యదా?" అని అడిగాడు. పూజారి తడుముకోకుండా "ఇది స్వామిదే స్వామి వారికి కొప్పు ఉంటుంది. ఆ కొప్పులోని వెంట్రుకని చెప్పాడు. రాజు కొప్పును చూపించమన్నాడు. "రేపు ప్రాతఃకాలంలో గానీ స్వామివారి నాగాభరణాన్ని తీయడానికి వీల్లేదు. రేపు చూపిస్తాను." అన్నాడు పూజారి చిన్నవాడు. రాజు సరేనన్నాడు. రాత్రంతా పూజారి చిన్నవాడు భక్తితో దేవుణ్ణి ప్రార్థించాడు. దేవుడు ఆదుకున్నాడు. మర్నాడు ప్రొద్దుటికి స్వామికి కొప్పు మొలిచింది. రాజు ఇందులో ఏదో మోసముంది అనుకున్నాడు. ఆ కొప్పు పట్టుకుని కొన్ని కేశాలను ఊడబెరికాడట. లింగం నుండి రక్తం చింది రాజు కన్నులకు మసకలు కమ్మాయట. రాజు చెంపలు వేసుకున్నాడు.

పూజారి యువకుని మెచ్చుకుని అతనికి మాన్యం దానం చేశాడు.[3]

సరిగ్గా ఇటువంటి కథే పూరీ జగన్నాథంలో కూడా చెప్పుకుంటారు. చాలా కాలం కిందట ఒక పండా రాత్రంతా దేవదాసి ఇంట్లో గడిపాడు. ప్రాతఃకాలభోగానికి ఆలస్యమైంది. రాజు వస్తున్నాడు. పండా అతనికి ఇవ్వడానికి దేవదాసి జడలోని పూలు తీసుకొని వెళ్ళాడు. రాజుకి ఇచ్చాడు. పూలమాలలో పొడుగాటి శిరోజముంది. రాజు ఆగ్రహించాడు. పండాని ఉరి తీయిస్తానన్నాడు. పండా జగన్నాథస్వామి వారికి కొప్పుందనీ ఆ శిరోజం దానిలోనిదే అన్నాడు. మర్నాడు ప్రొద్దున్న నిజం నిరూపిస్తానన్నాడు. రాజు మర్నాడు సంశయించి ఆ కొప్పును పట్టుకు పీకాడు. నెత్తురు చిందింది. రాజు పశ్చాత్తాపం చెందాడు. పండాకి శిక్ష తప్పింది.[4]

ఇటువంటి కథే కృష్ణా జిల్లా దివిసీమలోని శ్రీకాకుళ క్షేత్రంలో కూడా చెప్పుకుంటారు. క్రీస్తు శకం మూడవ శతాబ్దంలో త్రిలోచన పల్లవుడు ఆహ్వానిస్తే ఇక్కడ బ్రాహ్మణులు స్థిర పడ్డారట. అయితే క్రీ.శ. 1088 నుండే ఈ సీమలో శాసనాలు లభిస్తున్నాయి. కాకుళ స్వామి ఆలయం ప్రాచీన మైనదే. దేవర కోట పాలించిన కోదండ రామన్న గారి కాలంలో జరిగిన ఒక సంఘటన ప్రచారం లోనికి వచ్చింది. కాకుళస్వామివారి ఆలయం అర్చకుడు రసికుడు. భోగం పిల్లను ఉంచుకున్నాడు. రాజుగారు ఆలయానికి అకస్మాత్తుగా వచ్చినపుడు ఉంపుడు కత్తె కొప్పులోని పూల దండనే పట్టుకొచ్చి నిర్మాల్యంగా ప్రభువుకు ఇచ్చాడు. దేశమేలే రాజు దండలో శిరోజం చూశాడు. ఇదేమిటని ప్రశ్నించాడు. ఏం సమాధానం చెప్పాలో తోచక పూజారి "ఇది స్వామి వారి కొప్పులోనిదే" అని చెప్పాడు. రాజు వెంటనే ఆకొప్పుని చూపించమన్నాడు. పూజారి చిన్నవాడు దేవుని మీద భారం వేశాడు. రాజు విగ్రహం వెనుకకు వచ్చి చూస్తే స్వామి వారికి వాస్తవంగా ఒక కొప్పు ఉంది.[5]

ఈ అన్నీ కథలు ఒక్కలాగే ఉండడం వల్ల ఒకానొక కాలంలో దేవవధువుల జడలోని మాలనే స్వామి వారికి అర్పణ చేసి దాన్నే ప్రధాన భక్తులకు నిర్మాల్యంగా ఇచ్చేవారా అన్న సందేహం కలుగుతోంది. ఇది బహుశా సనాతనాచారమేమో అన్న అనుమానం రావడానికి ఇంకో కథలోని అంశాలు కూడా కారణాలే. అది చాలా ప్రసిద్ధమైన కథే.

శ్రీ వైష్ణవ సంప్రదాయంలో పన్నెండు మంది పరమ యోగులున్నారు. వాళ్ళనే ఆళ్వారులంటారు. వీరిలో విష్ణుచిత్తుడనే పెరియాళ్వారు కథా, ఆయన పెంచిన కూతురు గోదాదేవి అనే ఆండాళ్ కథా శ్రీకృష్ణ దేవరాయలు రచించిన "ఆముక్తమాల్యద" అనే కావ్యంవల్ల తెలుగు సాహిత్య లోకానికి పరిచితమైనవే. వైష్ణవులు గోదాదేవినే "చూడికుడుత్తమ్మ" అని పిలుస్తారు. ఈ ద్రావిడ పదబంధాన్నే రాయలు "ఆముక్తమాల్యద" అని సంస్కృతీకరించాడు. దీనికి అర్థం "ముడిచి ఇచ్చిన ముగుద"అని.

ఆమె కథను పరిశీలిద్దాం.

విష్ణుచిత్తునికి తులసి వనంలో ఒక ఆడపిల్ల దొరికింది. ఆమెను అతడు పెంచాడు.

ఆమెకు యౌవ్వనం వచ్చింది. విష్ణుచిత్తుడు శ్రీ విల్లి పుత్తూరులోని స్వామి వారికి రోజా పుష్పమాలా కైంకర్యం చేస్తుండేవాడు. ఆయన మాలలు గుచ్చి సిద్ధం చేశాక ఆయన చూడకుండా వాటిని గోదాదేవి తన కొప్పులో చుట్టుకొని తన అందాన్ని పూమాల సొగసునీ చూసుకొని మురిసిపోయి, ఆ మాలను భద్రంగా పూల సజ్జలో పెట్టేసేది. విష్ణుచిత్తుడు ఈ సంగతి తెలియక స్వామి వారికి ఆ మాలనే సమర్పణ చేస్తూ ఉండేవాడు.

ఒకనాడు స్వామి వారి కోసం తాను కట్టిన మాలను తన కుమార్తె కొప్పులో పెట్టుకొని "అపవిత్రం" చేయడం ఆయన కంటబడింది. ఆయన కుమార్తెను మంద లించి ఆనాడు వ్యవధి లేనందున దేవునికి పుష్పమాలా కైంకర్యం చేయలేదు. ఆ రాత్రి స్వామి వారు విష్ణుచిత్తుని కలలో కనబడి కైంకర్యం చేయనందుకు కారణమడిగాడట. "స్వామీ! నా కూతురు ముగ్ధ కాబట్టి తెలియక అపచారం చేసింది. ఆమె ధరించిన మాలను తమకు ఎలా సమర్పించను? క్షమించండి." అని విన్నవించుకొన్నాడు. అప్పుడు స్వామి వారు ఇలా చెప్పారట. "ఓయి అమాయకుడా! ఆమె తాల్చి ఇచ్చిన మాలికే మాకు ఆనందదాయకం. ఇంతకు ముందు ఆ ఆనందం పొందాము. ఇక మీదట కూడా పొందుతాము. నీవు తప్పకుండా ఆమె మొదట తన కొప్పులో దాల్చిన మాలికనే నాకు సమర్పించు. ఆమె కొప్పుతో సంపర్కం లేని మాలికను నేను స్వీకరించను."

స్వామి వారు ఇంత నిష్కర్షగా చెప్పాక విష్ణుచిత్తుడు ఆ మర్నాటి నుంచీ ఆమె తన కుమార్తె అన్న భావన మానుకొని పరదేవతా భావంతో చూసేవాడు. గోదాదేవి ఉత్తరోత్తరా స్వామి వారినే కోరి వివాహం చేసుకుంది. ఆమె శ్రీరంగంలోని రంగనాథుని వధువు అయింది.

పూరీ జగన్నాథం, పలివెల శ్రీకాకుళం విల్లిపుత్తూరు ఆలయాలలోని కథలలో సామ్యాలున్నాయి. పూరీలోనూ, పలివెలలోనూ దేవదాసీలు గర్భాలయంలో కనీసం మూడు రాత్రులు స్వామి వారి శయ్యాసనం కింద మూడు నిద్రలు చేసేవారు. పూరీలోని దేవదాసీ సన్యాసినిలాగా కాషాయవస్త్రాలు ధరించినా తెల్లని పూలు శిరస్సున ధరించేది. పూరీలోనూ, పలివెలలోనూ, శ్రీకాకుళంలోనూ దేవ వధువు ముడిచి ఇచ్చిన పూలనే రాజుకి ఇచ్చారు. విలిపుత్తూరులో స్వామి వారే వాటిని కోరారు. విల్లిపుత్తూరు కథలో ఆముక్తమాల్యద ఉత్తరోత్తరా దేవ వధువు అయింది. అన్ని దేవళాల కథలలోనూ కేశ సంపర్కమైన పువ్వులున్నాయి. ఈ కథల్లో ఏదో రకంగా గుళ్ళో సెక్సు ప్రసక్తి కనబడుతుంది.

గుళ్ళో సెక్సంటే గుడి గోడల మీద, గోపురాల మీదా బూతు బొమ్మల శిల్పాలే కాదు; సెక్సు కార్యం కూడా జరుగుతుందని తేలింది. ఇది అమ్మా-అయ్యల విగ్రహాల బొమ్మలాట మాత్రమే కాదు. దేహధారుల ప్రమేయం కూడా ఉందని తేలింది. అలౌకిక శృంగార రసానుభవ భావన మాత్రమే కాదు; ఐహికం కూడాను. గుడి అంటే ఏమిటి? అక్కడ సెక్సు కార్యమెందుకు జరగాలి? ఈ ప్రశ్నలకు ముందు సమాధానాలను తెలుసుకోవడం అవసరం.

## అధో జ్ఞాపికలు

[1] ఫ్రెడిరిక్ ఆఫెల్ మార్గిలిన్: వైఫ్స్ ఆఫ్ ది గాడ్ కింగ్ - పుట -93

[2] ఎస్. కె. చటర్జీ "దేవదాసి[టెంపుల్ డాన్సర్] [పుట - 63]

[3] "శ్రీ భీమేశ్వర పురాణం" శ్రీనాథకృతం. చిలుకూరి పాపయ్య శాస్త్రి గారి పీఠిక. పుటలు 92, 93, 94

[4] మార్గిలిన్ గ్రంథం - పుట 92]

[5] గార్డెన్ మెకంజీ - మాన్యువల్ ఆఫ్ కృష్ణాడిస్ట్రిక్ట్ - పుట 2:4.

# గుడి అంటే ఏమిటి ?

"గుడి" అన్న మాట ద్రావిడ భాషా పదం. ఇవాళ దేవాలయం అన్న తత్సమ పదానికి సమానార్థకంలో దీనిని వాడుతున్నాం. ఒక్క తెలుగులోనే కాక ఇతర ద్రావిడ భాషలలో కూడా దేవళం అన్న అర్థంలో ఈ మాటని వ్యవహరిస్తారు. అయితే గుళ్ళూ, గోపురాలు చాలా కాలం తరువాత మనకు సంక్రమించిన సంప్రదాయానికి చెందినవి. ద్రావిడ జాతులు మన దేశంలో ఆర్యులు రాక ముందూ ఎన్నో యుగాలుగా జీవిస్తూనే ఉండేవి. ఆ జాతులు వాసం చేసే ఇళ్ళను కుటి, గుడి, గుడిసె– మొదలైన మాటలతో పిలిచేవారు.

ఆదిలో గుడి మానవులు నివసించే కుటీరమే. ద్రావిడ భాషలలో ప్రాచీనతమమైన సాహిత్యమున్న తమిళ భాషలోని ఈ మాటకున్న అర్థాన్ని చూస్తే అసలు అర్థం అవగాహన చేసుకోగలం: తమిళంలో క,చ,ట,త,ప అనే వర్గ ప్రథమాక్షరాలేగాని, వర్గ ద్వితీయ, తృతీయ, చతుర్థాక్షరాలు మన తెలుగులో ఉన్నట్లు ఉండవు. అందుచేత పరుషాక్షరాలతోనే మాటలు రాస్తారు. కొన్ని మాటలు రాసినట్టే పలుకుతారు. ఇతర ద్రావిడ భాషలలో "గుడి" అని రెండు సరళాక్షరాలతో పలికే మాటను తమిళంలో "కుటి"అని వ్యవహరిస్తారు. తమిళంలో లాగే మళయాళంలో కూడా "కుటి"అనే పదమే ప్రచారంలో ఉంది.

తమిళంలో "కుటి"అంటే ఇల్లు, నివాస ప్రదేశం, కుటుంబం, వంశం, పట్టణం, కాపురస్తులు అనే నానార్థాలున్నాయి. మళయాళంలో ఈ అర్థాలతోపాటు "కుటి" అంటే పెండ్లాం అనే అర్థం కూడా ఉంది. ఇంకో ద్రావిడ భాష అయిన "తొద"లో కూడా కుటి అంటే హిందూ దేవాలయమని స్పష్టంగా అర్థం కనపడుతుంది. ఉచ్చారణలో పరివర్తన వల్ల కుటినే ఇతర ద్రావిడ భాషలలో "గుడి"అని పలుకుతారు. తెలుగు, కన్నడం, తుళు, పర్జి, కుయి భాషలలో "గుడి"అనే పదం కనబడుతుంది. కన్నడ, తెలుగు భాషలలో గుడిసెలు కూడా ఉన్నాయి. నేసిన కప్పున్న పాకలకే ఈ అర్థం వర్తిస్తుంది. కుయి భాషలో గుడి అంటే నట్టిల్లు అనే అర్థం కూడా ఉంది.

ద్రావిడ జాతులు, ఆదిలో తాము నివసించే ఇళ్ళలోనే తమ దేవుళ్ళు కూడా ఉండేవారని భావించేవారు. మళయాళంలో "కుటి" అన్న పదం ఒక్క భార్యకే కాక, తెగలేక జాతి అంతటికీ వర్తిస్తుంది. మళయాళం మాట్లాడే కేరళ దేశంలో ఆది నుంచి మాతృస్వామ్యమే ఉందన్న సంగతి మరచిపోకూడదు. పర్జి భాషలో గుడి అంటే విశ్రాంతి గృహం అనే అర్థం కూడా ఉంది.

ఆదిని ద్రావిడ జాతుల స్త్రీ పురుషులు ఇళ్ళలోనే నివసించేవారు. ఇళ్ళలోనే కాపురం చేసేవారు. ఇళ్ళలోనే సృష్టి కార్యమైన సెక్సు పనులు చేసుకునేవారు. షోడశ సంస్కారాలలో కొన్ని ఏ జాతికైనా ముఖ్యమే. ఆడపిల్ల పెద్ద మనిషి కావడం, పెళ్ళి, శోభనం, సీమంతం, పురుడు మొదలైన సంస్కారాలన్నీ సెక్సు పనులనే మూకుమ్మడి వర్గంలో చేర్చుకోవాలి. సెక్సు అంటే సంభోగమని పరిమితార్థంలో వాడకూడదు

ఇటీవల "సెక్సువాలిటీ"అనే మాటను సాంఘిక శాస్త్రజ్ఞులు తెలుగులో కూడా ప్రయోగిస్తున్నారు.

ద్రావిడ భాషలన్నింటిలో గ్రామం అనే అర్థంలో ఊర్, ఊరు అనే మాటల్నే వాడుతారు. తమిళంలో ఊరుకు పర్యాయపదంగా "కుటి"అన్న మాటను కూడా ఉపయోగిస్తారు. ఊరికేదైనా ఉపద్రవం వచ్చినా, విపత్తు వాటిల్లినా ఊరంతా కలిసే దేవతలకు కొలుపులు కొలుస్తారు. బలులు వేస్తారు. ద్రావిడ జాతుల జాతరలలో కరగలు లేక గరగలు సర్వసామాన్యం. కరకం అనే మాటకు తమిళంలో కూటము, సభ, కళాశాల, గరిడి కూటం అనే అర్థాలున్నాయి. మళయాళంలో కరకం అంటే దేవాలయం అనే అర్థం కూడా ఉంది. గుడి దగ్గర జనులు, సభ కూడడానికి ఉద్దేశించిన ప్రదేశాన్ని "అంబలం"అంటారు. మళయాళంలో ఈ మాట దేవాలయానికి పర్యాయపదం.

తెలుగు వారి వాస్తు పద జాలంలో "గుడి"అనే మాటకు మూడు రకాల అర్థాలున్నాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ చేసిన మంచి పనులలో ఒకటైన మాండలిక వృత్తి పదకోశము నాలుగవ సంపుటి వాస్తుపదజాలం అనే కోశం నుంచి ఈ క్రింది అర్థాలను సేకరించాను.

[1] గుడి: దేవళం:పెద్దిల్లు, దేవతల నుంచే కట్టడం. [పెద్దిల్లు అనే మాటను రాయలసీమలో, గుడి అనే అర్థంలోనూ, తెలంగాణాలో పెద్ద గది అనే అర్థంలోనూ ప్రయోగిస్తారు.]

[2] గుడి: కుప్ప, గుట్ట, తిప్ప, తిన్నె.

[3] గుడి: గుండ్రం, వర్తులం, వలయాకారం.

ఈ మూడు అర్థాలలో రెండవ వివరణ ఆదిలో మన గ్రామదేవతల గుడుల రూపం ఏమిటో విశదం చేస్తుంది. ప్రాచీన కాలంలోనే కాదు ఒక యాభై, అరవై సంవత్సరాల క్రిందట దాకా ఒక రాళ్ళ గుట్ట మాత్రమే గ్రామ దేవత గుడి చిహ్నంగా ఉండేది. ఉత్తరోత్తరా చిన్న మిద్దెలుగా, చౌడు మిద్దెలాగా కనిపించే చిన్న చిన్న కట్టడాలు గ్రామ దేవతల కోసం ఏర్పడ్డాయి. చుట్టు గుడిసె, చుట్టిల్లు కమ్మలిల్లు, చౌకపిల్లు వంటి ఆకారాలలో కూడా దేవళాలు కనబడతాయి.

ద్రావిడ జాతుల జనులు నివాసముండే కట్టడాలకు ఇంకో పర్యాయ పదం కూడా చాలా ప్రచారంలో ఉంది. గుడి దేవళాన్ని సూచించడం రూఢీ అయినట్టే ఈ మాట గృహానికి సంకేత పదం అయింది. ఇదే తెలుగులో "ఇల్లు"అనే అచ్చిక పదం. ఇతర ద్రావిడ భాషలలో కూడా ఇది ప్రసిద్ధమే.

తమిళంలో "ఇల్" అనే రూపమే కాక "ఇల్లం"అనే రూపం కూడా ఉంది. ఈ రెండింటికీ గృహము, నివాసము, చోటు అనే అర్థాలున్నాయి. ఇల్ అనే రూపానికి భార్య అనే అర్థమున్నా పెళ్ళాం అనే అర్థాన్ని సూచించడానికి "ఇల్లవళ్, ఇల్లాళ్" అనే మాటలను వాడుతారు. మళయాళంలో ఇల్ అంటే గృహమే గాని ఇల్లం అంటే

నంబూద్రి బ్రాహ్మణుల ఇల్లు అనే ప్రత్యేక అర్థం ఉంది. తుళు, తెలుగు, కొండ మొదలైన ద్రావిడ భాషలలో ఇల్లు అంటే గృహమనే అర్థం.

జనులు నివసించే ఇళ్ళలోనే ఒకచోట దేవతని నిలుపుకుని పూజించటం కూడా ప్రాచీనమైన ఆచారమే. ఇటువంటి దేవతలను ఇలవేల్పు అంటారు. ఈ వేల్పుని ఒక తిన్నెపై పెట్టడం ఆచారం..అందుకే తిన్నె అంటే గుడి అనే అర్థం కూడా ఏర్పడింది. ఈనాటికీ కూడా జనులు ఇళ్ళు కట్టుకునేటప్పుడు "దేవుడి గది" అనేది ప్రత్యేకంగా ఇంట్లో నిర్మించుకుంటారు.

దేవుడి గదికీ, దేవుని అర, దేవునర్ర, దేవుని కొటేడు, దేవుని కొట్టిడి, దేవునిల్లు, పడమటిల్లు, పడమర గది,సామికొట్టిడి అనే పర్యాయపదాలు ఉన్నాయి.[1] చుట్టు మిద్ది గదిలో కూడా తిన్నె, దీగూడు, గొడుగు చెక్క ఉంటాయి. ఈ గది వలయాకారపు గోడ ఉన్న ఒక ప్రక్కనే ఉంటుంది. [చిత్రం 1]




చిత్రం 1. చుట్టు మిద్దె గది

1. తిన్నె - 2 దీగూడు - 3. గొడుగుచెక్క

ద్రావిడ జాతుల జీవనం ఎప్పుడూ సంఘ జీవితమే. ఏ ఇంటి కాయిల్లు విడిగా దేవుని కొలుచుకొనడం చాలా అర్వాచీన సంప్రదాయం. అయినా ఇలవేల్పులూ, ఉమ్మడి గుడివేల్పులూ ఏర్పడ్డాక దేవుని ఇంటికో ప్రత్యేకమైన పేరు సమిష్టిగా అవసరమైంది. రాచరికాలు వచ్చాక రాజుకీ, దేవునికీ తేడా లేకపోయింది. తమిళ, మళయాళం భాషలలో కో, కకోన్,కోమాన్ అనే పదాలకు సామ్రాజ్యాధిపతి, రాజు, గొప్పవాడు, నాయకత్వం అనే అర్థాలున్నాయి. ఈ ప్రభువు కోసం కట్టిన కట్టడమే కోఇల్ అయింది. మన తెలుగులో కో అనే వ్యస్త ప్రయోగం లేదు గానీ, కోయిల,

కోవెల అనే రూపాలు ప్రచారంలో ఉన్నాయి. ముఖ్యంగా కోవెల అన్న మాటే గుడికి పర్యాయపదంగా ఉంది.

ద్రావిడ భాషలలో ఇంటికి ఇంకో పర్యాయ పదముంది. దీని రూపాలు ఇంటికీ, ఇల్లాలికీ వర్తిస్తాయి. తమిళంలో "మనై"అంటే ఇల్లూ, నివేశనం, ప్రాసాదం, భార్య, కుటుంబం అనే అర్థాలున్నాయి. మళయాళంలో "మన" అంటే ఇల్లనే కాక బ్రాహ్మణుని భార్య అనే అర్థం కూడా కనబడుతోంది. కన్నడంలో "మనె"అనే మాటకు ఇల్లు, గది అనే అర్థాలున్నాయి.

"మనెతన", "మంతన"అనే మాటలకు గృహ జీవితం అనే అర్థాలున్నాయి. తమిళంలో "మనైవి"అనే పదానికి భార్య అని అర్థం. ఈ పదాలలో మూల ధాతువు "మణ"అనే శబ్దానికి కలుపవలసిన, లీనము చేయవలసిన, పెళ్ళాడు, సంభోగించు, కాపురము చేయు, కౌగలించు – అనే అర్థాలు తమిళంలో ఉన్నాయి. "మణువు"అంటే సంభోగము, సారము, "మణం"అంటే ప్రేమికుల సంయోగం, పెళ్ళి, పరువు, హోదా, ఐశ్వర్యం అనే అర్థాలున్నాయి. తెలుగులో మనుము, మనువు అనే మాటలు వధూవరుల పెళ్ళిని సూచిస్తున్నాయి.

మనైవి అనే తమిళ పదానికి భార్య అన్న అర్థమే కాక గోపవన భూముల్లోగానీ, వ్యావసాయిక క్షేత్రంలోగాని నాయిక అనే ఒక అర్థమూ, గృహానికి యజమానురాలు అనే మరొక అర్థమూ ఉన్నాయి. ఈ ప్రత్యేకమైన అర్థాలు మాతృస్వామ్య ప్రాభవాన్ని సూచిస్తాయి. కుటి, ఇల్ అనే పదాలకు కూడా భార్య అన్న అర్థం వున్నట్టు చూశాం. ఇంటికి ఇల్లాలే పెద్ద. ఇల్లే కోవెల. ఇల్లాలే దేవత అనే భావనలు ద్రావిడ జాతుల సంస్కృతిలో తొలినుంచి ఉన్నాయి.

మనైవి వ్యావసాయిక క్షేత్రానికి యజమానురాలని పైన తెలుసుకున్నాం. సేద్యం చేసే భూమిని పొలం అంటాం. ఈ మాటలకు కూడా నానార్థాలున్నాయి. పైరు, పెట్టు నేల, సస్యము, చేను, అడవి, కాననం, పసుల బీడు, ప్రదేశము, స్థానము, ఎల్ల, సరిహద్దు, ఊరు, గ్రామము మొదలైన అర్థాలన్నీ పొలానికి సంబంధించినవే. మనైవి లేక ఇల్లాలు ఇంటికీ, పొలానికీ ఆదిలో అధికారిణి. ఉత్తరోత్తరా మాతృస్వామ్యం స్థానంలో పితృస్వామ్యం వచ్చి ఆడది బానిస కన్నా హీన స్థితికి వచ్చిందిగానీ గుడి గురించి గానీ, గుడిలో జరిగే సెక్స్ పనులగురించి గానీ ప్రాథమిక అవగాహన కావాలంటే ప్రాచీన సమాజంలోని ఆచార వ్యవహారాలను తెలుసుకోవాలి.

గుడి యెంత ప్రాచీనమైన దంటే మన భారతదేశ చరిత్రలోని ప్రప్రథమమైన సింధునాగరికత అంత ప్రాచీనమైనది. ఆనాటి గుడిలో సెక్స్ కార్యాలు జరిగినవని పరమ ప్రామాణికమైన చరిత్రకారుల ప్రతిపాదనలు చేశారు. హరప్పా, మొహంజదారో తవ్వకాలలో బయటపడిన కట్టడాల వల్లా, వస్తువుల వల్లా, ప్రతిమల వల్లా, ముద్రల వల్లా, ఆనాటి ఆచార వ్యవహారాలను క్రోడీకరించారు. సింధు నాగరికతలో "పురోహిత ప్రభువు"లు ఉండేవారు.

మన పురాణాలలో, ఇతిహాసాలలో కనిపించే విపరీత సెక్స్ కథలను అర్థం చేసు



చిత్రం 2. సింధునాగరికత పురోహిత ప్రభువు

లంటే సింధు నాగరికతలో గుడికి ఉన్న ప్రముఖ స్థానాన్ని బోధపరుచుకోవాలి.

## అధో జ్ఞాపిక

మాండలిక వృత్తి పదకోశం, వాస్తు పదజాలం, పుట 213

దేవాలయాల మీద సెక్సుకి సంబంధించిన శిల్పాలలో అన్నీ సంభోగ చిత్రణలే ఉండవు. దేవతల ప్రతిమలు చాలా ఎక్కువ సంఖ్యలో ఉంటాయి. వివిధ ఆలయాలలోని మంటప స్తంభ చూళికలలో, గోడలమీద కోష్ఠ పంజరాలలో అర్ధ వలయాకారపు శిలాఫలకాలలో వివిధ ప్రతిమా శిల్పాలు ఉంటాయి. చాలామటుకు మానవులనే పోలిన ఈ స్త్రీ పురుష, ప్రతిమలను సురసుందరులు, అప్సరసలు, గంధర్వులు, విద్యాధరులు, కిన్నరులు, యక్షులు మొదలైన పేర్లతో పిలుస్తారు. వీటిని సాలభంజికలనీ, అలసాకన్యలనీ కూడా పేర్కొంటారు. ఈ శిల్పాలలో కేవలం స్త్రీ మూర్తుల చిత్రాలు ఎక్కువ సంఖ్యలో ఉన్నట్టు తోస్తుంది. ఆడా–మగా జంటలుగా ఉన్న ప్రతిమలను మిథునాలు అంటారు. ఆడా – మగా సంభోగ సుఖంలో ఉన్న శిల్పాలను మైథున ప్రతిమలంటారు. రాశిలో ఈ తరహావి మధ్యయుగాలలోనే ఎక్కువగా కనబడతాయి.

అప్సరలు, అలసాకన్యలు, యక్షిణులు సాధారణంగా వక్షోజం మీద కుచబంధం అనే చనుకట్టు పీలికను ధరిస్తారు. త్రిభంగి రూపంలోనే కనబడుతారు. ఆవరణ దేవతలూ, అలసాకన్యలూ వివిధ భంగిమలలో ఉంటారు. చెట్టును కౌగిలించు కొంటున్న సాలభంజికలు, తామరపువ్వును వాసన చూస్తున్న పద్మగంధులు, అద్దంలో అందం చూసుకుంటున్న దర్పణ హస్తలూ, మొగలిపువ్వును సిగలో పెట్టుకొంటున్న కేతకీభరతలూ, ఓరవాకిలిగా తెరచిన తలుపును ఆనుకొని చిలుకను పట్టుకొంటున్న తోరణ కన్యలు కాముకీ శిల్పాలలో కనబడతారు.

ఈ సురసుందరులకు ఆదిలో కుచబంధాలున్నా రానురాను చనుకట్టు పీలికలు అదృశ్యమై, వక్షోజాలు దృశ్యమానమయ్యాయి. మొలనూలు కింది వలువలు ఉలిపొరల్లా ఉండి రూపమంతా కళ్ళకు కట్టసాగింది. సాలభంజిక యక్షిలాగే అశోక దోహద క్రియలో యక్షులు, నిర్ఝరస్నానం అంటే నీళ్ళధార కింద స్నానం చేసే సుందరులూ కనబడతారు. ఈ కన్యలకు చెట్ల పేర్లూ, నదుల పేర్లూ, పెట్టేవారనిపిస్తుంది. కొందరు సురసుందరులకు నక్షత్రాల పేర్లు కూడా పెట్టేవారు. వాత్స్యాయనుడు తన కామసూత్రాల్లో పెళ్ళికి ఏయే పేర్ల కన్యలు అనర్హులో చెప్పాడు. వరణ విధానాధ్యాయంలో ఇలా మినహాయింపులు పెట్టాడు.

నక్షత్రాఖ్యాం, నదీ నామ్నీం వృక్షనామ్నీంచ గర్హితాం,
లకార రేఫోపాంతాంచ వరణే పరివర్జయేత్

[కామ–3–1–13]

చుక్కల పేర్లూ, చెట్ల పేర్లూ, నదుల పేర్లూ పెట్టుకొన్న కన్యలు ఎందుకు పెళ్ళికి పనికిరారంటే అసలు వాళ్ళు పెళ్ళి చేసుకోకూడదు. నదుల పేర్లున్న కన్యలను అప్సర, అప్సరస అంటారు. అప్సరము అంటే నీటి యందు తిరిగేది. అప్సరసలు పెళ్ళి చేసుకోరు గాని సెక్సు పనులే చేయాలి. వాళ్ళు నిత్య కన్యలు, సెక్సు పని

చేసినా కన్యాత్వం చెడని వాళ్ళు. మన పురాణాలు ఈ సంగతిని ఎన్నెన్నో కథలలో ఘోషిస్తున్నాయి. ఉదాహరణకు ఒక్క కథ చూడండి.

పూర్వం అద్రిక అనే అప్సరస యమునలో [మీనమయి] తిరుగుతూ ఉండేది. ఉపరిచర వసువు యొక్క వీర్యం వల్ల గర్భం దాల్చింది. ఒక కొడుకునూ, కూతురునూ కన్నది. ఆ కూతురును దాశరాజు పెంచుకొన్నాడు. సత్యవతి అని పేరు పెట్టాడు. ఆమెకు మత్స్యగంధి అని పేరు వచ్చింది. ఆ కన్య ఓడ నడుపుతూ ఇద్దరి నుండి అద్దరికి ప్రయాణీకులను దాటిస్తూ ఉండేది. ఒకనాడు పరాశరుడు ఓడ ఎక్కాడు. ఆమెను చూసి మరులు కొన్నాడు. ఓడలోనే క్రీడించాడు. సంతోషించాడు. "నాకు నిష్టంబు జేసిన దాన నీకన్యాత్వంబు దూషితంబుగాదు"అని చెప్పాడు. ఆమెకు గంధవతి, యోజనగంధి అనే పేర్లు పెట్టాడు. ఈ కలయిక వల్ల వాళ్ళకి వేదవ్యాసుడు పుట్టాడు. [చూ॥ మహాభారతం–ఆదిపర్వం తృతీయాశ్వాసం] సత్యవతి అప్సరస కూతురే. తానూ నీటిలో తిరుగేది కనుక అప్సరసే, పరాశరునితో రమించినా కన్యాత్వం చెడలేదు.

ఇటువంటి కథలు మన పురాణాల నిండా కోకొల్లలు, ముందు ప్రకరణాలలో అవసరాన్ని బట్టి ఆ కథలలో కొన్ని కొన్ని ప్రతిపాదనలను విశదీకరించడానికి చెప్పుకొందాం. ఇప్పుడు అప్సరసలు ఎంతటి ప్రాచీనులో సప్రమాణంగా తెలుసుకొందాం.

క్రీస్తు పూర్వం మూడువేల సంవత్సరాల క్రిందట అనగా ఇవాళ మన కాలానికి అయిదువేల సంవత్సరాల క్రితం సింధునది లోయలో బాగా పరిణతి చెందిన నాగరికత వికసించి నగరాలు వర్ధిల్లాయి. వీటిలో హరప్పా, మొహెంజదారో నగరాలు సుప్రసిద్ధాలు. ఇవి బాగా ఆలోచించుకొని ఒక ప్రణాళిక ప్రకారం కట్టిన పట్టణాలు. [చిత్రం 3] విశాలమైన వీధులు [34 అడుగులవి]: చక్కని దారులు [మూడు గజాలు] చాలా పొడుగ్గా[అరమైలు] ఉండేవి. ప్రతి ఇంట్లో ఒక బావి, స్నానాల గది, మరుగుదొడ్డి, వీధిలో భూమికి అడుగున ఉండే మురుగు కాలువ ఉండేవి. ఇరుకు సందుల్లో కూడా ఇళ్ళుండేవి. ఏ ఇల్లూ పురవీధిలోనికి చొచ్చుకుని ఆక్రమణ చేసేది కాదు.




హరప్పా పట్టణం

హరప్పాలో ఒక దొడ్డ కళంజం [ధాన్యపు కొట్టు] ఉండేది. 169 అడుగులు పొడుగూ, 135 అడుగుల వెడల్పూ ఉన్న పెద్ద కట్టడం. దీనికి 23 అడుగుల వసారా ఉండేది. ఈ బృహత్ ధాన్యాగారాన్ని నింపడానికి ఎంత పంట, పండిం చారో ఊహించుకోవచ్చు. ఆ ధాన్యాన్నంతా హరప్పా నాగరికతలోని స్త్రీపురుషులు వ్యావసాయిక దేవతల చలువ వల్ల పండించుకొనేవారు. 'దున్నక చల్లితే, కొయ్యక పండడం' అనేది మన తెలుగు సామెత. సింధు నాగరికతలో వంటలు అలాగే పండేవనుకొనేటంత అతిశయోక్తికి తావిచ్చేటట్లు ఆ పంట పండేది. [సింధు నాగరికత మట్టి సీళ్ళ గుర్తులలో ఎక్కడా నాగలి కనబడదని డి.డి. కోశాంబి రాశాడు] నాగలితో కాక, తొల్లికతో, గసికతో తవ్వితే చాలు. ఆ భూమి అంత సారవంతమైనది.

భూసారాన్ని పెంపొందించడానికి ఏ రైతైనా పూజలు ఈనాటికీ చేస్తాడు. అయిదు వేల సంవత్సరాల కిందట సింధు లోయలో కూడా అంతే చేసేవారు. సింధు జనులు ప్రకృతి మాతను, నేలతల్లిని, పూజించేవారు. సప్తమాతృకల ఆరాధన. ఆనాడే ఉందేమో అనిపించే మట్టి సీళ్ళు కొన్ని దొరికాయి. ఒక ముద్రికలో పంట తల్లి రెండు కొమ్మల మధ్య నించొని ఉంటుంది. ఆమె కుడివైపు ఒక గణాచారి మోకరిల్లి ఆరాధిస్తూ ఉంటుంది. ఆమె వెనుక బసవన్న ఉన్నాడు. కింద వరసలో ఏడుగురు అప్సరసలున్నారు. వీరు సప్తమాతృకలు కావచ్చు [చిత్రాలు 4, 5]



చిత్రం 4. సింధునాగరికతలో అర్చన మట్టి ముద్రిక

సింధు లోయలోని జనులు మాతృకల ఆరాధన చేసె వారనడానికి ఆ ప్రాంతాలలో దొరికిన చిన్న చిన్న స్త్రీ మూర్తుల మట్టిబొమ్మలు సాక్ష్యం. ఒక్క స్త్రీ వల్లనే సృష్టి జరగదు. పురుషుడు నిమిత్త మాత్రుడైనా ప్రకృతితో అతడు కలిస్తే గాని సృష్టి, పునః సృష్టి జరుగదు. సింధు జనులు శిశ్నదేవ గణాలవాళ్ళు, అనార్యులు, ఋగ్వేద జనులకు వీళ్ళు శత్రువులు, వీళ్ళ వల్ల ఆర్యులకూ ఆర్యుల వల్ల వీళ్ళకూ బాధలు చాలా ఉండేవి. అందుకే ఋగ్వేదంలో ఇంద్రుని దయ వల్ల వీళ్ళ పీడ విరగడయిందని అవాలని ఒక ఋషి ఇలా చెప్పాడు.

న యాతవ ఇంద్ర జూజువుర్నో న వందనా శవిష్ఠ వేద్యాభిః
న శర్ధదర్యో విషుణస్య జంతోర్మా శిశ్న దేవా అపి గుర్ఋతంనః
[ఋగ్వేదం 7-21-5]



చిత్రం 5. సైజు పెంచిన మట్టి ముద్రిక

ఈ ఋక్కుకు వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారి పరిష్కరణతో నేమాని వెంకట నరసింహశాస్త్రిగారి ఆంధ్రానువాదం ఇలాగ ఉంది.

"ఇంద్రుడా! రాక్షసులు మమ్ము హింసింపరు, బలవత్తమేంద్రుడా! రాక్షసులు మమ్ము ప్రజల నుండి వేరు పరుపలేరు, స్వామియగు నింద్రుడు విషమ జంతువధ విషయమై యుత్సాహవంతుడగును. శిశ్నదేవగణము మా యజ్ఞమునకు విఘ్నము చేయరు."

'సింధు జనులు శిశ్నదేవులని చెప్పడానికి శిల్పసాక్ష్యాలు ఆ నాగరికత తవ్వకాలలో బయటపడ్డాయి. ప్రామాణికులు వీటి గురించిన వివరణాత్మక వర్ణన చేశారు చూడండి.

సింధు నాగరికుల అవశేషములలో కొన్ని ముఖ్యములైన శిలామూర్తులు గలవు. కానీ సర్వాంగములు కల్గినవి లభ్యము కాలేదు. వీటిలో చెప్పదగినవి రెండు మొండెములు. ఇవి హారప్పాలో దొరికినవి. వీటిలో ఒకటి ఎరుపు రంగు గలది. రెండవది పలక రంగు గలది. మొదటి దాని యందు కాళ్ళు తల లేవు. మేఢ్రము చిత్రితమైయున్నది. కాని అది పగిలిపోయినది. చేతులు, తల యుండు చోట సొట్టలుండుటచే అచ్చట మరల వాటిని ఇముడ్చుటకు అవకాశమున్నదని ఊహించవచ్చును. [చిత్రాలు 6, 7]

రెండవదాని యందు కాళ్ళు పగిలిపోయినవి. కాని భుజములను, ఎడమ కాలి భంగిమను పరిశీలించినచో అది నాట్యము నుద్దేశించి శిల్పిచే తయారు చేయబడిన ప్రతిమ వలె కన్పడును'.[1]



చిత్రం 6. హరప్పాలోని నగ్న పురుష ప్రతిమ

మగవాళ్ళ శిలామూర్తుల్లో ఈ శిశ్నదేవుడూ, నాట్యసుందరుడు లభించితే ఈ నాగరికతలోనే ఒక నగ్న నాట్యసుందరి విగ్రహం కూడా దొరికింది. ఈ ప్రతిమ గురించి ప్రామాణికులు ఇలా చెప్పారు.

"మొహెంజదారో యందు లభ్యమైన కొలది కాంస్య విగ్రహములలో నృత్య భంగిమలో యున్న నగ్న స్త్రీ యొక్క చిన్న కాంస్య ప్రతిమ ఎంతో రమణీయముగ కనిపించును. దీనియందు యోని స్పష్టంగా శిల్పించబడినది. ఒక చేయి కటిపై ఎత్తియున్నట్లును మరియొక చేయి ఎడమ తొడపై ఉంటినట్లును చూపబడినది. ఎడమచేయి భుజము వరకు వలయములు గలవు. ముంజేతికి గాజులు మొదలైన ఆభరణములు గలవు.






చిత్రం 7. వివిధ కోణాలలో నగ్న పురుష ప్రతిమ రూపాలు

మెడలోని హారము చిన్న కుచ్చుతో వక్షోజము మీద చిత్రించబడియుండెను. కుడివైపున గల ధమ్మిల్లము ఎంతో రమణీయముగ కన్పట్టును. ముఖము గంభీరముగ నున్నది. ఈ ప్రతిమ ఆదిమానవుల నృత్యభంగిమను జ్ఞప్తికి తెచ్చును."

ఈ నగ్న స్త్రీ పురుషమూర్తులు ఎక్కడ నృత్యం చేసేవారు? ఏ ఆరాధనల నృత్యం చేసేవారు? సింధు నాగరికతలో దేవాలయాలు ఉండేవా? ఇవి సహజమైన ప్రశ్నలే.

సింధు నగరాలలో దొడ్డకళంజాల లాగే పెనుకోట కట్టడాలు కూడా ఉన్నాయి. ఇవి ఏభై అడుగుల ఎత్తు దిబ్బలు. ఇవి రక్షణ అవసరాల నిమిత్తం నిర్మించినవి కావు. మత సంబంధమైన సమావేశాల కోసం ఉద్దేశించినవే. ఈ కోట కట్టడం



చిత్రం 8. మొహంజదారోలో నగ్న నాట్యసుందరి

ఇతర మధ్యప్రాచ్య నాగరికతలలో ఒకటైన మెసపటోమియాలోని 'జిగ్గురట్' గోపురం లాంటిది. [చిత్రం-9]సుమేర్, బాబిలోన్ మొదలైన ప్రదేశాలలో 'ఇష్తార్' అనే మాతృదేవత ఆరాధనలో 'పవిత్ర వ్యభిచారం' ఒక భాగం. ఈ అంశం గురించి తరువాత ప్రకరణలలో విపులంగా తెలుసుకొందాంగానీ, అత్యంత ప్రాచీన నాగరికతలలో పంటచేల సారాన్ని వృద్ధి చేయడానికి, ప్రజలకు సంతాన బాహుళ్యాన్ని కలిగించడానికి



చిత్రం 9.

మెసపటోమియాలో జిగ్గురాట్

ఆచరించే సెక్సు కర్మకాండలలో  పవిత్ర వ్యభిచారం ముఖ్యమైన భాగం కాబ దానిని సింధు నాగరికులు కూడా అవలంబించారు. ఈ పవిత్ర  వ్యభిచారిణుల అప్సరసలనేవారు. వీళ్ళు 'జిగ్గురట్' వంటి గోపురాల వద్ద పెద్దమడుగు వద్ద నిష్ఠ సెక్సు  అనుష్ఠానాలు ఆచరించేవారు.



చిత్రం 10. మొహంజదారో పుష్కరణి శిథిలాలు

మొహంజదారో వద్ద త్రవ్వకాలలో అపూర్వమైన కట్టడం ఒకటి బయలుపడిం [చిత్రం 10]. ఇది 180 అడుగులు  పొడుగు, 108 అడుగులు వెడల్పు భవనం. ఇందులో మధ్యన 39 అడుగులు పొడుగూ, 23 అడుగులు  వెడల్పూ అడుగుల లోతుగల ఒక కొలను కట్టారు. వెడల్పు వైపు రెండు పక్కలా కొలనులో దిగడానికి  మెట్లు ఉన్నాయి. కొలను చుట్టూ అన్ని పక్కలా ఒక వసారా ఉం



చిత్రం 11. పుష్కరిణి రేఖాచిత్రం

లనులోని నీళ్ళను శుభ్రం చేయడానికి ఏర్పాట్లు ఉన్నాయి. కొలను అడుగు ంచి ఒక పెద్ద తూము కాలువ ఉంది. ఇది కొలనుకు నైఋతి మూలలో ఉంది. సారాకు మూడుపక్కల చాలా గదులున్నాయి. ప్రేక్షకులు కూర్చునే సోపాన పంక్తి ంది. కొలనుకు దక్షిణ దిశలోని వరండాలో చిన్న గదులున్నాయి. ఈ గదుల లుపులు ఒకదానికొకటి ఎదురుబెదురుగా కాక ఏ గదిలోనికి ఎవరు వెళ్ళి వస్తున్నారో లియని పద్ధతిలో ఉన్నాయి. ఈ మహాభవనంలో ప్రవేశ నిష్క్రమణాల కోసం ఆరు ్వారాలున్నాయి. ఈ భవనాన్నీ కొలనునూ పురాతత్వవేత్తలు ఇంగ్లీషులో 'గ్రేట్ బాత్' న్నారు. కొందరు భారతీయ పండితులు 'బృహత్ స్నానకుండం' అని పేర్కొన్నారు. డి. కోశాంబి దీనిని పుష్కరిణి అని గుర్తించారు.




చిత్రం 12. మొహెంజదారో పుష్కరణికి సందేహాస్పద స్వరూప పునర్నిర్మాణం.
ఈ చిత్రాన్ని డి.డి కోశాంబి రూపొందించారు.

పుష్కరము అనే పదానికి చాలా అర్థాలున్నాయి. సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఇది నపుంసకలింగమైతే పందొమ్మిది అర్థాలూ, పుంలింగమైతే తొమ్మిది అర్థాలూ ఇచ్చారు. చూడండి.

పుష్కరము సం.వి.అ.న. 1. తామరపూవు; పద్మము; 2. తొండము చివర, శుండాగ్రము; 3. వాద్యభాండ ముఖము; 4. అసిఫలము, కత్తివాదర; 5. కత్తియొర, ఖడ్గకోశము; 6.బాణము ; 7. ఆకాశము; 8. గూడు; 9. ఉదకము; 10. యుద్ధము; 11. కూడిక, సంయోగము; 12. తీర్థభేదము; 13. గరిటె; 14. భాగము, అంశము; 15. మెట్టతామర దుంప, పుష్కరమూలము; 16. కుష్టమనెడు ఓషధి, చెంగల్వకోష్టు; 17. ఒక ద్వీపము [చూ॥ ద్వీపము]; 18. బ్రహ్మకృతమగు నొక సరస్సు; 19. స్వర్గము;

ఈ నానార్థాలలో చాలామటుకు పుష్కరిణికి సరిపోతాయి. బ్రహ్మకల్పితమైన సరస్సును ఈ పేరుతో పిలవడం సరిగ్గా మొహెంజదారో కొలనుకు సరిపోతుంది. దీనిని మానవులే నిర్మించారు. ఆ పుష్కరిణిని నీరుతో నింపడానికి ఆ భవంతిలోనే ఒక నూయి ఉంది. తూములోంచి నీళ్ళు తీసేశాక ఓపికగా నూతినీళ్ళు తోడి కొలను నింపాలి. ఆ పుష్కరిణి నిర్మాణంలో సింధుజనులు చాలా శ్రద్ధ తీసుకొన్నారు. అడుగున నాలుగు అడుగుల ఎత్తుకు మందంగా ఇటుకలు అమర్చి, ప్రత్యేకంగా తేమ యింకని గచ్చు చేసి, దానిమీద ఒక అంగుళం మందం ఉండే శిలాజిత్తుమట్టి తైలము పూత పూశారు. ఒక ప్రత్యేకమైన సృష్టికార్యం కోసం 'బ్రహ్మ' కల్పించిన పుష్కరిణి కాబట్టే ఇంత కట్టుదిట్టంగా ఈ కొలను నిర్మాణం జరిగింది.

పుష్కరము అన్న పదానికి గల నానార్థాలలో కత్తి ఒర, బాణము, తొండము చివర, గరిటె మొదలైనవి సెక్సు సంకేతాలే, తామరాకును పుష్కరవ్రతం అంటారు. శతపథ బ్రాహ్మణంలో పుష్కరవర్ణం అనే పదాన్ని యోని అనే అర్థంలో వాడారు. [Vii. 4. 1. 11]. బ్రహ్మ పద్మసంభవుడు. విష్ణువు పద్మనాభుడు. లక్ష్మి పద్మాలయ. మనదేవతల చేతుల్లో తామర మొగ్గలు విరివిగా కనబడుతూ ఉంటాయి.

జలాశయములకు పుష్కరిణి అన్న పేరే కాదు కుండము అన్నపదం కూడా వర్తిస్తుంది. దేవఖాతమైన జలాశయాన్ని కుండమంటారు. తరుచు దేవాలయాలకు ఇది సంబంధించి ఉంటుంది. ద్రావిడజాతులకు జలకుండాలే ముఖ్యం. ఆర్యులకు అగ్నికుండాలు ప్రధానం. కుండను కుంభము అని కూడా పిలుస్తారు. అగస్త్యుడు, ద్రోణుడు, వశిష్టుడు మొదలైన పురాణవ్యక్తులు కుంభ సంభవులు. వీళ్ళంతా అప్సరసలకు పుట్టినవాళ్ళు. అప్సరసలు జలగన్నెలు [తెలుగు జానపద గేయ కథా వాఙ్మయంలో జలగన్నెలనే ప్రయోగాలున్నాయి]. నీరు లేని చోట గుడి కట్టకూడదు.

ఏయే ప్రదేశాలలో గుడికట్టాలో విష్ణు ధర్మోత్తరం మూడవభాగం 93వ అధ్యాయంలో చెప్పారు.[3] నదితీరాన, అడవులలో, వనాలలో, కొలనుగట్లమీద, కొండ కొమ్ములమీద, అందమైన లోయలలో ముఖ్యంగా గుహలలో ప్రతిష్టలు చేయాలి. ఈ ప్రదేశాలలోనే స్వర్గలోకవాసులు విహరిస్తారు. జలాశయాలు లేనిచోట దేవతలు కనబడరు. అందుచేత ఎడమ పక్కను గానీ, కుడిపక్కను గాని ఎదుటివైపునగాని కొలను ఉన్నచోటనే గుడికట్టాలి. లేకపోతే పనికిరాదు. ద్వీపంలో దేవళాన్ని నిర్మిస్తే

అన్నిపక్కలా జలాలున్నందువల్ల అది పరమ మంగళప్రదం.

భారతదేశంలోని దేవాలయాలన్నింటిలోనూ కామశిల్పాలకు పేరుపడిన ఖజురహో ఆలయాలను అడవులు, కొండలు, లోయలు, 'ఖజుర సాగరం' అనే తటాకం ఉన్నచోట కట్టారు. కుడి యెడమపక్కల తటాకాలు లేనందువల్ల ఆ పుష్కరిణులను ప్రత్యేకంగా నిర్మించి వాటిలో తామర తంపర ఉండేటట్లు చూశారు. ఇప్పటికీ ఆ జలాశయాలలో తామరపద్మాలు వుంటాయి. తామరాకుల గొడుగులు సూర్యకిరణాలను వారించగల చోటనే దేవతలు క్రీడిస్తారని బృహత్సంహిత చెప్తోంది.

సింధునాగరికతలో దేవతలెవరో తెలియదుగానీ పుష్కరిణీ అప్సరసలూ ఉండే వారు. ఈ గణికలు పవిత్ర వ్యభిచారం జరిపేవారని ఊహించడానికి అప్పటి సమకాలిక పరదేశ నాగరికతలలోని ఆచారాలు ఆధారాలు4 ఈజిప్టు, పొనీషియా, అస్సీరియా, కాల్డియా కానాన్, పర్షియా దేశాలలో ఐసిస్, మొలాక్, బాల్, అస్టార్ట్, మైలిట్టా మొదలైన దేవతల ఆరాధనలలో విపరీతమైన సెక్సు జాతరలు జరిగేవి. బాబిలోన్‌లో కొంతవరకూ నిర్బంధ వ్యభిచారం అన్ని తరగతుల స్త్రీలపైనా మైలిట్టా దేవత గౌరవార్థం విధించారు.

'సైప్రస్'లో పెళ్ళికిముందు స్త్రీలందరూ 'అఫ్రొడైట్' అనే దేవత ఆలయంలో ముక్కూ మొగం ఎరగని పరాయి మొగాళ్లతో వ్యభిచరించాలి. ఇది విచ్చలవిడి కాముకత్వం కాదు. దేవతపట్ల నెరవేర్చవలసిన పవిత్ర విధి నిర్వహణ. బాబిలోన్‌లో ధనికురాలైనా సరే, పేదరాలయినా సరే, ప్రతి స్త్రీ జీవితంలో ఒకసారైనా మైలిట్టా దేవతగుడిలో పరపురుష సంగమం చేయాలి. ఇటువంటి ఉదాహరణలు ఎన్నయినా చూపెట్టవచ్చు.[5]

గ్రీకు రోమన్ పురాణాలలోని 'నిమ్ఫ్' అనే జలదేవతలకు సింధు పుష్కరిణికి చెందిన అప్సరస సరిపోతుంది. నిమ్ఫులు, జలగన్నెలు, జాలిగుండె గలవాళ్లు. మానవశిశువులను గాని, దేవతల శిశువులను గాని రక్షించి పెంచుతారు. వానలు కురిపిస్తారు. మందలను వృద్ధిచేసే పశుసంపదను పెంపొందిస్తారు. గానవిద్యలోనూ, నృత్యకళలోనూ నిపుణులు. ఆరోగ్యాన్ని ప్రసాదించే నీటిబుగ్గలను సృష్టించగలరు. మగ్గాలమీద రక్తవర్ణ వస్త్రాలు నేస్తారు. నిమ్ఫులు స్థానిక జలవనదేవతలు[6]

మధ్యప్రాచ్యంలోని ఇతర నాగరికతలవారు, సింధునాగరికత గల దేశంలో వర్తక వ్యాపారాలు చేసేవారు. సప్తసింధు దేశాన్ని 'మేలుహ' అని పిలిచేవారు. ఇతరదేశాలలో లభించిన లిఖిత సాక్ష్యాలను బట్టి ఈ సంగతిని ప్రామాణికులు నిర్ణయించారు. మధ్యప్రాచ్యదేశాల రికార్డులలో క్రీస్తుపూర్వం 1750 తర్వాత మేలుహ ప్రసక్తి కనబడదు. కాబట్టి సింధునాగరికత వాణిజ్యానికి అంతరాయం కలిగి హరప్పా మొహంజదారో నగరాలు ముట్టడి పాలై నశించిపోయాయి. ముట్టడించిన వారు ఆర్యులు.

ఆర్యులు పితృస్వామ్యం పాటించే పశుపోషక గణాలవారు. గోవులే వారికి ప్రధానధనం. గోధనాన్ని సంపాదించడం, పెంపొందించడమే వారి లక్ష్యం. పశువులను మేపుకొంటూ ఆ మందలను తోలుకొంటూ వారు సంచార జీవితం గడిపేవారు.

క్రీ.పూ. 1750 ప్రాంతాలకు ముందు వారు మనదేశానికి వాయువ్య భాగాన ఉన్న సప్తసింధు దేశాలకు వచ్చారు. సింధుజనుల ఆచార వ్యవహారాలకూ ఆర్యుల జీవన విధానాలు విరుద్ధాలు. సింధుజనాన్ని 'అయజ' 'అవ్రత', 'అబ్రహ్మ' అనే విశేషణాలతో ఆర్యులు పేర్కొన్నారు. తమ జీవిత విధానానికీ, యజ్ఞయాగాదులకూ విరుద్ధమైన నాగరికతను వాళ్ళు ధ్వంసంచేశారు. సింధుజనుల పురాలను చీల్చి చెండాడి ఆర్యుల ప్రధాన దైవం ఇంద్రుడు పురందరుడయ్యాడు. హారప్పా నగరాన్ని ఇంద్రుడు నాశనం చేయడం ఋగ్వేదంలోని ఒక ఋక్కు పేర్కొంటూంది.

వధీదింద్రో వరశిఖస్య శేషోఽభ్యావర్తినే చాయమానాయశిక్షన్
వృచీవతో యుద్ధరియూపీయాం హన్‌పూర్వే అర్ధే భియయా వరో ధర్
[ఋగ్వేదం - VI - 27-5.]

చయమానపుత్రుడైన అభ్యవర్తి అనే వ్యక్తికి ఇంద్రుడనుకూలుడై వరశిఖపుత్రులను అణచిపెట్టే వృచివాద్యంశధరుల 'హరియూపీయా'కు తూర్పున శిక్షించాడు. హరియూపీయా హారిప్రియ, శబ్దాలే హరప్పగా మారినట్టు ప్రామాణికులు నిరూపిస్తున్నారు.

ఆర్యులు సింధుపురాలను విధ్వంసం చేసినా, ఆ నాగరికత ప్రభావానికి కొంత వరకూ లోనయ్యారు. సప్త సింధుదేశంలోని ప్రజలతో ఇష్టమున్నా లేకపోయినా కలసిమెలసి బతకవలసివచ్చింది. కొన్ని మాతృస్వామ్య ఆచార వ్యవహారాలను స్వీకరించక తప్పలేదు.

ఇంద్రుడు సప్తసింధు దేశీయుల స్వర్గానికి అధిపతి అయ్యాడు. ఆ నాగరికతకు చెందిన పుష్కరిణి చెంతనుండే అప్సరసలంతా వేశ్యలయ్యారు. వివిధ పురాణాలలోని ప్రసిద్ధులైన ఋషులకు ఈ గణికలే తల్లులయ్యారు. ఆర్యుల యజ్ఞకర్మలలో కూడా ఇంతింత కాని సెక్సు కనబడుతుంది.

## అధోజ్ఞాపికలు

[1] సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము - ఎనిమిదవ సంపుటి హరప్పా సంస్కృతి- పుట 276.

[2] పై గ్రంథంలోనే- అదే పుట

[3] చూ॥ స్టెల్లాక్రామరిష్ రచించిన ది హిందూ టెంపెల్. కలకత్తా విశ్వవిద్యాలయం ప్రచురణ. 1940 పుట 5.

[4] చూ॥ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ బ్రిటానికా సంపుటి 18. పుటలు 596.

[5] సర్ జేమ్స్ జార్జి ఫ్రేజర్ రచించినది 'గోల్డెన్ బౌ' 1947 సంక్షిప్త ముద్రణ. 15 సంపుటి పుట 300 331.

[6] చూ॥ కోలిన్స్ కన్‌సైజ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ గ్రీక్ అండ్ రోమన్స్ మైథాలజీ.

# అప్సరసలూ ఆర్యుల ఋషులూ

అమరులూ, అసురులూ అమృతంకోసం పాలకడలిని మథిస్తున్నప్పుడు ముందు హాలాహలం పుట్టింది. దాని తరువాత ఎన్నెన్నో, ఎందరెందరో పుట్టారు. వాళ్లలో అప్సరసలు కూడా ఉన్నారు. వీళ్ల ఎలా పుట్టారో వాల్మీకి రామాయణం బాలకాండ 45వ సర్గ విశదపర్చింది.

అప్సునిర్మథనా దేవర సస్తస్మాద్వరస్త్రియః
ఉత్పేతుర్మనుజశ్రేష్ఠ తస్మాదప్సరసోభవన్. 20
షష్టిఃకోట్యోభవం స్తాసామప్సరాణాం సువర్చసాం
అసంఖ్యేయాస్తు కాకుత్థ్సయాస్తాసాం పరిచారికాః 21
నతాస్సపరిగృహ్ణాంతి సర్వేతే దేవదానవాః
అప్రతిగ్రహణాత్తాశ్చ సర్వాస్సాధారణాః స్మృతా 22

ఈ శ్లోకాలను వావిలకొలను సుబ్బారావుగారు అనువదించి ఇలాగ తాత్పర్యాలు రాశారు.

"జలములు చిలుకగా వానియందు సారము జనించెను. దానియందు కొందరంద గత్తెలు స్త్రీలు పుట్టిరి. అప్పులనుండి వచ్చిన రసమున జనించినవారు కావున వారు అప్సరసలు అనబడిరి".

"అరువది కోటు లచ్చరలు పుట్టిరి. వారి పరిచారికలెందరో గలరు. వారిని లెక్కింపనెవరి వశము? ఆ స్త్రీలను దేవతలుగాని, రాక్షసులు గాని గ్రహించిన వారు కారు".

"రామచంద్రా? యా యప్సరలను రాక్షసులుగాని దేవతలుగాని కామిముచే గ్రహింపరైరి. కావున వారు మగవారి యందరయందు సమాన పతి భావముగలవారై లంజలై వర్తించిరి".

ఈ కథను విశ్వామిత్రుడు రామునికి చెప్పాడు. అప్సరసల పుట్టుకను, వాళ్లు వేశ్యలు కావడానికి గల కారణాలను ఒక్క రామాయణమే కాక అగ్నిపురాణం, విష్ణుపురాణం మొదలైన గ్రంథాలు చెప్తాయి. కశ్యప ప్రజాపతికి ఇరవై యొక్కమంది భార్యలున్నారు. అందులో అరిష్ట ఒకతె. ఈమె అలంబుస, మిశ్రకేశి, విద్యుద్వర్ణ, తిలోత్తమ, అరుణ, రక్షిత, రంభ, మనోరమ, కేశిని, సుబాహు, సురజ, సురత, సుప్రియ అనే పదమూడు మంది అప్సరసలకూ, హాహా, హూహూ, అతిబాహు, తుంబురులనే గంధర్వులకు జన్మనిచ్చింది.

అమరకోశం అప్సరసలు స్వర్వేశ్యలని చెప్పి ఊర్వశి, మేనక, రంభ, ఘృతాచి, తిలోత్తమ, సుకేశి, మంజుఘోష అనే ఏడుగురి పేర్లనే పొందుపరచింది. కొన్ని కొన్ని సంఖ్యావాచక సంపుటాల్లో పన్నెండు, పదహారు అప్సరసల పేరల పట్టికలున్నాయి. భరతుని నాట్యశాస్త్రంలో అప్సరసల ఉత్పత్తికి వేరే కథ ఉంది.

బ్రహ్మ ఆదేశాన్ని అనుసరించి భరతుడు నాట్యప్రయోగాలను విరచించాడు. అతనికి నూట నలుగురు కుమారులున్నారు. వీరు భారతి, సాత్త్వతి, అరభటి

వృత్తులతో కూడిన నాట్య ప్రయోగాలనే బ్రహ్మ ముందు ప్రయోగించారు. బ్రహ్మ కైశికీ వృత్తిని కూడా ప్రయోగించమన్నాడు. భరతుడు కైశికీవృత్తిని ప్రయోగించడానికి యోగ్యమైన ద్రవ్యాన్ని ఇమ్మన్నాడు. ఆ కైశికీ వృత్తిని నాట్యమందు ప్రయోగిస్తే శృంగార రసాభివ్యక్తి హేతువు కాగలదు కానీ స్త్రీజనుల సాయంలేనిదే పురుషులకిది అసాధ్యం. కాబట్టి భరతుడు స్త్రీలను ఇవ్వమని బ్రహ్మను ప్రార్థించాడు. [నాట్యశాస్త్రం ప్రథమాధ్యాయం శ్లోకాలు 42 నుండి 50 దాకా].

అప్సరసల గురించి వైదికవాఙ్మయంలో ఏయే వైనాలున్నాయో చూడడం అవసరం. ఋగ్వేదంలో ఒక్క ఊర్వశి గురించి తప్ప ఇంకే అప్సరస ప్రసక్తి లేదు. అథర్వవేదంలో చాలాపేర్లు కనబడతాయి. [iv - 37. 3. మొదలైనవి]. గుగ్గులు, పీలా, నారది, ఔక్షగంధి, ప్రసందిని అనే పేర్లు సుగంధ సూచకమైనవి. వాజసనేయి సంహితా తైత్తిరీయ సంహితా ఇద్దరిద్దరు అప్సరసలను పురుష దైవాలతో కలిపి పేర్కొంటాయి.

అగ్నితో పుంజికస్థలా, కృతస్థల
వాయువుతో మేనకా, సహజన్యా
సూర్యునితో ప్రలోచంతి, అనులోచంతి
పర్జన్యునితో విశ్వాచీ, ఘృతాచి, ఊర్వశి, పూర్వచిత్తి

ఒక్కొక్క పురాణ దైవానికి తోడుగా ఇద్దరేసి అప్సరసలను జోడించడం ఉత్తరోత్తరా దేవాలయ శిల్పాలలో కూడా కనబడుతుంది. పురుషదేవతలతో ఉన్నంతమాత్రాన అప్సరసలు వారి భార్యలు కారు. అప్సరసలకు పెళ్ళి అన్నదేలేదు. [అప్సరాణాం పతిర్నాస్తి] వావివరసలు లేవు. ఏ ఒక్క పురుషునితోనూ దీర్ఘకాలిక సంబంధాలు ఉండవు. రంభ నలకూబరునితో అనుబంధం ఏర్పరుచుకుంది. రావణుడు రంభను కోరినప్పుడు 'నేను నీకు కోడలు వరసదాన్ని' అని ఆమె చెప్పింది. అప్పుడు రావణుడు అడిగిన ప్రశ్నలు కంకంటి పాపరాజు ఉత్తర రామాయణంలో ఇలా ఉన్నాయి.

జనకుడు సుతుడును జన్నంబు సేసిన వనిత వారేమి కావలయు నీకు?
నన్నదమ్ములు సోమయాజులై వెలసిన వనిత వారేమి కావలయు నీకు?
బావయు మరిదియు బవరానకూలిన వనిత వారేమి కావలయు నీకు?
నల్లుడు మామ యని ద్రెళ్ళివచ్చిన వనిత వారేమి కావలయు నీకు?
వావివరుసలు గణియింప వచ్చితేని వనిత మాతోడి మాటాడ వశమె నీకు?
జాలునికనేల రమ్ము....

[చతుర్థాశ్వాసం - 216]

అప్సరసలకు వివాహనియమం లేకపోయినా వాళ్ళు ఎన్నో రాజవంశాల మూల కందాలయ్యారు. ఎందరో ఋషులకు తాత్కాలిక భోగినులై మరెందరో ఋషులకు తల్లులయ్యారు. వైదిక యజ్ఞయాగాదులవల్ల లభించే సౌఖ్యం అప్సరసలతో రమించడమే అని తరువాత యుగాలలో రూఢి అయింది. వరూధిని ప్రవరాఖ్యునితో తమ కులం వైనాలు ఇలాగ చెప్పిందని అల్లసాని పెద్దనగారు మనుచరిత్రలో రాశారు.

చిన్నివెన్నెల కందు వెన్నుదన్ని సుధాబ్ధి

బొడమిన చెలువ తోబుట్టుమాకు
రహిపుట్టజంత్రగాత్రమల రాల్ గరగించు
విమల గాంధర్వంబు విద్యమాకు
ననవిల్తు శాస్త్రంపుమినుకు లా వర్తించు
పని వెన్నతోడ పెట్టినది మాకు.
హయమేధ రాజ సూయములన బేర్పడ్డ
సవన తంత్రబు లుంకవలుమాకు కనకనగసీమ గల్పవృక్షముల నీడ
పచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకు
పద్మ సంభవ వైకుంఠ భర్గ సభలు
సాముగరిడీలు మాకు గోత్రా మదేంద్ర! [ద్వితీయ -43]

అప్సరసలకు పాలకడలిలో చంద్రుని తర్వాత ఉద్భవించిన లక్ష్మీదేవి తోడబుట్టువు. రాళ్లు సైతం కరిగేటట్లు జంత్రవాద్యాలు వాయిస్తూ పాట పాడడంలో నేర్పు గలవారు. కామశాస్త్ర మర్యాదలు ఉగ్గు పాలతోపాటు వంట బట్టినవాళ్ళు అశ్వమేధ రాజసూయాది యాగాలలోని పుణ్యాతంత్రాలే ఆ గణికలకు చెల్లించవలసిన ఓలిసొమ్ము. మేరు పర్వతం మీది కల్పవృక్షాల నీడను పచ్చల చాప రాళ్లపై కొలువు తీరి ఉంటారు. బ్రహ్మ విష్ణు మహేశ్వర సభలలో నాట్యం చేయడమే అప్సరసల సాముగరిడీలు, ఈ సంగతులు చేప్పిన వరూధిని, ఘృతాచి, తిలోత్తమ, హరిణి, హేమ, రంభా, శశిరేఖలు తన ప్రాణ సఖులని పేర్కొంది. క్రీ.శ.1500 నాటికి ఈ అప్సరసల పేర్లు తెలుగుదేశంలో ప్రచారంలో పొందినవని యిందువల్ల తేలుతుంది.

నేను విభిన్న గ్రంథాలలోని ఎన్నో రకాల పట్టికల నుండి దొరికినంత మంది అప్సరసల పేర్లను క్రోడీకరించాను. అకారాదిగా ఆ జాబితాను పొందుపరుస్తున్నాను.

1.అనుమ్లోచ, 2.అరుణ, 3.అర్జుని, 4.అలంబుస, 5.ఊర్వశి, 6.కలభ, 7.కృత స్థల, 8.కేరల, 9. ఘృతాచి, 10.తిలోత్తమ, 11.దేవదత్త, 12.దేవర్షిత, 13.దేవసేన, 14.దేవి, 15.ధృతి, 16.నంద, 17.పాథాసుత, 18.పుంజితకస్థల, 19.పుష్కల, 20.పూర్వ చిత్తి, 21.ప్రమ్లోచ, 22.మంజుకేశ, 23.మంజుఘోష, 24.మనోరమ, 25.మహాభగ, 26.మాగధి, 27.మిశ్రకేశి, 28.మేనక, 29.రంభ, 30.రక్షిత, 31.విదగ్ధ, 32.విద్యుత్పర్ణ, 33.విపుల, 34.విశ్వాచి, 35.శశిరేఖ, 36.సంతటి, 37.సరల, 38.సుందరి, 39.సుకేశి, 40.సుదతి, 41.సునంద, 42.సుబాహువు, 43.సుమాల, 44.సుముఖి, 45.సురజ, 46.సురత, 47.సులోచన, 48. సేనచిత్త, 49. సౌదామిని, 50. హరిణి, 51. హేమ.

పైన పేర్కొన్న యాభై పైచిలుకు అప్సరసలలో చాలామందికి కొద్దిగానో గొప్ప గానో చరిత్రలున్నాయి. పురాణాలలో ఇతిహాసాలలో వీరి గురించి సంగ్రహంగానో, సవిస్తరంగానో కథలు కనబడతాయి. సింధునాగరికతలోని అప్సరసల జీవన విధానాలను ఈ అప్సరసల చరిత్రలను బట్టే అవగాహన చేసుకొనడానికి వీలవుతుంది. సింధు నాగరికతలోని జలగన్నెలు సమాజ సంపదను ఉత్పత్తి చేసే సాముహిక శ్రమలో పాటుపడే గణికలు. గణికులు గణంలో ఏ ఒక్క పురుషునికీ హక్కు భుక్తమైన భార్యలు

కాకపోయినా అందరితోనూ కామ విధులను పంచుకొనే భాగస్వామినులు.

ఇంద్రుడు స్వర్గాధిపతి అయ్యాక అప్సరసలు సర్వేశ్వలయ్యాక తన పదవికి ఎసరు పెట్టే ఋషుల తపస్సులను చెడగొట్టడానికి ఈ దేవ గణికలను పంపేవాడని మన పురాణ కథలతో ఏమాత్రం పరిచయమున్న వారైనా చెప్పగలరు. ఇంద్రుని పంపున వెళ్లకపోయినా అప్సరసలకు కొంతమంది తపోధనులకు తారనపడినప్పుడు ఆ నియమ నిష్ఠ సడలి, స్ఖలనమయ్యేది. ఆ వీర్యం వల్ల పురాణ స్త్రీ పురుషులు ఉద్భవించారు. కొందరు అప్సరసలకు ఏయే ఋషులతో సంబంధాలున్నాయో వాటి ఫలితాలేమిటో చాలా టూకీగా తెలుసుకొందాం.

## అలంబుస

దధీచి సరస్వతీనదీ తీరాన తపస్సు చేసుకొంటూ ఉంటే దాన్ని చెడగొట్టడానికి ఇంద్రుడు అలంబుసను పంపించాడు. ఆమె తన హొయలు ప్రదర్శించింది. దధీచికి స్ఖలనమైంది. ఆ వీర్యం నదిలో పడింది. నది గర్భందాల్చి సారస్వతుడనే పుత్రుణ్ణి కన్నది. ద్వాదశవర్ష క్షామంలో బ్రాహ్మణులు వేదాలను మరచిపోతే ఈ సారస్వతుడే మళ్ళీ వాటిని బ్రాహ్మణులకు నేర్పాడు.

శాపవశాన అలంబుస మానవజన్మను ఎత్తి మృగావతి అనే పేరుతో సహస్రానీకుని భార్య అయింది. తిలోత్తమ ఇంకో శాపం ఇవ్వడం వల్ల భార్యా భర్తలకు ఎడబాటు కలిగింది. అప్పుడామె గర్భవతి. బిడ్డ పుట్టాక చాలా కాలానికి భార్యాభర్తలు కలుసుకొన్నారు. ఇది పెద్ద కథ. కథా సరిత్సాగరంలో ఉంది. శకుంతల కథతో పోలికలు ఉన్నాయి. ఈ కథ విశ్లేషణ ఇప్పుడు కాదు. తర్వాత చేద్దాం.

భాగవత పురాణంలోని కథనం ప్రకారం అలంబుస తృణబిందు అనే రాజును వశపర్చుకొంది. వాళ్ళకు ఇడబిడ లేక ఇళబిళ అనే కుమార్తె కలిగింది. ఈ చిన్నది విశ్రవసుతో సంగమించి కుబేరుణ్ణి కన్నది. కుబేరుడు యక్షులకు రాజు యక్షగణాలను తెలుగులో జక్కుల వారంటాము. తమిళ మళయాళ భాషలలో వీరిని 'చాక్కియార్' లంటారు. జక్కులవారు గారడీగాన నృత్య విద్యలను ఆధారం చేసుకొని బతుకుతారు. శ్రీనాథుడు ఓరుగల్లు నగరంలో జక్కుల పురంధ్రిని వర్ణించాడు. జక్కులవారు వ్యభిచారం ఆచారంగా పాటించేవారని థర్స్టన్ రాశాడు. ముక్కూ మొగం ఎరగని పరాయవాడిని జక్కిణి ఒక రాత్రికి భర్తగా పెళ్ళాడుతుందట. ఈ శతాబ్దపు తొలి రోజులలోనే జక్కులవారిలో సంఘ సంస్కరణ ప్రారంభించారు.

## ఊర్వశి :

అప్సరసలందరిలో ఒక్క ఊర్వశి గురించే ఋగ్వేదంవల్ల ఎంతో విశదమవుతుంది. ఊర్వశి నరనారాయణులలో ఒకరైన నారాయణుని ఊరువు నుండి ఉద్భవించిందని అర్వాచీన పురాణాలు చెప్తాయిగానీ ఈ వ్యక్తినామానికి నిఘంటు నిరుక్తాలకు అధ్యయనం చేసిన వారు చెప్పే వ్యుత్పత్తి అర్థం ఔచిత్యవంతంగా ఉంది. నిరుక్తం ప్రకారం ఉరు+వశ్ విశాలంగా వ్యాపించేది లేక ఊరువులతో వ్యాపించేది ఊర్వశి

అయింది. నరనారాయణుల పురాణ కథకన్నా ఋగ్వేదం చాలా ప్రాచీనమైనది. ఊర్వశి మూలంగా మిత్రావరుణుల వీర్యం వల్ల వశిష్ఠుడు ఎలా కుంభసంభవు డయ్యాడో ఋగ్వేదం ఏడవ మండలంలోని 33 వసూక్తం వల్ల తెలుస్తుంది.

'ఉతాసి మైత్రా వరుణో వసిష్ఠోర్వశ్యా బ్రహ్మన్ మనసోధి జాతః
ద్రప్సం స్కన్నం బ్రహ్మణా దైవ్యేన విశ్వేదేవాః పుష్కరేత్వాదదంతా'
[vii - 33 - ii]

దీనికి నేమాని వారి అనువాదం ఇలా ఉంది.

"మరియు నో వసిష్ఠుడా! నీవు మిత్రావరుణుల పుత్రుడవు. ఓ బ్రహ్మణుడా యూర్వశీ మనస్సు నుండి నీవు పుట్టితివి ! మిత్రావరుణుల రేతస్సుస్కలనమైనది. విశ్వదేవగణము దైవ్యస్తోత్రము ద్వారా పుష్కర మధ్య మందు నిన్ను ధరించిరి."

ఈ సూక్తంలోని కథలకు భాష్యం ఇప్పటికి సంతృప్తికరంగా ఏదీలేదు. ఉన్నంతలో డి.డి. కోశాంబి ఇచ్చినదే అధునిక విశ్లేషణకు అనుకూలంగా ఉంది.**

అప్సరసః పరిజజ్ఞే వసిష్ఠః –[vii - 33 12] ఈ సూక్తంలో అగస్త్యుని ప్రస్తక్తి ఉందిగాని సమన్వయం కుదరడం లేదు. [vii -33 - 10] ఋగ్వేదం కన్నా అర్వాచీనమైన పురాణాలు వశిష్ఠుడూ, అగస్త్యుడూ మిత్రావరుణుల వీర్యం వల్ల ఊర్వశి మూలంగా కుంభ సంభవులయ్యారని చెప్తాయి.

ఋగ్వేదంలోనే పదవ మండలంలో ఊర్వశీ పురూరవుల కథ ఒకటి ప్రసక్తమ యింది. ఈ గాథ రూపు ఏర్పరచుకొన్న పరిస్థితులు ఋగ్వేద సమాజంలో చాలా పరిణామాలు సంభవించాక పరిపక్వమయ్యాయి. గణపతులు కాక గణమాతృకలు ఒకకాలంలో ఉండేవారు. రాష్ట్రీమాత కొంత కాలంపాటు ఒకనితో సెక్సు జీవితం గడుపుతాననీ సమయం ఏర్పరచు కొంటుంది. సమయం అంటే ఒప్పందం. ఆ గడువు తేది పోయాక ఆసెక్సు సంబంధం అంతమవుతుంది. రాష్ట్రీదేవికి తాత్కాలిక భర్త వల్ల గర్భం కలిగాక ఆ మగడి పని తీరిపోతుంది. ఋగ్వేదంలోని పురూరవుణ్ణి బలివేశారు. ఇంతకుముందు అలంబుస కథ కొద్దిగా చెప్పకొన్నాం. ఆమె మృగావతిగా జన్మించాక సహస్రానీకునివల్ల గర్భం ధరించింది. వెనువెంటనే ఆమె నెత్తుటి మడుగులో ఈదాలన్న కోరికను వెలిబుచ్చింది. ఆ రాజు కృత్రిమమైన ఏర్పాట్లు కావించాడు. ఆమె ఈదుతున్నప్పుడు ఒక విహంగం వచ్చి ఆమెను ఎత్తుకుపోయింది. నెత్తుటి మడుగు, వియోగం అన్న అంశాలు అలంబుస కాపురం కథలోనూ, ఊర్వశి కాపురం కథలోనూ సమానాలే. అప్సరసలు మృత్యుదేవత విస్తృత వస్త్రాన్ని నేస్తూ ఉంటారు. గ్రీకు రోమన్ పురాణాలలోని జలగన్నెలు నిమ్ఫులు వస్త్రాలు నేయడం ఇంతకు ముందు గమనించాం. అఫ్రొడయిట్ ఉత్సవాలలో ఆమె విగ్రహం నెత్తురుతో తడిసేదాకా బాలుర్ని కొరడాలతో కొడతారు. ఏ పురాణాలలోని అప్సరసలయినా నెత్తురు కళ్ళచూస్తారు.

---

* శరద్ పాటిల్ రచించిన 'దాస - శూద్ర స్లేవరీ' పుట 58 లో నిఘంటు నిరుక్తాలపై అధ్యయనం చేసిన ఎన్. స్వరూప్ గ్రంథం నుండి ఉటంకించారు.

---

** డి.డి. కోశాంబి –'మిత్ అండ్ రియలిటి' –పుట 58

## ఘృతాచి

ఋషుల తపస్సులను చెడగొట్టడంలోనూ, వాళ్ళతో క్రీడించి వాళ్ళకు పుత్రులను కనడంలో ఘృతాచి ఘటికురాలు వ్యాసుడు,భరద్వాజుడు ఈమె అందాన్ని వేరు వేరు కాలాలలో చూశారు. మోహించారు. వారికి స్కలనం అయింది. వ్యాసుని వీర్యాన్ని ఒక చిలుక ధరించి శుకయోగిని కన్నది. భరద్వాజుని వీర్యం ఒక ద్రోణం అనే వెదురు చెంబులో పడి ద్రోణుడు పుట్టాడు.

ఘృతాచిని కుశనాభుడనే రాజర్షి చూసి మోహించాడు. వాళ్ళకు నూరుమంది కుమార్తెలు జన్మించారు. ఘృతాచి ప్రమతి అనే రాజుకు రురుడు అనే ఋషిని కన్నది. ఘృతాచి అష్టావక్రుని మెప్పించి కుబేరుని సభలో స్థానం సంపాదించుకొంది. విశ్వకర్మకు ఈ అప్సరస చిత్రాంగద అనే కుమార్తెను కన్నది. ఘృతాచికి దేవపతి అనే కుమార్తె కూడా పుట్టింది.

## తిలోత్తమ

తిలాంశాల నుండి జన్మించిన ఉత్తమురాలు కాబట్టి ఈమెకు తిలోత్తమ అనే పేరువచ్చింది. ఈమెను విశ్వకర్మ సృష్టించాడు. ప్రదక్షిణ చేస్తున్న ఈమె అందాల్ని వీక్షించడానికి శివుడు చతుర్ముఖుడయ్యాడు. ఇంద్రుడు వెయ్యి కన్నుల వాడయ్యాడు. ఋషులను కాక భేదోపాయంతో అసురులను చెడగొట్టి చంపడంలో ఈమె అందాల్ని దేవతలు నియోగించుకొన్నారు. సుందోపసుందుల కథ సుప్రసిద్ధమే.

## నంద

అప్సరసల జాబితాలో నంద కనబడుతున్నా పురాణాల్లో ఈమె గాథలేం కనబడవు. దానికి ఒక కారణం ఉంది. పాండవుల కాలంలో ఈమె ఒక నదీ సుందరీ. నైమిశారణ్యంలోని తూర్పుభాగంలో నంద, అపరనంద అనే నదులు పారుతూ ఉండేవి. మహాభారతం అరణ్యపర్వంలో బాహుద, నంద అనే నదుల ప్రసక్తి ఉంది. [87వ అధ్యాయం]. పాండవులు వనవాసం చేస్తున్నపుడు ధర్మరాజు లోమశ మహర్షితో నందా అపరనందల లోయలో చరించాడు. ఆ లోయలో చాలామంది గణదేవతలుండేవారు. ఆర్యదేవతలకు వీళ్లంటే కిట్టక ఆ ప్రాంతాలను దుర్గమాలు చేసి మానవులను అక్కడకు వెళ్ళకుండా నిషేధించారు. [అరణ్య పర్వం - 110 అధ్యాయం] అనార్యుల మాత్ర గణదేవతల ఆరాధనలు అక్కడ జరుగుతూ ఉండేవి కాబోలు.

## పుంజిక స్థల

అప్సరసలలో ప్రముఖురాలైనా పుంజిక స్థల బృహస్పతి ఆశ్రమంలో పరిచారికలా ఉండేది. ఆ ఆశ్రమ వాటికలోనికి వచ్చి కామకేళిలో నిమగ్నులయిన యువతీ యువకులను చూసి ఈమెకు కామవాంఛలు ఇనుమడించాయి. బృహస్పతి మీద పడి

అతణ్ణి తన తాపాన్ని తీర్చమంటే ఆయన శాపాన్ని ఇచ్చాడు. కోతిగా పుట్టమన్నాడు. పుంజిక స్థల అంజనాదేవిగా పుట్టింది. కేసరి అనే వానర యువకునితో బహుకాలం క్రీడించింది. వాయుదేవుని మూలంగా శివుని వీర్యాన్ని ధరించి ఒక బాలుణ్ణి కన్నది. అతడే అంజనేయుడు.

## ప్రమ్లోచ

గోమతీ నదీ తీరాన తపస్సు చేసుకొంటున్న కండు అనే మహర్షి వద్దకు ప్రమ్లోచ అనే అప్సరస వచ్చింది. అతణ్ణి మోహింపచేసింది. ఇద్దరూ పరస్పర కామమోహితులై నూరేళ్ళు క్రీడించారు. ఆమె అతణ్ణి విడిచి వెళ్ళాలనుకొన్నపుడల్లా ఇంకొక పూట, ఇంకొక దినం అగమని ఆపివేశాడు. చివరకు తొమ్మిది వందల సంవత్సరాల ఆరు నెలల మూడు దినాలయ్యాక కండు వెళ్ళిపో అన్నాడు. గర్భవతి అయిన ఆమెకు ముచ్చెమటలు పోశాయి. ఆమె గర్భంలోని పిండం ఆమె చెమటతో కలసి ఆమె ఎగిరిపోతున్నప్పుడు చెట్ల చిగుళ్ళ మీద కురిసింది. గాలి దాన్ని పోగుచేస్తే చంద్రకాంతి గర్భ ద్రవ్యానికి రూపం ఇచ్చింది. మారిష అనే ఆడపిల్ల పుట్టింది. ఈ అప్సరస కథలోనూ గర్భధారణ తర్వాత వియోగం అనే అంశం ఉంది.

## మంజు ఘోష

చిత్రరథుని ఉద్యానవనంలో ఇతర అప్సరసలతో పాటు విహరిస్తున్న మంజుఘోష ఆ చెంతనే తపస్సు చేసుకుంటున్న మేధావి అనే ఋషిని చూసి మోహించింది. అతడు కూడా ఆమె వల్ల ఆకర్షితుడయ్యాడు. ఇద్దరూ బహుకాలం క్రీడించారు. మంజుఘోష తన లోకానికి వెళ్ళిపోతానంది. ప్రమ్లోచను కండు ఆగమన్నట్టే మేధావి మంజుఘోషను ఎప్పటికప్పుడు ఆపివేశాడు. ఆమె చివరకు ఒకనాడు తాము సహజీవనం చేస్తూ అప్పటికి ఏభై అయిదు సంవత్సరాల తొమ్మిది నెలల మూడు రోజులయ్యిందని చెప్పింది. మేధావి ఆగ్రహించి ఆమెను శపించాడు. ఆమె పిశాచ రూపం ధరించింది. చైత్రమాసంలోని బహుళ ఏకాదశి వ్రతాలను చేసి శాపవిమోచనం చెందింది. మంజుఘోషకి శుచిస్మిత అనే పేరు కూడా ఉంది.

ప్రమ్లోచ లాగ ఈమె కూడా ఎడబాటు సమయంలో గర్భవతో కాదో తెలియదు. ప్రమ్లోచ కథను విష్ణుపురాణం కథనం చేస్తుంది. [అంశ 1 అధ్యాయం 15] మంజుఘోష కథను పద్మ పురాణం కథనం చేస్తుంది. [నాలుగువ భాగం 45వ అధ్యాయం] పద్మ పురాణం మాఘస్నానాలు, ఏకాదశీ వ్రతాలు మొదలైన వాటినే ఉద్బోధించడానికి పుట్టింది.

## మేనక:

అప్సరసలలో సుప్రసిద్ధురాలైన మేనక విశ్వామిత్రుని తపస్సు చెరచి అతనికి ఒక ఆడపిల్లను కనడం అనే కథ అందరికీ తెలిసినదే. గర్భం దాల్చాక వియోగం అప్సరసల గాథలన్నింటిలోనూ సాధారణాంశం. మేనక బిడ్డను కని అడవిలో వదిలేసింది. శకుంత పక్షులు ఆ బిడ్డను పెంచాయి. మేనక విశ్వామిత్రుణ్ణే కాక విశ్వావసు అనే

గంధర్వుణ్ణి కూడా మోహితుణ్ణి చేసింది. అతనికో ఆడపిల్లను కని ఏటి వద్దున పారేసి స్వర్గానికి వెళ్ళిపోయింది. ఆ బాలికను స్థూలకేశుడనే ఋషి పెంచి ప్రమద్వర అనేపేరు పెట్టాడు. ఈ చిన్నరి పమతీ ఘృతాచులకు పుట్టిన రురుడు అనే ఋషిని ప్రేమించి పెళ్ళాడింది. ఒక అప్సరసకు పుట్టిన సంతానాన్ని యింకో అప్సరసకు పుట్టిన సంతానం ప్రేమించడం మనువాడడం అనే ఐతిహాసిక సత్యానికి కిదొక దాఖలా రురుడు ప్రమద్వరల కథలో కూడా వియోగం మారువేషం వేసుకొని కనబడుతుంది. వాళ్ళు ప్రేమించుకొన్నాక ప్రమద్వర పాముకాటువల్ల మరణిస్తుంది. తన యాగఫలాన్ని సగం ధారపోసి రురుడు ఆమెను బతికించుకొన్నాడు. నాగజాతిమీద పగపట్టాడు.

## రంభ:

దేవ వేశ్యలందరిలోనూ అందచందాలలో ఆటపోటలలో అసమానురాలు ఒక్క రంభే అన్న అభిప్రాయం మన పురాణ గాథలను చిత్రించే సాహిత్యంవల్ల కలుగుతుంది. చిత్రకూట పర్వతం వద్ద నున్న ఒక పుష్కరిణి చెంత సుసేనుడనే రాజును రంభ సంధించి చాలా కాలం క్రీడించింది. తానెవ్వరో చెప్పలేదు. వాళ్ళకు ఒక ఆడబిడ్డ పుట్టాక తన సంగతి చెప్పి ఆ బిడ్డను అతని దగ్గర వదిలేసి స్వర్గానికి వెళ్ళిపోయింది. ఆకుమార్తె పేరు సులోచన. (మదన మంజు కలంబకం – కథా సరి త్సాగరం – తరంగం–2)

గౌతమ మహర్షి రంభనుచూసి మోహించాడు. అతని వీర్యం వల్ల కృపి అనే కుమార్తె జన్మించింది. ఈమెను ద్రోణుడు చేపట్టాడు. ద్రోణుడు అప్సరసకు ఒక ఋషి వల్ల పుట్టినవాడే.

## శకుంతల:

అభిజ్ఞాన శాకుంతలం రూపకంతో శకుంతల కథను కాళిదాసు సుప్రసిద్ధం చేశాడు. శతపథ బ్రాహ్మణంలో శకుంతల కూడా ఒక అప్సరస అని ఉంది. (XIII - 5-4-11). మహాభారతంలోని కథనం ఎలా ఉన్నా కాళిదాసు కల్పించి ఆగాథని ఎంతమార్చినా శకుంతల అప్సరసే. ఆమె దుష్యంతుని గాంధర్వవిధిలో కూడింది. గర్భం దాల్చింది. బిడ్డను తండ్రికి అప్పగించి తన దారిని పోదామనుకుంది. ఆమెకు ఆత్మాభిమానం ఎక్కువ. మహాభారతంలో...

'క్షితా వటసి రాజేంద్ర అంతరిక్షే చరామ్యహం
అవ యోరంతరం పశ్యమేరు సర్షప యోరివ'
–[సంభవ – 74 – 144]

శకుంతల దుష్యంతుణ్ణి "నువ్వు భూమ్మీద ఉండే వాడవు. నేను ఆకాశయానం చేసే దానిని. మహా మేరువుకూ చిన్న కొలనుకూ ఉన్నంత తేడా నాకూ నీకూ ఉంది" అని నిష్కర్షగా చెప్పింది. ఇంద్ర వరుణ యమ కుబేర లోకాలకు స్వేచ్ఛగా పోయిరాగల శక్తి అందరు అప్సరసలకున్నట్లే తనకూ ఉందని మహాభారతంలోని శకుంతల చాటుకొంది.

'కామంత్వయా పరిత్యక్తా గమిష్యామి స్వమాశ్రమం
ఇమాంతు బాలం సంత్యక్తుం నార్హస్యాత్మజ మాత్మానః'
–[సంభవ – 74 – 134]

"నన్ను పరిత్యజిస్తే నాకేం చింతలేదు. హాయిగా మా లోకానికి వెళ్ళిపోతాను. అయితే ఈబాలుణ్ణి తిరస్కరించే హక్కు నీకు లేద"ని శకుంతల కచ్చితంగా రాజుకు చెప్పింది.

రూపకంలో ఉదాత్తతకోసం కాళిదాసు మూలకథనుంచి ఎన్ని మార్పులు చేసినా దుష్యంతుడు ఆమెను నిరాకరించాక కాంతిరాశియైన అప్సరస సానుమతి (బహుశా మిశ్రకేశి) వచ్చి శకుంతలను అప్సరస్తీర్థానికి ఎగరేసుకుపోయింది. అభిజ్ఞాన శాకుంతలంలోని షష్ఠాంకం ప్రమదావన రంగంలోని దృశ్యం వల్ల అప్సరస్తీర్థంలో సాధుజనుల స్నానం చేసేటప్పుడు అప్సరసలు సన్నిధానంలో ఉండి తాను చేయవలసిన పనులను చేసి వచ్చారని సానుమతి స్వగతంలో చెప్పుకొంటుంది.

పైన పదిమంది అప్సరసల గాథలను కొద్దిగా పరిశీలించడం వల్ల, శకుంతల కథలోని అప్సరస్తీర్థం సింధునాగరికతలోని పుష్కరిణి వంటిదని ఊహించడంలో తప్పులేదు. అక్కడ సాధుజనులు స్నానం చేస్తున్నప్పుడు సన్నిధానంలో ఉన్న అప్సరసలు చేయవలసిన సెక్సు కార్యాలున్నాయి. అప్సరసలు గర్భం దాల్చేదాకా పురుషులతో క్రీడిస్తారు. బిడ్డ పుట్టాక ఎవరి దారి వారిది. అలా పుట్టిన బిడ్డలను పెంచేవారు వేరే ఉన్నారు. గణంలో పుట్టిన బిడ్డ మొత్తం గణానికి చెందినదే.

అప్సరసలు ఎక్కడ క్రీడిస్తారు? దేవాలయాలు కట్టడానికి అనువైన నదీ తీరాలలో, తోటలలో కొలనుగట్లమీద, కొండ కొమ్ములమీద పైన పరిశీలించిన అప్సరసలు క్రీడించినట్టు విశదమవుతుంది. గుళ్ళూ గోపురాలూ లేని కాలంలో అటువంటి ఆయతనాలు కట్టదగ్గచోట్లలోనే విహరించారంటే వాళ్ళ సెక్సు గుడిలో సెక్సుకు బీజమన్నమాట. ఆదిమ సమాజాలలో ప్రజోత్పత్తి అన్ని ఉత్పత్తుల కన్నా ముఖ్యమైనది. అంగబలం ఉంటే అదే అర్థబలానికి పెట్టుబడి. ఆదిమ సమాజంలో సెక్సు సంబంధాలు గణంలోనే అంటే కులంలోనే ఉండేవి. కాంతలందరూ కులకాంతలే.

# కులకాంతలూ - కులటలూ

ఆదిలో కులాలంటూ ఏమీ ఉండేవి కాదు. అందుచేత కులటల ప్రసక్తే ఉండేదికాదు. కట్టుబాట్లు ఏర్పడ్డాక, కులాలు పుట్టాక కులాచారాన్ని అతిక్రమించటం జరిగితే, అప్పుడూ కులటలు ఏర్పడ్డారు. కులట అన్నపదానికి నానార్థాలు ఉన్నాయి. ఇప్పుడు మనం వ్యభిచారిణి అన్న ఉద్దేశంతో ఈ మాటను వాడుతున్నాం. నిఘంటువులు ఇచ్చే అర్థాల ప్రకారం కులట అంటే కులాలు విడిచిపోవునది అసతి, రంకుటాలు అనే వివిరణతోపాటు పతివ్రతయగు భిక్షుకి అనే అర్థం కూడా చెప్పారు. [చూ. సూర్యరాయాంధ్ర నిఘంటువు] పతివ్రత అంటూనే కులట అనడం ఎలా సాధ్యమవుతుంది? ఈ పతివ్రత భిక్షుకిగా బ్రతకటం ఏమిటి? చాలా తోతుకు దిగి పరిశోధిస్తేగాని ఇది తేలదు.

స్త్రీలలో కులట ఉన్నట్లే పురుషులలో కులటుడు అనేరకం మనిషిని మనవాళ్ళు గుర్తించారు. కులటుడు అంటే ఒక కుటుంబం నుండి మరొక కుటుంబానికి వెళ్లేవాడు అని అర్థం. ఇంకొకరకంగా చెప్పాలంటే దత్తపుత్రుడన్నమాట. మగవాడి విషయంలో లేని నీచార్థం ఆడదాని విషయంలో ఎందుకు రావలసివచ్చింది? కులాలు ఏర్పడకముందు స్త్రీ పురుష సంబంధాలు ఎలా ఉండేవి?

కులాలులేని అత్యంత ప్రాచీనకాలంలో స్త్రీ పురుషులు చిన్న గుంపుగా కలసి ఆహారాన్వేషణ చేస్తూ ప్రకృతిసహజమైన కామవాంఛతో జతకట్టేవారు. స్త్రీలు అనావృతవలై ఉండేవారు. అంటే ఒక పురుషునికే శాశ్వతంగా కట్టుబడి ఉండేవారు కాదు. ప్రజలు పశువులలాగే తమ తమ మందలలో ఉండేవారు. ఈ పరమ ప్రాచీన సంఘం గురించి పాండురాజు కుంతికీ వివరించి వివాహమనే వ్యవస్థా, ఒక స్త్రీ ఒకే ఒక పురుషుని సొత్తుగా ఎవరి ఆదేశం వల్ల సంఘంలో స్థానం ఏర్పరచుకుందో చెప్పాడు.

అనావృతాహి సర్వేషాం వర్ణనామంగనా భువి
యథాగావః స్థితాస్తాత స్వేస్వేవర్ణేతథా ప్రజాః
[ఆదిపర్వం, 122 వ అధ్యాయం]

ఈ ఘట్టాన్ని నన్నయ్యగారు క్లుప్తంగా తెనిగించారు. "తొల్లి స్త్రీలు పురుషులచేత అనావృతులై స్వతంత్ర భృతిని అఖిలప్రాణి సాధారణమైన ధర్మమున తమ తమ వర్ణంబులందు ఋతుకాలంబు దప్పక నియతా నియత పురుషులై ప్రవర్తిల్లుచున్న ఉద్దాలకుడను ఒక్క మహాముని భార్య అతిసాధ్వి, అధిక తపోనిధి అయిన శ్వేతకేతు తల్లి ఋతుమతియైన దానిని ఒక్క వృద్ధవిప్రుడతిథియై వచ్చి పుత్రార్థంబు కామించిన శ్వేతకేతుండలిగి, అది ధర్మవిరుద్ధమని ఆక్రోశించి, దాని సహింపనోపక-

ఇది యాదిగా సతులెన్నడు బరపరు
షార్థినుల్ గా జన దన్యపురుష
సంగమంబునజేసి సకలపాతకములు
నగు బర్గ్రహ భూతులైన సతుల
కిట్టిద మర్యాద ఇమ్మనుష్యులల్ల

జేసితి లోక ప్రసిద్ధిగాక
నని ధర్మ్యమైన మర్యాద మానవులకు
దద్దయుహితముగా ధర్మమూర్తి
అబ్జభవ సమానుడగు శ్వేతకేతుండు
నిలిపినదియు ధారుణీ జనంబు
నందులోక పూజ్యమై ప్రవర్తిల్లుచు
నుండె శిష్ట సంప్రయుక్తి జేసి

మరియు తిర్యాగ్యోనులయందును, ఉత్తర కురుదేశంబుయందును, మొదలింటి దర్మంబ ఇప్పుడు ప్రవర్తిల్లుచుండు.

[ఆంధ్ర మహాభారతం – ఆది– 5–84నుంచి]

శ్వేతకేతు చెప్పిన ఈ మర్యాద [ఆచారం] వెంటనే అమలులోకి రాదు. ఈ పాతకథను పాండురాజు కథనం చేస్తున్న కాలంలోనే ఉత్తర కురుభూమిలో పాతధర్మమే పాటిస్తూ జనులు తమ తమ గుంపులలో సెక్స్ సంగమాల వల్ల సంతానాభివృద్ధిని పొందేవారు. పెళ్ళి అన్నది పిల్లలను కనటానికి రూపొందించుకున్న ఒక సౌకర్యమే. స్త్రీ పురుషులు పెళ్ళి చేసుకొన్నా ఒక పరిణామదశలో భర్తవల్లనే పిల్లలను కనాలన్న పట్టింపు ఉండేదికాదు. కులం అన్నది ఏర్పడటానికి ముందు మానవ సంఘాలు గుంపులు, ముఠాలు తండాలు, తెగలు మొదలైన పేర్లతోనే ఉండేవి. వ్యవసాయం జీవనాధారమయ్యాక కులాలు ఏర్పడ్డాయి. కాయకసర్లు ఏరుకొని బతికే స్థితినుంచి పంట పండించుకొని జీవించే దశకు చేరుకొనడానికి మానవులకు చాలాకాలం పట్టింది. మధ్యలో ఎన్నెన్నో అంచెలున్నాయి.

నేటి మన భారతదేశంలో, ఆమాటకొస్తే ఆంధ్రప్రదేశ్‌లోనే వివిధప్రాంతాల్లోని ఆదివాసుల జీవన విధానాలను పరిశీలిస్తే వాళ్ల ఆచార వ్యవహారాలలో నైతిక విలువల స్థానం తెలుస్తుంది. ఈ ఆదివాసులు ఏయే పరిణామ దశలలో పయనించి నేటి స్థాయికి చేరుకున్నారో ఆ దశలోనే వైదిక సమాజపు ఆర్యులు కూడా పరిణామం చెందారు. మన ప్రాచీనకాలపు ఆచార వ్యవహారాలను వేద వాఙ్మయం పరిశీలించి, సామాజిక శాస్త్ర సహాయంతో విశ్లేషణ చేసుకొంటే కులాలు, కులకాంతలు, కులటలు అనే పదాల అంతర్యాలను అవగాహన చేసుకోవచ్చు.

వేద వాఙ్మయంలో 'కుల' 'కులపా' అనే పదాలు కనబడతాయి. వీటిలో మొదటిది వ్యస్తపదంగా ఎన్నడూ ఆదిలో ప్రయోగించినట్టు దాఖలాలు లేవు. పదబంధంగానే దర్శనం ఇస్తుంది. బ్రాహ్మణాల కాలంలోనే 'కుల' అనే వ్యస్త పదప్రయోగం మొదలైంది. కులమంటే ఇల్లు, కుటుంబం, నివాసగృహం అనే అర్థాలున్నాయి. కాలక్రమేణా కులమన్న మాటకు చాలా రకాల అర్థాలఛాయలు ఏర్పాటయ్యాయి. వంశము, అన్వయము, సజాతీయ ప్రాణి సమూహము, తెగ, గృహము, ఇల్లు, జనపదము అనే నానార్థాలు వచ్చాయి. ఇంతేకాక కులమంటే కొలను అనే వివరణ లేకపోలేదు.

ఋగ్వేదంలో ఇంటిపెద్దను 'కులపా' అని పిలిచేవారు. ఇంటిపెద్ద ఇల్లును కాపాడాలి. అధర్వవేదం [1–14–3 ]లో ఒక కన్యను 'కులపా' అనే పేర్కొనటం

జరిగింది. భర్తన్నవాడు లేక కేవలం యముడొక్కడే వలపుకాడుగా జంటగా గల స్త్రీని 'కులపా' అని వ్యవహరించారు. కట్టుకునే భర్త దొరక్క పుట్టింటిలోనే ఉంటూ వయసు మీదపడుతున్న వనితను ఋగ్వేదంలో 'అమాజుర్' అనే సార్థకనామంతో సూచించేవారు. ఈ ఋక్ చూడండి.

అమా జూరిన ప్రితోః సచాసతీ సమానాదా సదసస్త్వామియే భగమ్
కృధిప్రకేత ముప మాస్యా భరదద్ది భాగం తన్వోయేన మామహః
[ఋగ్వేదం -2-17-7]

ఈ మంత్రంలోని సతి అనే పదానికి సాయణాచార్యులు దుహిత అని అర్థం చెప్పారు. "కన్నవారి ఇంట్లో ఏళ్ల పై బడుతున్న ఆడ కూతుర్లా నేను ధనం నిమిత్తం నీ దగ్గరకు వచ్చాను. నాకు రావలసిన భాగాన్ని నా పోషణ కోసం తెలిపి కొలిచి తెచ్చి నాకు ప్రసాదించు" అని రుషి ఇంద్రుణ్ణి అర్థిస్తున్నాడు.

దీన్ని నేమాని వెంకట నరసింహశాస్త్రి గారు ఇలా అనువదించారు.

పుట్టినది మొదలు పితరుల
నట్టింటనేయున్న దుహితనయముగ దానా
పుట్టింటి వంతు గోరిన
యట్టుల హరి నిన్ను ధనము యాచింప మొకో.
ఇంత ధనమిచ్చెదనటంచు నిపుడె సకల
జనుల ముందర ప్రకటించి శక్రనీవు
దాని సంపాదమునకై తత్క్షణంబు
పోయి గొని తెచ్చి మాకిమ్ము పూర్ణమతిని.

[ప్రథమ సంపుటం పుట: 727]

ఈ అనువాదం కింద నేమాని వారు ఒక అధోజ్ఞాపికను కూడా రాశారు. "అవివాహితలగు కన్యకలు తమ పుట్టింట నుండునట్టి ఆచారమార్యులనాడు కలదనుటకు ప్రమాణికముగా ఈ ఋక్కుచాలును. అట్టి కన్యకలను గాని వారి తల్లితండ్రులను గాని బహిష్కరించెడు నాచారమానాడు లేదు. అదీ స్మృతులనాడు ఋషులు కల్పించి ఉందురు. ఈ విషయమై స్మృతి కారకుల మతము కంటే వేదమతమే లోకహితమైనది"

పెళ్ళి చేసుకోకుండా పుట్టింటినే అంటిపెట్టుకొని అక్కడే వయస్సు మళ్ళుతున్న స్త్రీలు వేదకాలంలో ఉన్నారన్న సత్యనిరూపణకు పై ఒక్క ఋక్కే చాలునని నేమానివారు అన్నారు గాని వేద వాఙ్మయంలోనే ఇలాంటి మంత్రాలెన్నో చూడవలసిన అవసరం ఉంది. ఒక్కొక్క ఋక్కు వల్ల ఒక్కొక్క నూతనాంశం లభిస్తుంది. ఉదాహరణకు ఋగ్వేదంలోనే "ఘోషాయై చిత్పితృషదే దురోణేపతిం జూర్యత్యా అశ్వినావదత్తం" అనే పూర్వగాథ ఒకటి ఉంది. [1-117-7]

ఈ పాదానికి ప్రతిపదార్థం ఇలా ఉంటుంది.

| | | |
|---|---|---|
| అశ్వినా | = | అశ్వినులారా |
| దురోణే | = | పితృగృహమందు, |

పిత్రుషదే = పిత్రు సమీపమందు,
జూర్యంతై = ముదిమినిపొందిన,
ఘోషాయైచిత్ = ఘోషాయను చిన్నదాని,
పతిం = పెనిమిటిని.
అదత్తం = ఇచ్చిరి,

ఈ ఋక్కు వల్ల పుట్టింటనే స్థిరపడిపోయిన నడివయస్సువారికి కూడా భర్తలు లభిస్తారు.

వేదకాలంలో ఆడ పిల్లలను పుట్టింటనే కట్టిపడవేయమని దేవతలను ప్రార్థించేవారు. అధర్వవేదం [1-14-2] లో దాని తర్వాతి ఋక్కులో రాజైన సోముణ్ణి చిన్నదాన్ని వశపరచుకొని యముణ్ణి ఏమని ప్రార్థించారంటే "ఈ మీ వధువుతో సంగమించండి! ఆమె తల్లి, భ్రాత, తండ్రుల ఇంటికి ఆమె కట్టుబడి ఉండేటట్టు చూడండి! ఓ రాజా! సోమా! ఈమె మీ కులానికి పెద్ద. శిరస్సువంటిది. ఆమెను తన తండ్రుల చెంతనే ఉండనివ్వండి. అందుచేత వారి శిరస్సులు ఎత్తిన తావులు కాగలవు." ఈ అధర్వ వేద మంత్రాలు పుట్టింటనుండే చిన్నదాని స్థానాన్ని , హోదాని, సాంఘిక ప్రయోజనాన్ని తెలియజేస్తున్నాయి. ఋగ్వేద ఋషులది ఎంత పితృస్వామ్యమైన వ్యవస్థ అయినా వ్యావసాయిక దశకు వచ్చేసరికి అనార్యుల మాతృస్వామ్య విధానాలను అనుసరించక తప్పలేదు. తలలు పండటం అంటే పంటలు పండటమే.

ఋగ్వేదంలో 'అపాల' అనే చిన్నది ఉండేది. ఆమె అత్రేయి. ఒక సూక్తానికి కారకురాలు. ఆమె ఒక ఋక్కులో ఇలా ప్రార్థించింది. [8-91]

*ఇమాని త్రీణి విష్టపా త్రానీంద్ర విరోహయ*
*శిరస్త తస్యోరరా మాదిదం మఉపోదరే [5]*
*అసౌచయాన ఉర్వరాదిమాం తన్వం మమ*
*అధో తతన్యయచ్చిరః సర్వాతా రోమశాకృధి [6]*

"ఓ ఇంద్రా! ఈ మూడు తావులూ మరలా పండేటట్టు చూడు! అవి మాతండ్రి శిరస్సు, అతని క్షేత్రం, నా మర్మతలం. మా పొలానికి నా తనువుకూ మా తండ్రి తలకూ రోమసమృద్ధి కలగచేయుము."

ఇక్కడ రోమాలు సస్యానికి సంకేతాలు. అపాల ఒక కులపా. పుట్టింటి పొలాలకు ఆమె పెద్ద. వాటిని పండింపచేయటం ఆమె బాధ్యత.

వేదకాలంలో రెండు విధాలైన స్త్రీలు ఉండేవారు. ఒకరు బ్రహ్మవాదినులు. రెండోవారు సద్యోవధువులు. బ్రహ్మవాదినులనే కులపాలు అనేవారు. వీరు ఉపనయనం చేసుకొని, వేదాధ్యయనం చేసి అగ్నిహోత్రాలను సంరక్షిస్తూ స్వగృహంలో భిక్షమెత్తుకొనేవారు. సద్యోవధువులు పెళ్లిచేసుకొని కాపురాలు చేసేవారు. [పి.వి. కాణేగారి 'హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్రాస్', 2వసంపుటం, పుట 293-95]

అన్నదమ్ములు లేని చిన్నది పుట్టింటనే ఉంటూ తండ్రి పొలాలు చూసుకొనేదనీ, అతనికి రావలసిన భాగాన్ని సభకు వెళ్లి రాబట్టుకొనేదనీ ఋగ్వేదంలోని మంత్రాల వల్లనే తెలుసుకోవచ్చు.

"అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగివసనయే ధనానాం
జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషాహ్రసేవ నిరిణీతే అప్సః"
[ఋ - 1-124-7]

అన్నదమ్ములు లేని చిన్నది మగవారికొరకు తిరిగి వెళ్తునట్లు, ధనలాభం కొరకు సభావేదికను అధిరోహిస్తున్నట్టు, పతిని ఆపేక్షిస్తూ మంచి వలువలు ధరించిన స్త్రీ మాదిరిగా ఈ ఉషో దేవత తన దంతరుచి తోచగా నవ్వుతూ ప్రకాశించుతున్నది." ఇదీ ఈ ఋక్కుకు రమారమీ ప్రతిపదార్థయుతమైన తాత్పర్యం. దీనిని వేదకాలం నాటి సామాజిక పరిస్థితులకు అన్వయించుకొంటూ అవగాహన చేసుకోవాలి. అన్నదమ్ములు లేని చిన్నది ఋగ్వేదకాలంలోనే కాదు, ధర్మసూత్రాల కాలంలో కూడా సర్వసాధారణమైన దుహిత అనిపించుకోలేదు. అటువంటి కుమార్తెను 'పుత్రిక' అంటారు.

మనువు తన ధర్మశాస్త్రంలో పుత్రసంతానం ముఖ్యమన్నాడు. కొడుకులు లేకుండా ఆ వంశం నశించిపోతుందన్న భయంకర పరిస్థితిలో ఒక స్త్రీ తన భర్త అనుమతితో తన మరదివల్ల బిడ్డను కనవచ్చు. మరది కాకపోతే మగడికి ఏడుతరాల లోపున బంధువైన దాయాది వల్లనైనా కనవచ్చు. [9-59] భర్త గల స్త్రీలే కాదు, వితంతువులు కూడా బిడ్డలను కనవచ్చు. [9-60]. కుమారులు లేక ఒకే ఒక్క కుమార్తెగల తండ్రి ఆ పిల్లకు పెళ్ళి చేస్తున్నప్పుడు కాబోయే అల్లునితో ఒప్పందం చేసుకోవాలి.

"అపుత్రో నేన విధినా సుతాం కుర్వీత పుత్రికాం
యదపత్యం భవేదస్యాం తన్మయస్యాత్స్వధాకరం" [మను - 9-127]

ఒకనికి పుత్రికలేక కుమార్తె మాత్రమే ఉన్నప్పుడు ఆ కన్యను వరునికిచ్చేటప్పుడు "ఈ పిల్లకు తోడబుట్టిన వాడు లేనందున దీనికి పుట్టే పుత్రుడు నా వంశానికి శ్రాద్ధం పెట్టేవాడిగా ఉండాలి" అని అల్లుడితో ఏర్పాటు చేసుకోవాలి. ఇటువంటి కూతురుకు పుత్రిక అని పేరు దక్షప్రజాపతికి అందరూ కూతుళ్లే గాని కొడుకులు లేరు. అందుచేత వాళ్లందర్నీ పుత్రికలను చేసుకొని పెళ్లి చేశాడని తరువాత శ్లోకంలో చెప్పా డు [9-128]

గౌతమ ధర్మ సూత్రాలూ వాటికి హరదత్త మితాక్షరీ ఈ విషయాన్నే ఇంకా స్పష్టంచేశాయి.

అపుత్రుడు [అనగా మగ బిడ్డలు లేనివాడు] దాయమును ఏమి చేయదగునని శంక రాగా చెప్పుచున్నారు. తండ్రి అనపత్యుడుగా అనగా మగబిడ్డలు లేనివాడైయున్నచో అప్పుడతడు తనకు ఆడుసంతానము ఉన్న యెడల [అది కూడా నొక్కటే కూతురై యున్నచో] అగ్నయేస్వాహా, ప్రజాపతయే స్వాహా అను నిత్యాదులతో నాజ్యాహుతులతో నగ్నియందు వ్రేల్చి ఆ పిమ్మట వరుని యుద్దేశించి నేను సంతానము లేనివాడను కాబట్టి ఈ కన్యకయందు నీకు కలుగగల సంతానము నా నిమిత్తముగుగాక" అని ప్రతిన చేయించి వర సంగమునకై కన్యకను వదలిపెట్టవలయునని సూత్రార్థము. ఇచ్చట ప్రతిన చేయించు విధము వాసిష్ఠస్మృతి యందిట్టుల చెప్పబడినది. "ఓయీ! ఎట్టి సోదరులును లేనియయును, యధాశక్తిగా సమలంకృతయును నగు నీ కన్యకను నీకు

భార్యగా జేసుకొనుటకై ఇచ్చుచున్నాడను కాబట్టి [అనగా ఈ బిడ్డకు సోదరులు లేరని చెప్పుటచేత నేను అపుత్రుడనని చెప్పినట్లయినది గనుక] ఈ నీకిచ్చెడి కన్యక యందు నీకు బుట్టిన పుత్రుడే నాకు పుత్రుడుగా నుండుగాక" అని మంత్రమును జెప్పుచు కన్యాదానము చేయదగును.[1]

ఈ విధంగా పెళ్ళిచేసిన తర్వాత ఆ పుత్రిక గోత్రం మారదు. తండ్రి గోత్రమే కొనసాగుతుంది. ఈ స్త్రీకి భర్తతో సంబంధమెంతవరకంటే "కేవలం సహచరణీ రతిఫలాచ" అని హారదత్తుడు అన్నాడు. అంటే సహచారిణిగా రతి ననుభవించడానికి మాత్రమే. " ఇట్లుగాక ఆమె పుత్రార్థియైనచో స్వకుల సంతానము కొరకై వివాహానంతరమును ఒనర్చుకొనవలయునని తాత్పర్యము" అని ఆంధ్ర వివరణ పంచాగ్నుల వారు ఇచ్చారు.

ఋగ్వేదం 1-124-7 ఋక్కులో ఉషో దేవతను 'అభ్రాతగా' వర్ణించడంలో ఎంతో సాంఘిక చరిత్ర ఇమిడి ఉంది. ఆనాటినుంచి ఈ ఇరవయ్యో శతాబ్దందాకా మగబిడ్డలు లేకపోతే పాటించే ఆచారం ఒకేరీతిలో కొనసాగుతోంది. ద్విజులలో ఎందరో దౌహిత్రులు తమ తమ మాతామహుల దత్తపుత్రులయ్యారు. ఇంకా అవుతున్నారు. దక్షిణభారతంలోని ఇతర వర్ణాలలో కూడా ఈ ఆచారం కనబడుతోంది.

బళ్ళారి, ధార్వార్, మైసూరు, కర్నూలు ప్రాంతాలలోని బోయలు, బేడర్లు మొదలైన కులాలలో ఆడపిల్లను బసివి, లేక బసవిగా దేవునికి అంకితం చేసి పడుపు వృత్తికి విడిచిపెట్టే ఆచారం నేటికీ మిగిలింది. మగసంతానం లేని కుటుంబంలోని ఆడపిల్లనే బసివిని చేస్తారు. బసివి పెళ్ళిచేసుకోదు. తండ్రి ఇంట్లోనే ఉండిపోతుంది. తండ్రి ఆస్తికి వారసురాలవుతుంది. అతడు మరణిస్తే కుమారుడు చేయవలసిన అంత్యక్రియలు తానే నిర్వహిస్తుంది. పడుపు వృత్తిలో కూడా తమకన్నా తక్కువ కులాల వారితో వ్యభిచరించదు. సర్వసాధారణంగా ఉంచుకున్న వానితో నియమబద్ధంగా కాపురం చేస్తుంది. అయితే ఏడాదికొకసారి తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొని అతనితో తెగతెంపులు చేసుకోవచ్చు. బసివికి మగ సంతానం కలిగితే ఆ బిడ్డ మాతామహునికి వారసుడవుతాడు. బసివికి ఆడసంతానం పుడితే ఆ కూతుళ్ళు కూడా బసివిరాండ్రవుతారు.[2] బసివి గుడిసాని కాదు. తండ్రి వంశం నశించకుండా ఆ గోత్రాన్ని నిలపడానికి పెళ్ళి చేసుకోకుండా కాపురం చేసే వ్యక్తి.

బిడ్డల్ని కని వంశాన్ని నిలబెట్టుకొనడమే సనాతన ధర్మం. అందుకు అనుసరించే మార్గాలు చాలా ఉన్నాయి. పుత్రసంతానం కలిగిన పద్ధతిని బట్టి వాళ్ళకు 12 రకాల పేర్లు వచ్చాయి.

1. ఔరసుడు – భార్య యందు, తనకు పుట్టిన కొడుకు.
2. క్షేత్రజుడు – భార్య యందు నియోగాన పుట్టిన కొడుకు
3. దత్తుడు – శాస్త్రీయంగా పెంచుకొన్న కొడుకు.
4. కృత్రిముడు – అభిమానించి పెంచుకున్న కొడుకు.
5. గూఢోత్పన్నుడు – భర్తకు తెలియకుండా రంకు మగనికి పుట్టిన వాడు.
6. అపవిద్ధుడు – పెంచుకొన్న అనాథ బాలుడు.

7. కానీసుడు – పెళ్ళి కాకముందు భార్యకు గుట్టుగా పుట్టిన వాడు.

8. సహోఢుడు – గర్భం వచ్చాక పెళ్ళి చేసుకొంటే పుట్టిన వాడు.

9. క్రేతుడు – వెల ఇచ్చి కొనుక్కొన్న కొడుకు.

10. పౌనర్భవుడు – మారు మనువు భార్యకు పుట్టిన వాడు.

11. స్వయందత్తుడు – తనంతట తాను కొడుకుగా వచ్చిన వాడు.

12. జ్ఞాతిరేయుడు – జ్ఞాతి కొడుకు.

ఈ పన్నెండు మందిలో మొదటి ఆరుగురే జ్ఞాతులవుతారు. అనగా ఆస్తి హక్కు గల వాళ్ళవుతారు. మిగతా ఆరుగురు కేవలం బంధువులు మాత్రమే. [మను 9–159,160]

వీళ్ళంతా స్వకుల సంజాతులే కాబట్టి బంధువు లవుతారు. ఆదిమ కాలంలో జనులు గుంపులు గుంపులుగా, సజాతీయులుగా పరిమిత సంఖ్యలో ఒక చిన్న భూభాగాన్ని కనిపెట్టుకొని కాపురం చేస్తున్నపుడు ఇతర గుంపులతో ఏ రకమైన సంబంధం లేనప్పుడు అందరిదీ ఒకే కులం. ఇళ్ళూ ఇంటి పేర్లూ వేరుగా ఉండేవి. ఒకే ఇంటి పేరున్న వాళ్ళ మధ్య స్త్రీ పురుష సెక్సు సంబంధాలు క్రమేణా నిషిద్ధాలయ్యాయి.

ఒకే కులంలో విభిన్నమైన ఇంటిపేర్లు ఎలా వస్తాయే తెలుసుకోవాలంటే ఒక సమకాలిక దృష్టాంతం తీసుకోవాలి. ఆంధ్రప్రదేశ్‌లో కోండులనే ఆదిమ వాసులు జీవిస్తున్నారు. వీళ్ళకు సామంత. జాతపు, కోడు, కొండకోడు, కోందు, కులింగ అనే పర్యాయ నామాలు కూడా ఉన్నాయి. వీళ్ళు కొండల మీద, కొండ చరియలలోనూ స్థావరాలు ఏర్పరచుకొంటారు. వీళ్ళు ఇళ్ళు కట్టుకొనే పద్ధతి ఒక వరుస క్రమంలో ఉంటుంది. మామూలుగా ఒక్కో స్థావరంలో మూడు ఇళ్ళుంటాయి. వాటిలో రెండిళ్ళు ఒక దానికొకటి ఎదురుగా ఉంటాయి. మూడవది మూడో వైపున మిగిలిన రెండిళ్ళ చివరల కెదురుగా ఉంటుంది. ఒక్కొక్క ఇంట్లో అయిదు లేక ఆరు గదులుంటాయి. ఆ గదులు మట్టితో పూసిన తడకలతోగాని, మట్టి గోడలతో కాని వేరు చేయబడతాయి. ఒక్కొక్క గదిలో ఒక్కొక్క కుటుంబం నివసిస్తుంది.[3]

ఈ మూడిళ్ళూ ఒకే కులానికి సంబంధించినవే. ఇందులో వర్గాలున్నాయి. వివాహ సంబంధాలు గల వర్గాన్ని 'సండిగ' వర్గమంటారు.

అటువంటి సంబంధాలు లేని వాటిని 'టయింగా' లేక సోదర వర్గం అంటారు. పెళ్ళి కులంలోనే జరిగితీరాలి. ఒక ఊరు ఊరంతా సోదర వర్గానికి చెందినదయితే వివాహ సంబంధం ఇంకో ఊరి వారితో ఏర్పడాలి.

మన తెలుగు నుడికారంలో "మీ పిల్లను ఎవరికిచ్చారు?" అని అడిగితే "ఫలానా ఇంటికి ఇచ్చాం" అని చెప్తారు. కాక " ఫలానా ఊరికిచ్చాం" అంటారు. భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో గుంపు పెళ్ళిళ్ళు ఉండేవి. టిబెట్టు కుటుంబంలో చిన్నది మనువాడాక ఎవరో ఒక్కనికే ఆలు కాకుండా ఆ చిన్న వాని ఇంట్లోని అందరికీ పెండ్లామవుతుంది. అయితే దీనికి కొన్ని షరతులున్నాయి. ఇంట్లోని పెద్ద కొడుకు మరో ఇంటి పెద్ద కూతురును పెళ్ళాడితే ఆమె చెల్లెళ్లందరూ అతని పెళ్ళాలవుతారు. ఒకవేళ ఆ అక్క చెల్లెళ్లలో రెండవదానినే చేసుకొంటే ఆమె చెల్లెళ్లు మాత్రమే

బావగారి భార్యలవుతారు. ఈ క్రమంలోనే పరిగణన చేస్తారు. పెళ్లి కొడుకుకు సోదరులుంటే వాళ్లందరూ ఆ వధువుతోనూ, ఆమె చెల్లెళ్లతోనూ కాపురం చేస్తారు. టిబెట్టులో పెళ్లి కేవలం బహు భర్తృత్వ వివాహం కింద కాక గుంపు పెళ్లిగా గుర్తించాలి. ఒక కుటుంబంలోని మగవాళ్లందరూ వివాహ సంబంధం ఉండి పెళ్లాడిన ఇంకో కుటుంబంలోని స్త్రీలందరికీ భర్తలే అవుతారు. వీళ్లందరూ కుల కాంతలే.

కేవలం భర్త సోదరులకే కాక అతని తండ్రికీ, పెద, చిన తండ్రులకూ కూడా ఆమెతో కాపురం చేసే హక్కుంది. ఈ గుంపు పెళ్లిళ్ల ప్రసక్తి ఋగ్వేదంలో కనబడుతుంది. మరుద్గణాలందరికీ రోదసి ఒక్కర్తే భార్య. అగస్త్యుడు మరుద్దేవతలను ఇలా స్తుతించాడు.

"పరాశుభ్రా అయాసో యవ్యా సాధారణ్యేన మరుతో మిమిక్షుః
న రోదసీ అపనుదంత ఘోరా జుషంత వృధం సఖ్యాయ దేవాః"
[1-167-4]

"స్వచ్ఛమైన అలంకారములు గల వారూ ఎల్లెడలా సంచరించే వారూ అయిన మరున్నామక దేవతలు సాధారణి అయిన భోగినితో చేరిన పురుషుల వలె మెరుపుతో చేరి వానలు కురిపిస్తున్నారు. అధిక వృష్టిని కురిపించి భయపెట్టే వీరు రోదసిని నిరాదరణ చేయక అభివృద్ధి పరుస్తున్నారు."

"జోషద్యదీమ సుర్యాసతర్వ్య-విషితస్తుకా రోదసీ నృమణాః
ఆ సూర్యేవ విధతో రథంగాత్ త్వేష ప్రతీకా నభసో నేత్యా" [1-167-5]

"మరుద్దేవతలను కూడినదీ విడిన కేశములు కలిగి మనుషులందు ప్రీతి గల మనసు గలిగినదీ అయిన రోదసి ఈ మరుత్సంగమును సంగమం కొరకు సేవిస్తున్నది. సూర్యుని రథాన్ని ఎక్కి అంతరిక్షాన సంచరిస్తున్నది."

ఈ సూక్తానికి ద్రష్ట అయిన అగస్త్యుడు మరుత్తుల లాగే మాతృ గణవర్గానికి చెందిన వాడు. అతని తల్లి ఊర్వశి. పలువురి చెలియ, ప్రేయసి మన వేద వాఙ్మయంలో మరుద్గణాలలాగే ఇతర గణాలు కూడా ఉన్నాయి. ఒక్కొక్క గణానికి ఒక ఉమ్మడి చెలువ ఉంటుంది. ఆమెను 'జని' అంటారు.

1. వసు గణాలు – సంఖ్యలో 8. జని – గంగ
2. రుద్రగణాలు – సంఖ్యలో 11. జని – త్రియంబ.
3. ఆదిత్య గణాలు – సంఖ్యలో 12. జని – అదితి
4. విశ్వే దేవగణాలు – సంఖ్యలో 13. జని – విశ్వ.
5. మరుద్గణాలు – సంఖ్యలో 63. జని – రోదసి

ఈ అయిదు సోదర వర్గాల్లో 107 ఇళ్లున్నాయి. వీరందరూ అనార్యులకు చెందిన ఒక జాతి. దేవి నిర్పతికీ సోమునికీ ఈ జాతి జన్మించినట్లు ఆదిమ భావన. నిర్పతి నేల తల్లి, సోముడు నింగి తండ్రి. ఈ ఇద్దరికీ ప్రతి అమావాస్యనాడు పెళ్లి జరుగుతున్నట్టు సనాతనుల విశ్వాసం. ప్రతి మాసంలో జరిగే ఈ పెళ్లిని 'దేవ వివాహం' అని ఐతరేయ, బ్రాహ్మణం [IV- 27] పేర్కొంది. ప్రతి మాసం పాత

సోముడు [చంద్రుడు] మరణించి, కొత్త సోముడు ఉద్భవించి నిర్భతితో సంగమిస్తాడు. ఇది వ్యావసాయిక సమాజ వ్యవస్థలో మూల సూత్రం.

కులం అన్న పదం కేవలం వ్యవసాయ దశలోనే వాడుకలోకి వచ్చింది. కులం అంటే గ్రామం అనే అర్థమే అయినా ఆ గ్రామంలోని పంటకు కూడా అదే మాట వాడతారు. మనువు గ్రామాధిపతుల జీతాల గురించి ఇలా చెప్పాడు.

*దశీకులంతు భుంజీవి వింశీపంచకులానిచ*
*గ్రామం గ్రామ శతాధ్యక్ష్యః సహస్రాధిపతిః పురమ్*

[మను - 7-117]

వ్యాఖ్యాతలు దీనికి ఇలా అర్థం చెబుతున్నారు. " పది గ్రామముల కధిపతి మడక యొక్కంటికి దినమునకు ఆరెద్దులు విడిచి కట్టుకట్టెడు రెండు మడకల చేత దున్నబడు భూమి యందు పండు ధాన్యమును, ఇరువది గ్రామముల కధిపతి వానికి అయిదు పాళ్ల ధాన్యమును, నూరు గ్రామముల కధిపతి మధ్యతరమైన ఒక గ్రామమును, వేయి గ్రామముల కధిపతి మధ్యతరమైన యొక పట్టణమును తన జీవనం నిమిత్తము అనుభవించుకొనవలయును" ఈ వ్యాఖ్యానం వల్ల కులము రెండు మడకల చేత దున్నబడే భూమి అని నిర్ధారణ అవుతోంది.

కుల భూమిని సేద్యం చేయటానికి నీటి వనరులు అవసరం. పంట కాలువలను కుల్యలంటారు. కుల భూమి కొలతకు ఒక పరిమాణాన్ని నిర్ణయించినట్టే కుల్యకు కూడా ఒక కొలతను పూర్వులు నిర్దేశించారు ఎనిమిది ద్రోణముల ధ్యానము పట్టే గంపను కుల్య అంటారు. నాలుగు కుంచాల ధాన్యమని కొందరంటారు. ఒక కుల్యలోని విత్తనాలు ఒక కులంలోని పంటకు సరిపోతాయని చెప్తారు. ఒక కులం పొలం 128 నుంచి 160 భిగాల పరిమాణముంటుంది.

ఆదిమ వ్యవసాయ కర్మలన్నీ స్త్రీలే చేసేవారు. సేద్యం అసలు ఆడవారి సొత్తు. వేద కాలంలో సీతా యజ్ఞం చేయందే వ్యవసాయ కార్యాలు మొదలుపెట్టేవారు కాదు. భూమాతకూ గణమాతకూ పోలికలు ఎక్కువ. ఒకరు పండితే ఇంకొకరు కూడా పండుతారు. గణమాతనే 'కులపా' అని గౌరవించేవారు.

జనుల ఉత్పత్తి విధానాలను పెంచుకొని గుంపుల నుంచి గణాలుగా, గణాల నుంచి జనపదాలలో ఉండే జాతిగా పెరిగారు. జనపదాలు వచ్చాక 'కులపా' కూడా మార్పు చెంది 'జనపద కళ్యాణి' అయింది. ఈ పరిణామం వల్లనే 'కులపా' కాస్తా 'కులట' గా దిగజారి, పతితగా భావించటానికి ఈ పరిస్థితులు ఏర్పడ్డాయి. [కులాన్ యటతి ఇతికులటా] ఒక గణం నుంచి ఇంకో గణానికి ద్రిమ్మరేది కులట అయింది. గణమాతగా ఒక్క కులాన్నే అంటిపెట్టుకొనేది జనపదకళ్యాణి కాగా జనపదాలలో సంచరించవలసి వచ్చింది. బౌద్ధ వాఙ్మయంలో జనపద కళ్యాణుల ప్రసక్తి చాలాసార్లు గమనించవచ్చు.

# అథోజ్ఞాపికలు

[1] పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి ఆంధ్ర వివరణలలో ఉన్న గౌతమ ధర్మసూత్రములు - పుట 46

[2] సంతోష్ చటర్జీ 'దేవదాసి' పుటలు 51 నుంచి 59 వరకు.

[3] ఆంధ్రప్రదేశం ఆదిమ జాతులు డి. ఆర్. ప్రతాప్. పుట.39

[4] శరద్ పాటిల్ గ్రంథం పుట 129లో ఉదహరించిన బ్రియఫ్రాల్ట్స సంపుటాలు 'ది మదర్స్'లో సంపుటి -1, పుట 447

# వానలూ - వనితలూ

కులకాంతలు కాపురం చేస్తారు. కులటలు పడుచుకుంటారు. ఇదీ సర్వసాధారణంగా లోకుల అభిప్రాయం. ఆదిమ సమాజంలో కులకాంతలూ, కులటలూ అనే తేడా ఉండేది కాదు. మర్యాదస్తులు, పెద్ద కుటుంబాలలోని స్త్రీలు కూడా పవిత్రమైన దేవాలయాలలో పడుపు వృత్తిని ఆచారంగా పాటించే వ్యవస్థ ప్రాచీన మధ్య ప్రాచ్యంలో ఉండేదని ఇంతకుముందు గమనించాం. ఋగ్వేద సమాజంలో దేవాలయాలు అంటూ ఏమీ లేవు గాని సెక్సుకు ప్రధాన స్థానం ఉండేది. ఆదిలో ఋషులందరూ గృహస్థులే.

సెక్సుకూ వ్యవసాయానికి చాల సంబంధాలున్నాయి. వ్యవసాయాన్ని తెలుగులో సేద్యం అంటాం. సేద్యానికి కమతం, కాపురం, కాస్త సాగు అనే పర్యాయ పదాలు న్నాయి. రైతులు పొలం దున్ని పంటలు పండించడాన్ని వ్యవసాయం అంటారు. ఉమ్మడి సేద్యాన్ని పొత్తు కాపురం అంటారు. సేద్యంలో చేను పంట, సంసారంలో కడుపు పంట పరమార్థాలు. చేను వానతో ముందుగా తడవాలి. మగనాలి కడుపులో వీర్యం చేరాలి.

సకాలంలో వానలు కురవాలి. అలా కురవకపోతే నష్టం, అరిష్టం. వేద కాలం నుండి నేటి వరకూ వానల కోసం చేసే పూజలు, జరిపే తంతు, నడిపే సంబరాలు కోకొల్లలు. తెలుగునాట గ్రామీణులు పాటించే ఆచారాలు పరిశీలించదగ్గవి.

వానకూ కప్పలకు లంకె ఉంది. వానలు పడితే చెరువులు నిండుతాయి. 'తెప్పలుగ చెరువు నిండిన కప్పలు పదివేలు చేరు' వానవస్తే కప్పలు చేరుతాయి, సరే – మరి వాన రాకపోతే ? కప్పలను పురమాయించి వానలను తెప్పించాలి. అందుకే తెలుగు వారు వానల కోసం కప్పాలమ్మ కప్పల దేవర, కప్పతల్లీ సంబరాలు చేస్తారు. కప్ప తల్లికి పెళ్లి చేస్తారు. వరుణదేవుడు కప్పతల్లి పెళ్లికి కావిళ్లతో నీళ్లు పంపుతాడట. వాడలన్నీ నింపుతాడట. కప్పతల్లి గడప తొక్కితే శుభసూచనలను చూరు చెప్తుందట. కప్ప ఎగిరితే పొలములో వానలు పడి కనకమే పండుతుందని విశ్వాసం.

వాన కోసమే కప్పల కావిడి అనే సంబరం కూడా చేస్తారు. కప్పలలో పలు రకాలున్నాయి.1. ఉరుకుడు కప్ప. 2. వదరు కప్ప. 3.గోండ్రుకప్ప. 4. ఆడుకప్ప. 5. చిరుకప్ప. వీటిలో గోండ్రుకప్పనే బోదురు కప్ప పెద్ద కప్ప అంటారు. ఈ కప్పనే కప్పల కావిడి సంబరంలో వానకోసం వాడుకొంటారు.

వర్షాలు సకాలంలో పడనప్పుడు హరిజన స్త్రీలు ఒక బోదురు కప్పను పట్టుకుని, పసుపు రాసి, కుంకుమ బొట్లు పెట్టి పసుపు గుడ్డతో రోకలి మీద పెట్టి, కట్టి,ఇద్దరు దాన్ని మోసుకొంటూ ఊరంతా తిప్పుతారు. వీళ్లవెంట కొందరు పేరంటాళ్ళు పళ్లెంలో పసుపూ, పువ్వులూ, పత్రీ పట్టుకుని కోలన్న పుల్లలతో వాయిస్తూ కరతపదంగా ఒక పాటను పాడుతారు.

వానదేవుడా వానదేవుడా
వానల్లు కురిపించువానదేవుడా ॥వాన॥

కప్పతల్లి నీల్లాడె
కడవల నిండ నీళ్ళొచ్చె
మొ(్రో వానదేవుడా //వాన//
దోమ తల్లీ నీళ్ళాడే
దొరవుల నిండా నీళ్ళొచ్చె
మొ(్రో వానదేవుడా //వాన//
చేపతల్లీ నీళ్ళాడే
చెరువుల నిండా నీళ్ళొచ్చె
మొ(్రో వానదేవుడా //వాన//
తూరుపున మొయిలు చుట్టి వానదేవుడా
తుంపరులు రావాలి వానదేవుడా
చిన్న చిన్న తుంపరలు వానదేవుడా
చెలరేగి కురవాలి వానదేవుడా
జడివాన రావాలి వానదేవుడా
సాగాలి కాలువలు వానదేవుడా
చెరువులన్ని నిండాలి వానదేవుడా
చేలన్నీ పండాలి వానదేవుడా
అందవయ్య దణ్ణాలు వానదేవుడా
అందరిని బతికించు వానదేవుడా

ఇలా కప్పాలమ్మను పాట పాడుతూ ఊరేగిస్తూ చెరువు దగ్గరకు చేరుతారు. సంబరం చివర కప్పను చెరువులో వదలుతారు. నీళ్ళాడు అనే మాట ప్రసవించడానికి జాతీయం. కప్పతల్లి ఒక్కర్తే కాదు ఆమెతో పాటు ఈగతల్లి, దోమతల్లి, చేప తల్లి, ప్రకృతి ప్రకృతంతా ప్రసవించాలని ప్రాకృతుల ఆకాంక్ష

కప్పల కావిడి లాగే వాన కోసం జానపదులు చేసే జాతరలు చాలా ఉన్నాయి. ఊరు ఊరంతా కలిసి వలస జాతర చేస్తారు. దీనినే గంపజాతర, వరదపాసెం, వనభోజనం అంటారు. వాన కోసం ఊరు విడిచి అడివిలోకి వెళ్ళాలి. అక్కడ వండుకొని తినాలి. ఈ జాతరలలో గాలి దేవరను, వలస దేవరను పూజిస్తారు. ఊరి బయట పాయసాన్నం వండి, ఎత్తయిన ప్రదేశంలో వరుణ దేవున్ని అహ్వానం చేస్తూ ఈ పరమాన్నాన్ని ఒక బల్ల మీద వారపోస్తారు. దానిని దేవ ప్రసాదంగా ప్రతి వారూ తీసుకుని కళ్ళకద్దుకుని భజిస్తారు. దీనినే వరదపాశం అంటారు. వన భోజనంలో సాలదేవర్ని పూజిస్తారు.

కప్పలకావిడి సంబరంలో కప్పను చెరువులో విడిచి పెట్టినట్టు ఇంకో సంబరంలో జోకుమారుని గంపలో పెట్టుకుని ఊరంతా తిరిగి భాద్రపద అమావాస్య నాడు నీళ్ళులేని ఓటి కుంటోలో ఆ దేవతను విడిచి వస్తారు. రామభక్తి ప్రబల మయ్యాక వాన కోసం రామదండు నడిపే ఆచారం ఒకటి ఉంది. ఊళ్ళో ఇంటి కొకరు చొప్పున

తలంటుపోసుకుని, కర్రలకు రాగి ఆకులూ, పసుపు గుడ్డలూ కట్టుకుని రాములు వారి పటం పట్టుకుని మూడూళ్ళుగాని, ఐదూళ్ళుగాని తిరుగుతారు. ఆ ఊళ్ళల్లో వీళ్ళకు అతిథి సత్కారాలు చేస్తారు. వాన రాకపోతే పాండవుల పేర అయిదు బొమ్మలు పెట్టి పొంగళ్ళు పొంగిస్తారు. దీనిని పాండవ పొంగలంటారు.

ఇవన్నీ సాత్త్విక పూజలు. వాన కోసం గంగ జాతర చేయడంలో జంతు బలి ఉంటుంది. గంగానమ్మ, చెరువు గంగమ్మ, బాలి గంగమ్మకు ఏటలు కొడతారు. వాన రాకపోతే కేవలం వనభోజనాలే కాక చెట్టు జాతర కూడా చేస్తారు. అడవిలోని కెళ్ళి ఇష్టమైన చెట్టును నరికి తెస్తారు. ధాన్యాదులన్నీ కలిపి రొట్టెలు చేస్తారు. మేకపోతును కొట్టి ఆ నెత్తురులో రొట్టెలు కలుపుతారు. ఒక గొయ్యి తవ్వి రొట్టెలను, చెట్టునూ, అందులో పాతి పూజిస్తారు.

వానలు కురవాలన్న కోరికతో కప్ప తల్లి నీళ్ళాడడం కోసం గ్రామాల్లో కప్ప సంబరం చేస్తారు. నీళ్ళాడడంలో ఒక సంప్రదాయం ఉంది. గ్రామంలో ఎవరైనా స్త్రీ ప్రసవించాక పురిటి మైలతీరాక శుద్ధి స్నానం చేయాలి. దానికో సాముహిక ఆచారం ఉంది. చూలింతను నులక మంచం మీద స్నానాల దొడ్డి [జల దొడ్డి] లో కూర్చోబెట్టి ఊరి ఆడవాళ్ళందరూ ఇంటికో కడివెడు నీళ్ళు ఆమెపై పోస్తారు. దీన్నే నీళ్ళాడడం అంటారు. మానవ స్త్రీ ఎలాగ నీళ్ళాడుతుందో ఆడ కప్ప కూడా అలాగే నీళ్ళాడాలి. అందుకే కప్ప సంబరంలో ఊరేగించే కప్ప మీద నీళ్ళు పోస్తారు.

"మున్నీరు" అనే జానపద గీతాల సంకలనాన్నీ వ్యాఖ్యానంతో పాటు నేదునూరి గంగాధరం గారు ప్రచురించారు. అందులో "మొర్రో వానదేవుడా!" అనే పాట శీర్షిక కింద ఇలా వివరించాడు. "రాయలసీమలో 'కొరచ' అనే ఒక తెగ జనులున్నారు. ఊరు బయట పాక గుడారాలు వేసుకుని ఉంటారు వారు. పందులు మేపుకుంటారు. దొంగతనాలు చేస్తారు. వానలు లేనప్పుడు కొరచ స్త్రీలు మట్టి ముంతల్లో నీళ్ళు పోసి, వాటిలో కప్పలు పెట్టి తంగేడు ఆకులు కప్పి ఊళ్ళంబడి తిరుగుతారు. ఇంటింటికి వెళ్ళి "మొర్రో వానదేవుడా?" అని పాడాతాడు. ఇంటింటా ఇల్లాళ్ళు ఆ కొరచ పడుచుల నెత్తి మీద చెంబెడు నీళ్ళు పోసి చేరెడు ధాన్యమిచ్చి పంపుతారు. దాంతో వానలు కురుస్తాయని వొక నమ్మకం."[2]

సెర్వియాలో అనావృష్టి యేర్పడిన కాలంలో ఒక యువతిని పూర్తిగా వివస్త్రను చేస్తారు. ఆమెను పువ్వులతో అలంకరిస్తారు. ఆ నగ్న స్థితిలో ఆ పిల్ల ఇంటింటికీ వెళ్ళి ఆ గడప దగ్గర నృత్యం చేస్తుంది. ఇంటి ఇల్లాలు బయటకు వచ్చి ఆ పిల్ల నెత్తి మీద ఒక కూజాడు నీళ్ళు పోస్తుంది. అర్ధనగ్న యువతితో ఊరేగే ఆడ పిల్లలు వాన పాటలు పాడుతూనే ఉంటారు.[3]

వానలు కురిపించడం తమ కర్తవ్యమని మన దేశంలోనే కాదు. ప్రపంచమంతటా స్త్రీలు భావిస్తారు. ట్రాన్స్‌సెల్వేనియాలోని ఒక జిల్లాలో నేల ఎండిపోయి బీటలు వారితే, కరువు ముదిరితే కొంత మంది యువతులు తమ వస్త్రాలు విప్పిపారేసి తమలాగే వివస్త్ర అయిన ఒక వృద్ధ స్త్రీ నాయకత్వంలో సేద్యం పని ముట్లలో ఒకటైన గుంటకను దొంగిలించి, దానిని పొలాలలో ఈడ్చుకుంటూ ఒక వాగు దగ్గరకు

వెళ్తారు. ఆ నీళ్ళలో ఈ గుంటకను పడేసి దాన్ని తేల్చుతారు.[4]

క్రీస్తు శకం 1873–74 సంవత్సరంలో గోరఖ్‌పూర్‌లో ఒక దుర్భరమైన క్షామం వచ్చింది. అప్పుడు కొంత మంది స్త్రీలు ఒక జట్టుగా తమ వలువలు పూర్తిగా విప్పేసి, దిన మొలలతో ఇళ్ళ నుంచి బయటకు వచ్చారు. తమతో పాటు ఒక నాగలిని తీసుకు వెళ్ళి పొలాలలో దానిని ఈడ్చుకొంటూ సాగారు. మీర్జాపూర్‌లో క్షామం వచ్చినప్పుడు ఒక రైతు కుటుంబంలోని ముగ్గురు స్త్రీలు పూర్తిగా వివస్త్రలయ్యారు. అంతకు ముందే ఊళ్ళో ఉన్న మగవాళ్ళందరూ వేరేచోటుకు వెళ్ళిపోయారు. సంపూర్ణ నగ్న స్త్రీలు ముగ్గురూ పొలానికి వెళ్ళారు ఎద్దులాగ ఇద్దరు కాడి మెడ మీద పెట్టుకోగా మూడవ దిన మొల స్త్రీ నాగలిని చేతపట్టింది. ముగ్గురూ దుక్కి దున్నడాన్ని అభినయించారు. బెంగాలు ఉత్తర భూముల్లో రాజ్‌బంసీ తెగకు సంబంధించే స్త్రీలు క్షామం ఏర్పడ్డప్పుడు సంపూర్ణంగా నగ్నులవుతారు. ఆ స్థితిలో వానదేవుడి బొమ్మ ముందు నాట్యం చేస్తారు.[5]

వర్షాల వల్ల పుడమి తల్లి కడుపు పండుతుందన్న విశ్వాసం కేవలం ప్రాకృత జనులదేకాదు, ఋగ్వేద ఋషులు కూడా ఇలాగే భావించే వారు. ఒక ఋక్కులో ఇలా చెప్పారు.

ప్రథిష్ట యామన్ పృథివీ చిదేషాం భర్తేవ గర్భం స్వమిచ్ఛవో దుః
వాతాన్ హ్యశ్వాన్ ధుర్యాయుయుజ్రే వర్షం స్వేదం చక్రిరే రుద్రియానః

[ఋగ్వేదం – 5–58–7]

"రుద్రకుమారుల అగమనంతో పృథ్వి ఫలప్రదమవడానికి తాను సంసిద్ధమవుతుంది. భర్త ఏలాగైతే భార్య గర్భంలో వీర్యం నిక్షిప్తం చేస్తాడో అలాగే పృథ్వి కడుపులో వారు జల రూపంలో తమ వీర్యాన్ని ప్రసాదిస్తారు. గాలుల గుర్రాలను వాళ్లు రథానికి పూన్చారు. తమ చెమటను వానగా కురిపించారు." ఈ త్రిష్టుప్ ఋక్కును నేమానివారు రెండు కంద పద్యాలలో అనువాదించాడు.

పతి యే రూపున భార్యకు
తత గర్భము గలుగ జేసి ధన్యుండగు నా
వితమున రుద్ర కుమారులు
క్షితికిన్ జలగర్భ మొసగి చెలగెదరు గదా
ప్రతత మరుత్తులు పుట్టుగ
క్షితి యుర్వరయయ్యె మరియు శీఘ్రమె హయరా
తతి రథము ముందు నుండగ
నతి వృష్టి జనించుచుండు నందరు మెచ్చన్

నభోదేవతల స్వేదం వీర్యమై వర్షరూపంలో భూమాత కడుపులో చేరి ఆమెను గర్భవతిని చేస్తుందన్న నమ్మకం అక్కడితో ఆగిపోలేదు. వానలో తడిస్తే యువతులు గర్భవతులవుతారన్న ఆశా, భయం రెండూ ప్రాకృత జనాలలో పాతుకుపోయింది. వివిధ దేశాలలో ఇది ఉంది. "బుష్‌మన్ స్త్రీలు, ఆడపిల్లలు వర్షం కురుస్తున్నప్పుడు

తడవకుండా ఉండాలని తలదాచుకొంటారు. నేల తల్లిని గర్భవతిని చేసే మింటిధారలు తమ్ముకూడా తల్లులను చేస్తాయని భయం, హాటెంటాట్ స్త్రీలు ఇంకోలాగా భావిస్తారు. ఉరుములు, మెరుపుల జడివానలో తాము దినమొలతో నిలబడి మొదట చిత్తుగా తడవకపోతే తమకు సంతానం కలగదని గట్టిగా నమ్ముతారు. ఆస్ట్రేలియాలోనూ, మంగోలియాలోనూ స్త్రీలు వానల వల్ల గర్భధారణ కలుగుతుందని విశ్వసిస్తారు.

పంజాబ్‌లో పిల్లలు కావాలనుకొనే స్త్రీలు దారులు కలిసేచోట నడివీధిలో స్నానం చేస్తారు. ఇతరప్రాంతాలలో గొడ్డువీగని స్త్రీని ఒక బల్లమీద కూర్చోపెట్టి నూతిలోకి తాళ్ళతో దింపుతారు. ఆమె తన వస్త్రాలను విసర్జించి జలకమాడాక, ఆమెను పైకి తోడుతారు. నూతిలో దిగడానికి వీలుకానప్పుడు చెట్టు కింద కూర్చోపెట్టి స్నానం చేయిస్తారు. నూతిలోనూ, చెట్టులోనూ, గర్భధారణ శక్తులున్నాయి. ఆ ప్రదేశాలలో జలకాలాడిన వాళ్ళకు కడుపు నిలుస్తుంది. నూయి ఎండిపోతుంది. చెట్టు వాడిపోతుంది. బిడ్డ పుడుతుంది అని పామర విశ్వాసం. ఖోండులలో గొడ్రాలిని పూజారి రెండు వాగులు సంగమించే చోటికి తీసుకెళ్ళి ఆమె మీద నీళ్ళు జల్లుతారు. కోయి గోండులు పెళ్ళినాడే వధువు శిరస్సు మీద నీళ్ళు దిమ్మరింపచేస్తారు. నీటికీ, వాన నీటికీ పంటనూ, కడుపు పంటనూ ప్రసాదించే శక్తులున్నాయన్న విశ్వాసం ఎప్పటినుంచో ఉంది.

వంటకూ, కడుపు పంటకూ స్త్రీ పురుషులిద్దరూ ఉండాలి. నేల ఆడదైతే నింగి మగవాడు. మింటిలోని ఉరుమును, ఉరిమే మేఘాన్ని, మేఘాన్ని, వర్షాన్నీ పర్జన్యం అంటారు. ఇంద్రుణ్ణి పర్జన్యుడంటారు. ఋగ్వేదంలో పర్జన్యుణ్ణి సుతిస్తూ సూక్తాలున్నాయి.

అచ్ఛావద తపసం గీర్భిరాభిః స్తుహి పర్జన్యం సుమసావివాస
కనిక్రదద్ వృషభో జీరదానూ రేతో దధాత్యోషధీమ గర్భం
[ఋగ్వేదం -5-83-1]

గర్జించు పర్జన్య స్వాగతము నీకు
గళమెత్తి నీ ఘనత గానమ్ము సేతు
నభములో ఆంబోతు రంకె వేసింది
శుభములీయగ తాను త్వరపడసాగె
ఓషధుల గర్భాన రేతస్సు నుంచె
[స్వీయానువాదం]

ప్రవాతా వాన్తి పతయంతి విద్యుత ఉదోష ధీర్జిహాతే పిన్వతే సః
ఇరా విశ్వస్మై భువనాయ జాయతే యత్‌పర్జన్యః పృథివీం రేతసావతి
[ఋగ్వేదం 5-83-4]

గాలుల్లు గట్టిగా వీచేటి వేళ
మెరుపు తీగెలు మింట మెరిసేటివేళ
నేల చీల్చుకు చెట్లు మొలకెత్తు వేళ

నింగి కాంతుల ధార పారేటి వేళ
జీవకోటికి తిండి చిగురించు చూడ
ఆవేళ పర్జన్యు డవని గర్భాన
రేతస్సు తేమల తేజస్సు నిలుపు

[స్వీయానువాదం]

ప్రార్థిస్తే పర్జన్యుడు వానలు కురిపిస్తాడట. అతడు కరుణామయుడే అయినా వాన లెందుకు తరుచు ఎడపెడతాయి. కరువుకాటకాలెందుకు కడు భయంకరమవుతాయి? ఒక్క గ్రీష్మతాపం వల్లనే కాదు. తపోదీక్ష వల్ల జనించే మహోగ్రతాపం వల్ల కూడా అని మన పూర్వులు భావించేవారు. సృష్టి కార్యం చేయవలసిన పురుషులు ఋషులై ముక్కు మూసుకుని తపస్సు చేసుకుంటూ అడవిలో ఏమూలో కూర్చొంటే వాళ్ళని ముక్కు పట్టుకున్నట్టు పట్టుకుని జనపదంలోనికి ఈడ్చుకు వచ్చి వాళ్ళ చేత సృష్టి కార్యం చేయించడం ఆడవాళ్ళ ధర్మమని వానలు కురిపించే పర్జన్యుడు అంటే ఇంద్రుడు భావించేవాడు.

అందుకే మన పురాణ కథలో తాపసుల ఉగ్రతపస్సుకు విఘ్నం కలిగించడానికి ఇంద్రుడు దేవవేశ్యలయిన అప్సరసలను పంపడం రివాజుగా కనబడుతుంది. హైందవ పురాణాలలోని వివిధ కథలకు ముడి సరుకు బౌద్ధవాఙ్మయంలో మనకు లభిస్తుంది. జైనులూ, బౌద్ధులూ ప్రాచీన సమాజంలో ప్రచారం పొందిన కథలను యథాతథంగా కథనం చేసేవారు. మారుతున్న సాంఘిక పరిస్థితులకు అనువుగా బ్రాహ్మణ మతానికి అధిక్యం ఉండేటట్లు ఆ ప్రాథమిక కథలనే పురాణాలలో మార్పులు చేశారు. బౌద్ధ వాఙ్మయంలో కూడా ఇంద్రుడున్నాడు. అతనిని శక్రుడంటారు. వివిధ జాతక కథలలో శక్రుని ప్రసక్తి కనబడుతుంది. మచ్చుకు ఒకటి చూడండి.

లోమకశ్యపుడు ఇంద్రియాలను జయించి ఘోర తపస్సు చేస్తున్నాడు. అతని తపస్తేజము చేత శక్రభవనము కంపించింది. శక్రుడు తన పదవి పోతుందని భయపడ్డాడు. వారణాసీ రాజు వద్దకు వెళ్ళి లోమకశ్యపుడి తపస్సు మానిపించి అతనిని యజ్ఞానికి పిలిపించితే నీకు ఏక ఛత్రాధి పత్యాన్ని ప్రసాదిస్తాను అన్నాడు. రాజు తన అమాత్యుడు సహ్యాని పిలిపించి లోమ కశ్యపుని తీసుకు రమ్మని చెప్పాడు. అమాత్యుడు వెళ్ళాడు. మునిని ఆహ్వానించాడు గానీ లోమకశ్యపుడు రానన్నాడు. అమాత్యుడు తిరిగి వచ్చి ఆ సంగతి రాజుకు చెప్పాడు. అతడు రాకపోతే మనమేం చేయగలమని రాజు ఊరుకొన్నాడు.

"అర్ధరాత్రమున శక్రుడు వచ్చి మహారాజా లోమకశ్యపుని పిలిపించి యజ్ఞమేల మీరు ప్రారంభింపలేదు? "అని అడిగెను.

"పిలువనంపినను అతడు రాలేదు" అని రాజు చెప్పెను.

"మహారాజా ! మీ పుత్రిక చంద్రావతిని అలంకరించి సహ్యాని వెంట నచటికి పంపి, 'నీవు వచ్చి యజ్ఞము చేసిన యెడల రాజామెను నీకిచ్చును' అని చెప్పి పంపుము. ఆమెను చూసి అతడు ఒక వేళ రావచ్చును అని శక్రుడు పలికెను."

లోమకశ్యపుడు ఆమెను చూశాడు. మోహంలో పడ్డాడు. ఆమె వెంట యజ్ఞం

చేయడానికి, తర్వాత ఆమెను పొందడానికి వెళ్ళాడు. ఆ తర్వాత కథతో మనకు ప్రస్తుతం అవసరం లేదు. ఎవరైనా తపస్సు చేస్తూ ఉంటే శక్రుడు దానిని చెడగొట్టడానికి స్త్రీలను ఎలా వినియోగిస్తాడో తెలుసుకొనడానికి ఈ జాతక కథ పనికి వస్తుంది.

తపో భంగానికీ సెక్సు సంబంధానికి కులకాంతలనూ అందులో రాజకన్యలనూ వినియోగించడం ఆదిలో ఉండేది. ఉత్తరోత్తరా ఈ అలవాటు మన పురాణాలలో ఎలా మారిందో, వానల కోసం వంశాభివృద్ధి కోసం ఎన్ని ప్రయత్నాలు చేసేవారో ఋశ్యశృంగుని కథకు గల వివిధ పాఠాంతరాలు తెలియచేస్తాయి.

## అధోజ్ఞాపికలు

[1] చూ. మాండలిక వృత్తి పదకోశం - సంపుట 1, వ్యవసాయ పదాలు పుటలు 17 నుంచి.

[2] మున్నీరు - పుట 248

[3] "పాప్యులర్ రెలిజియన్ అండ్ ఫోక్‌లోర్ ఆఫ్ నార్త్రన్ ఇండియా" అనే గ్రంథంలో డబ్ల్యు క్రూక్ ఒక ఆచారాన్ని గ్రంథస్థం చేశారు. దాన్ని దేవి ప్రసాద్ ఛట్టోపాధ్యాయ తన " లోకాయత" అనే గ్రంథంలో ఉటంకించారు. - పుట - 292

[4] లోకాయత - పుట 292

[5] లోకాయత - పుట 291.

[6] సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహితా రెండవ సంపుట - పుట -677 [రెండవ సంపుటం - పుట 677]

[7] జాతక కథలు, చతుర్థ సంపుటి: స్వామి శివశంకర శాస్త్రి, పాలీ నుంచి ఆంధ్రీకరించినది జాతక కథ నెం.133.

# ఋష్యశృంగుని కథలు

వానలు కురిపించేవాడు వనితలకు బిడ్డలు కూడా కలిగించగలడు. ఇది ప్రాచీన విశ్వాసం. వానలు కురిపించగల మంత్రమహిమాన్వితుడే రాజవంశాలలో మాతృ గణ వ్యవస్థలో గర్భప్రదాతగా ఉండాలన్న నియమం కూడా ఉండేదనిపిస్తుంది. ఋష్యశృంగుని కథలూ, కొన్ని యాగాలలో తంతులూ ఇవే రుజువు చేస్తాయి.

ఋష్యశృంగుని గురించి చెప్పకొనే కథలు విభిన్న విధాలుగా కనబడతాయి. అయితే అన్నింటిలో కథాసూత్రం ఒక్కటే. బౌద్ధవాఙ్మయంలో కొన్ని కథలు ఉన్నాయి. మహాభారతంలో ఒక పాఠం, రామాయణంలో ఇంకో పాఠం ఉన్నాయి. ఈ కథలన్నీ ఇండాలజీ పండితులు విశ్లేషణ చేశారు.

జె.ప్రిజిలుస్కీ అనే ఆచార్యుడు పుట్టుకచే పోలిష్ పౌరుడు. అతని జీవిత కాలం (1885–1944)లో బహుభాషావేత్తగా తులనాత్మక వ్యాకరణ కోవిదునిగా, బౌద్ధహైందవ ప్రాచీన సంస్కృతుల విశ్లేషకునిగా పరమ ప్రామాణికునిగా పేరెన్నికగన్నాడు. పంజాబులోని ప్రాచీన ప్రజలు అనే మౌలిక పరిశోధనలో ఇతర విషయాలతోపాటు ఋష్యశృంగుని కథలు విశ్లేషించాడు.

ఆచార్య ప్రిజిలుస్కీ చైనీయ భాష నుంచి రెండు బౌద్ధ కథలను తీసుకొని వాటితో రామాయణ మహాభారత గాథలను తులనాత్మకంగా పరిశీలించాడు.

## మొదటి కథ

ఇది మహావస్తు నుండి గ్రహించిన కథ. పూర్వం కాశ్యపుడనే ఋషి సాహంజని వద్ద ఆశ్రమం నిర్మించుకున్నాడు. అతడు విసర్జించిన వీర్యంలో కొంత భాగాన్ని ఒక' ఆడులేడి ఒకనాడు గ్రోలింది. దానికొక కుమారుడు పుట్టాడు. ఆ పిల్లవాడు తన బిడ్డే అని ఋషి గుర్తించి ఆశ్రమానికి తీసుకొని వెళ్ళి పెంచాడు. ఏకశృంగుడని పేరు పెట్టాడు. ఆ పిల్లవానికి తల్లి పాలిచ్చి సాకింది. ఆశ్రమ మృగశాబకాలతోపాటు ఏకశృంగుడు పెరిగాడు, వాటితోనే ఆడుకున్నాడు. తండ్రికి పరిచర్యచేస్తూ అతడు చతుర్విధధ్యానములు పంచవిధఅభిజ్ఞలు సంపాదించాడు.

ఈ లోగా వారణాసిలో పుత్రులు లేని ఒక రాజు ఒక నిర్ణయం తీసుకున్నాడు. ఏక శృంగుని తన అల్లుని చేసుకుని తన కుమార్తెనిచ్చి పెళ్ళి చేయాలనుకున్నాడు. రాజుగారి పురోహితుడు రాజకుమారి నళినినీ ఆమె చెలికత్తెలనూ వెంట బెట్టుకుని ఆశ్రమానికి వెళ్ళాడు. ఏకశృంగుడు ఆ నారీజనాన్ని చూసి వాళ్ళూ ఋషులే అనుకున్నాడు. వారి వస్త్రాలను మెచ్చుకున్నాడు. అవి వారిపాలిండ్ల కన్నా మెరుగులీనుతున్నాయి. వారు పెట్టిన మధురమైన తినుబండారాలను భక్షించి అవి కూడా ఫలాలే అనుకున్నాడు. నళిని చేసిన శృంగార చేష్టలకు అతడు స్పందించలేదు. వాళ్ళతో పాటు వాళ్ళ చక్రాల మీది కుటీరాలలో ప్రవేశించ నిరాకరించాడు. వారి వెంట వెళ్ళే మృగాలు లేళ్ళనుకున్నాడు. రాజకుమారి తన బృందంతో వారాణసి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయాక ఏకశృంగుడు ఆమె గురించే ఆలోచించసాగాడు. ఆమె సాన్నిధ్యంలోని మధురిమ అర్థమైంది. ఆశ్రమ విధులు మరచిపోయాడు. తండ్రి అతనిని మందలించి వచ్చినవాళ్ళు ఋషులు కారు, స్త్రీలని చెప్పాడు. స్త్రీలు తపస్సుకు శత్రువులని చెప్పాడు. వాళ్ళతో ఏ సంబంధాలూ పెట్టుకోవద్దన్నాడు.

ఇంతలో నళిని ఆశ్రమ ప్రాంతాలకు మళ్ళీ వచ్చింది. ఈ సారి పడవలో వచ్చింది. ఆమె ఆకర్షణకు ఏకశృంగుడు లోనయ్యాడు. ఆమె ఆలింగనాలకు కరిగాడు. మధురభక్ష్యాలు ఆరగించాడు. ఈసారి వాళ్ళ నీళ్ళ మీది కుటీరాలలోనికి వెళ్ళడానికి అంగీకరించాడు. పురోహితుడు నళినికీ ఏకశృంగుడికీ పెళ్ళి చేశాడు. ఆ జంటకు వెంటనే కామ సంబంధాలు లేవు. ఇద్దరూ స్నేహితులులాగే ఉన్నారు. ఏకశృంగుని తల్లికి ఈ సంగతి తెలిసింది. అతనికి విడమరచి చెప్పడానికి చాలా కష్టమైంది. ఆశ్రమానికి చేరువలో ఉన్న భిక్కునీ సంఘం వల్ల ఏకశృంగునికి ఆడా, మగా తేడాల గురించి జ్ఞానోదయం కలిగింది. కాశ్యపుడు కుమారుని పెళ్ళికి సమ్మతం చెప్పాడు. ఏకశృంగుడు వారాణసికి రాజయ్యాడు. నళినికి చాలా మంది బిడ్డలను కన్నాడు. సన్యసించాక, మరణించాక ఏకశృంగుడు బ్రహ్మలోకం చేరుకున్నాడు.

## రెండవ కథ

ఈ కథను ఆచార్య ప్రిజిలుస్కీ చైనీను విజ్ఞాన సర్వస్వం నుండి సేకరించాడు.

వారాణసి రాజ్యంలో ఒక లేడి తపోధనుని వీర్యం వల్ల గర్భం ధరించింది. బిడ్డ పుట్టాడు. అతడు పెరిగి పెద్దవాడవుతూ దివ్యచక్షువు, దివ్యక్షేతము, పూర్వజన్మ స్మృతి, బుద్ధి బలము, పరేంగిత – జ్ఞానము అనే అయిదు అభిజ్ఞలు సంతరించుకున్నాడు. ఒకనాడు వానపడుతోంది. నేల జారుతోంది. అతడు కిందపడ్డాడు. కాలు గాయపడింది. అతను కోపపడ్డాడు. వానలు పడకూడదని శపించాడు. కరువు కాటకాలు, అనావృష్టితో విజృంభించాయి.

వారాణసిలో జనులు చర్చించి ఏకశృంగుడు శపించడంవల్ల ఏర్పడ్డ క్షామం పన్నెండేళ్ళు కొనసాగుతుందని నిర్ణయించారు. రాజు దేశంలో చాటించాడు. ఏకశృంగునికున్న అయిదు అభిజ్ఞలను పోగొట్టగలిగినవారికి అర్ధరాజ్యమిస్తానన్నాడు. శాంత అనే వారకాంత తాను అలాచేయగలనని ముందుకు వచ్చింది. రాజు అనుమతి తీసుకొని 500 మంది యువతులతో, అయిదు వందల వాహనాలతో కదిలివెళ్ళింది. ఆ బళ్ళల్లో మత్తుమందులు, మహోమైకమిచ్చే మధువులూ ఉన్నాయి.

ఋషులలాగ మారు వేషాలు వేసుకొని వేశ్యలు అరణ్యంలో ప్రవేశించి పర్ణ కుటీరాలు నిర్మించుకున్నారు. ఏకశృంగునికి పూవులూ, మధువులు, ఆనందగుళికలు ఇచ్చారు. అతడు అవి ఫలాలు, జలాలూ అనుకొన్నాడు. ఆరగించాడు. ఆ యువతులతో కలిసి జలకాలాడాడు. వాళ్ళ కాముక చర్యలకు, శృంగార విలాసాలకు లోనయ్యాడు. ఆ సౌఖ్యాలు ఆశించి తన అభిజ్ఞలు పోగొట్టుకున్నాడు. శాంతతో ఏకశృంగుడు సరససల్లాపాలాడుతూ ఉండగా ఏడురాత్రులు, ఏడుపగళ్ళూ ఏకధారగా కుంభవృష్టి కురిసింది.

వేశ్యలు ఏకశృంగుని వారాణసికి తీసుకువెళ్ళారు. అక్కడ అతడు అమాత్యుడ య్యాడు. కాని కొన్నాళ్ళకు ఐహిక సౌఖ్యాలను రోసి అడవికి పోయి మళ్ళీ తన అభిజ్ఞలను సంపాదించుకున్నాడు.

## మూడవ కథ

ఇది కూడా బౌద్ధ గాథే. దీనిని ఆచార్య ప్రిజలుస్కీ కాక శరద్‌పాటిల్ తన గ్రంథంలో ఉటంకించాడు. ఇది జాతక కథే. దీని పేరు నళినికాజాతకం. [నెం.526] ఇది కూడా ఋష్యశృంగుని కథే కనుక ఇక్కడ కొంత పొందుపరుస్తున్నాను.

వారాణసి రాజ్యంలో మూడేళ్ళ పాటు శక్రుడు వానలు నిలుపుదల చేశాడు. వ్యవసాయం ఆగిపోయింది. కరవుదికటతాండవం చేసింది. బాధిత ప్రజలంతా రాజభవనం ముందు చేరి "దేవా ! వానలు కురిపించు దేవా!" అని మొర పెట్టారు... రాజు తన కుమార్తె నళినికను పిలిచాడు. "దేశంలో సేద్యం స్తంభించిపోయింది. రాష్ట్రం మండిపోతోంది." అని చెప్పాడు. వెళ్ళి ఇసిసింగ ఋషిని కలుసుకోమన్నాడు. ఆ బ్రాహ్మణునితో సంభోగించమన్నాడు. నళినిక, ప్రయత్నాలు ఫలించాయి. ఆమె బ్రాహ్మణునితో శాస్త్రోక్తంగా మూడుసార్లు సంభోగంలో పాల్గొంది. వెనువెంటనే శక్రుడు కాశీరాజ్యంలో వానలు కురిపించాడు.

## నాలుగవ కథ

ఇది మహాభారతం అరణ్య పర్వంలోని విస్తృత కథ [110-113 అధ్యాయాలు] సంస్కృత మూలానికి తగినంత విధేయతతో భారతాన్ని పురాణ పండ రామ్మూర్తిగారు వ్యాఖ్యానించారు. అందులోంచి ఈ విశ్లేషణకు సంబంధమున్న భాగాలను ఉటంకిస్తాను.

విభాండక మహర్షి కాశ్యపగోత్రీకుడు... దేవతాసమసుందరుడు. నానావిధక్లేశాలను అనుభవిస్తూ ఆయన చిరకాలం తపోదీక్షలో ఉన్నాడు. ఒకనాడు ఆయన స్నానం చేస్తూ ఉండగా ఊర్వశి ఆయన కంట పడింది. ఆమెనుచూస్తూ ఉండగా మహర్షికి వీర్యస్ఖలనం అయ్యింది. అప్పడే జలపానార్థం వచ్చిన ఒక లేడి నీటితో పాటు ఆ వీర్యాన్ని కూడా మింగింది. అంతటితో అది గర్భం ధరించింది. దాని గర్భంనుండి ఒక బాలుడు ప్రభవించాడు. ఆ బాలుడే ఋశ్యశృంగుడు... బ్రహ్మచర్య దీక్షలో తపస్సమాధిలో ఉండేవాడు. తన తండ్రిని వినా ఏ ఇతర మానవ ప్రాణిని చూచి ఎరుగడు.

ఆ రోజులలో అంగదేశాన్ని లోమపాదుడు పరిపాలించేవాడు... ఇంద్రుడు ఆదేశానికి అనావృష్టి పట్టించాడు... ప్రజలు విపరీతమైన బాధలకు గురైనారు. తపస్వులూ, మేధావులూ... మహారాజా నీ రాజ్యంలోనికి ఋశ్యశృంగ మహర్షిని రావించాలి... ఆ మహర్షి నీరాజ్యంలో అడుగుపెట్టిన ఉత్తరక్షణంలో మేఘాలు వర్షించి తీరుతాయి. ఇందులో ఏ విధమైన సందేహం లేదు...

... ఎంతటి వారినైనా సమ్మోహింపచేయటంలో సామర్థ్యంగల వేశ్యామణులను పిలిపించి... ఋశ్యశృంగుని మన రాజ్యానికి తీసుకు [రమ్మన్నాడు]. వారిలో వృద్ధ

వేశ్య...[ రాజా] జ్ఞానుసారం... తీసుకురాగల [మని] సుందరీజనాన్ని వెంటబెట్టుకుని ఋశ్యశృంగుడు నివసించే ఆశ్రమంవైపు అడుగువేసింది. [ఈ సందర్భంలో ఏర్పాట్లన్నీ తన ఇచ్చానుసారం జరగాలని వృద్ధ వేశ్య షరతు పెట్టింది.]... తన వలెనే వేశ్యా వృత్తిలో ఆరితేరిన కుమార్తెను పిలిచి చెయ్యవలసిన పనులన్నీ చెప్పి ఆశ్రమంవైపు పంపింది...

వేశ్యాపుత్రి ఋశ్యశృంగుని తనఒడిలో కూర్చోబెట్టుకొని తనదేహంతో అతనిదేహం అణుస్తూ కాలం గడుపుతూ... అగ్ని కార్యానికి సమయం మించిపోతున్నదని ... వేశ్యాపుత్రి వెళ్ళిపోయింది. ఋశ్యశృంగుడు అచేతనుడయ్యాడు. .. [తండ్రి వచ్చాక] ఆ బ్రహ్మచారిని చూడనిదే నా హృదయం శాంతించదు అని ఋశ్యశృంగుడు జరిగిన విషయాలన్నీ పూసగుచ్చినట్లు నివేదించాడు. రాక్షసులే ఈ విధమైన సుందరా కారాలను ధరించి అద్భుత కార్యాలాచరిస్తూ ఉంటారు. .. అటువంటి వారిని కలుసుకోవద్దని విభాండకుడు అడవిలోకి వెళ్ళాడు. సమయం కనిపెట్టి వేశ్యాపుత్రి ఆశ్రమానికి వచ్చింది. ఆమెను చూచిన ఋశ్యశృంగుడు పులకిత దేహుడై ఒక్క అంగలో ఆమెను సమీపించి బ్రహ్మవేత్త మాపితృపాదులు రాకుండానే మీ ఆశ్రమానికి వెళ్ళాలన్నాడు. [ఆమె] ఋశ్యశృంగుని తనవెంట తీసుకొని నావపైకి ఎక్కించి నావ నడిపించింది...

నౌక క్రమంగా అంగదేశం చేరింది. లోమపాదుడు ఋష్యశృంగుని వెంటబెట్టకొని రాణివాసంలో విడిది చేయించిన ఉత్తర క్షణంలో ఈ జగత్తే జలమయం అయిపోతుందా అన్నట్లు వానలు ఆరంభమయ్యాయి. మనోరథ సిద్ధిపొందిన లోమపాదుడు పరమ సంతోషంతో తమ అనుంగు పుత్రియైన శాంతను ఋష్యశృంగునికిచ్చి వివాహం చేయించాడు. విభాండకుడు... దేవలోకంలో ఇంద్రునివలే మహా భోగాలతో ఉన్న కుమారుని ఆ ప్రక్కగా నున్న కోడలినీ చూసి పరమానంద భరితుడయ్యాడు. "నాయనా నీకు కుమారుడు కలుగగానే ఈ రాజ్యం విడిచి అరణ్యానికి వచ్చేయ్" అని అన్నాడు!

## అయిదో కథ

ఇదీ ఋష్యశృంగుని కథే. దీనిని వాల్మీకి రామాయణం బాలకాండలో పదో సర్గలో సుమంతుడు దశరథునికి కథనం చేస్తాడు టూకీగా ఇలా ఉంటుంది. ఇందులోనూ వారకాంతలు వెళ్ళి అతణ్ణే లోమపాదుని రాజ్యానికి తీసుకవస్తారు. ఋష్యశృంగుడు అడుగుపెట్టగానే వానలు కురుస్తాయి. శాంతనిచ్చి పెళ్ళి చేస్తారు. శాంత ఇంతకూ దశరథుని కూతురే. పుత్రులు కలుగడానికి తనచేత యాగం చేయించడానికి దశరథుడు ఋష్యశృంగుని వెళ్ళి తీసుకువస్తాడు. పిల్లలు లేరని దశరథుడు యాగం చేయబోతాడని అది ఋష్యశృంగుని ఆధ్వర్యంలోనే జరుగుతుందని సనత్కుమారుని వంటి త్రికాల వేత్తలకు ఎన్నేళ్ళ కిందటో తెలుసు. ఆ సంగతి మునుల సభలో అతడు చెప్తూ ఉంటే సుమంత్రుడు విన్నాడు. అవసరం వచ్చినప్పుడు అది జ్ఞప్తికి తెచ్చుకున్నాడు.

వాల్మీకి రామాయణంలోని ఋష్యశృంగుని ఉదంతం ఎన్నో వడపోతల తర్వాత తేలినది. ప్రాచీన సంప్రదాయం ప్రకారం ఋష్యశృంగుని వంటివారు లేకపోతే బిడ్డలు

కలగడం సాధ్యంకాదు. అందుచేత దశరథుని యాగంలోనికి అతనిని పౌరాణికులు తీసుకువచ్చారు.

ఇప్పుడు అయిదు కథలనూ విశ్లేషించి చూస్తే గమనించదగ్గ అంశాలు స్పష్టమవు తాయి.

1. మొదటి కథలోనూ, మూడవ కథలోనూ ఋష్యశృంగుని చెరచడానికి రాజే తన కుమార్తెను పురమాయిస్తాడు.
2. రెండవ, నాల్గవ అయిదవ కథలలో ఋష్యశృంగుని తీసుకురావడానికి రాజు వారకాంతలను పంపుతాడు.
3. మొదటి కథలో వానల కోసంకాక బిడ్డలకోసమే రాజు తన కూతుర్ని ఋష్యశృంగుని వద్దకు పంపాడు.
4. జాతక కథలో ఋష్యశృంగుడు నళినికతో ముమ్మారు సంభోగించగానే వానలు కురిశాయి. మొదటి కథను తప్పించి మిగతా వాటిలో ఋష్యశృంగుని రాకవల్ల వానలు కురిశాయి.
5. నళిని కథానాయిక అయిన రెండు కథల్లో తప్పించి మిగతా మూడు కథలలో శాంత ప్రసక్తి ఉంది. ఆమె ఋష్యశృంగుని పత్ని అయింది.
6. ఎక్కువ కథలలో ఋష్యశృంగుని నావలో తీసుకొని వచ్చారు. వానలు పడడానికి నావలకు సంబంధం ఉంది. ఈ విషయం రాబోయే ఒక ప్రకరణంలో దేవదాసీల సేవల గురించి చర్చిస్తున్నప్పుడు మనవి చేస్తాను.
7. మహాభారతంలోని కథలో బిడ్డ పుట్టగానే ఋష్యశృంగుని అరణ్యానికి తిరిగీ వచ్చే యమని విభాండకుడు ఆదేశిస్తాడు. ఋష్యశృంగుని పిలిపించడంలోని ఉద్దేశ్యం బిడ్డలే అని తెలుతుంది.
8. మహాభారత కథలో ఋష్యశృంగుని చెడగొట్టి తెచ్చే బాధ్యత ఒక వృద్ధ వేశ్య తన మీద వేసుకొంటుంది. ఈ పాఠాంతరరచనా కాలానికి వేశ్యావ్యవస్థ వేళ్ళూని మూడు పువ్వులూ ఆరు కాయలయిందన్నమాట. రెండవ కథలో శాంత అనే తరుణ వేశ్య తనంతటతాను రాజుగారి చాటింపు విని అర్థరాజ్యం కోసం ముందుకొచ్చింది. ఈ కథ రచనా కాలంలో కూడా వేశ్యలకు దాసీ బృందం ఉండేది.
9. కొన్ని కథలలో ఋష్యశృంగుడు ఋషి వీర్యం తాగిన లేడి కడుపున పుట్టినట్టు తెలుస్తున్నది. ఒక్క రామాయణ కథలో తండ్రి పేరు చెప్పినా, తల్లి ఎవరో వివరించినట్లు కనబడదు. ఋష్యశృంగుడు హరిణీ తనయుడు కావడం ప్రాచీనతకూ, సనాతన సదాచారానికి నిదర్శనం.
10. రామాయణం కథలో అడవినుంచి తీసుకొచ్చాక లోమపాదుడు, అంగదేశం నుండి తీసుకొచ్చాక దశరథుడు ఋష్యశృంగుణ్ణి అంతఃపురం ప్రవేశింపచేశారని చెప్పడం గమనించదగ్గ విషయం. అంతఃపురం అంటే రాణివాసపు స్త్రీలుండే నగరు.

## సమన్వయం

పైన చెప్పుకొన్న అయిదు కథలనుండే పది అంశాలను గుర్తించాం. ఋష్యశృంగుడు

హరిణికి జన్మించిన వాడు కావడం చాలా ప్రాధాన్యమున్న అంశం అనుకొన్నాం. దీనికి చరిత్రకు పూర్వయుగాల నుంచీ ఒక ప్రత్యేకత ఉంది. పాతరాతియుగంలో మానవులు వేటవల్ల జీవించేవారు. ఒక గుంపుగా బతికే తెగఅంతా ఆ వేటలో పాల్గొనేవారు. వేటగాళ్ల ఎకానమీ లో వేటాడి తెచ్చిన జంతువు వాళ్ళకు ఎన్ని రకాలగానో ఉపయోగపడేది. శుభ్రం చేసిన తోలును ధరించేవారు. ఎముకలతో, కొమ్ములతో జీవితావసర వస్తువులు తయారు చేసుకొనేవారు. ఎముక సూదులతో నరాల దారాలు కుట్టేవారు. కొవ్వు దీపానికి వాడేవారు. ఏంట్రకోలలూ, కొక్కి కొండులు చేపలు పట్టడంలో ఉపయోగించేవారు. వేటాడి తెచ్చిన జంతువుల మాంసం నిత్యభోజనానికి వాడుకొనేవారు. వేట సామూహిక్రియేకాక ఆ జంతువుతో తమ బంధుత్వానికి ఒక సంకేతం.

ఆదిమ జాతులలో ఒక ముఖ్యమైన సంప్రదాయం ఉంది. తాము తినే జంతు జాలంలోని ప్రధానమైన జంతువుతో అవినాభావం, తాదాత్మ్యం, ఆప్తబంధుత్వం పెంచుకొంటారు. వేట విజయవంతం కావడానికి కులపెద్ద మంత్రకర్మ చేస్తాడు. బంధు జంతువు చర్మాన్ని ధరించి దాని అడుగులనూ, అలవాట్లనూ అనుకరిస్తూ నాట్యం చేస్తాడు. [చిత్రం 13]



చిత్రం 13. బంధు జంతువు చర్మాన్ని ధరించిన వ్యక్తి

తెగలోని ఇతరులు వేటలోని జంతుజాలాన్ని అనుకరిస్తారు. ఈ వృత్తం శివమెత్తి నట్లు గుహాంతర్భాగంలో చేస్తారు. [ ఉదాహరణకు మన ఆంధ్రప్రదేశంలోనే బొర్రా గుహలలో ప్రాచీన ఆచారానికి ప్రత్యామ్నాయంగా ఏడాది కొకసారి లోతుగుహలోనికి దిగి జాతర చేయడం, సన్నని ఇరుకు సందులోంచి జలమార్గం ద్వారా వెళ్ళడం మొదలైనవి ఉన్నాయి.] పాత రాతియుగం నాటి గుహాంతర్భాగాలలోని చిత్రాలను చూస్తే వేట ప్రాముఖ్యం తెలుస్తుంది. [చిత్రాలు 14, 15]



చిత్రం 14. పాతరాతియుగం గుహలో చిత్రం



చిత్రం 15. పాతరాతియుగంలో వేట గుహలో చిత్రం

పాతరాతియుగం నాటినుంచీ కొన్ని ప్రాంతాలలో రెండు మూడు రకాల జంతువులు లభ్యమవుతున్నా ఒక తెగ ఒక రకం జంతువులను వేటాడంలోనే ఆరితేరేది. ఆ జంతువు వారి బంధుజంతువై వారి గోత్ర చిహ్నమవుతుంది. ఇంకొక తెగ మరొక రకం జంతువులను వేటాడడంలో ప్రావీణ్యం సంపాదించితే ఆ జంతువు వారి గోత్ర చిహ్నమవుతుంది. ఈ రెండు తెగలూ తమ తమ ఆహార జంతువుల మాంసాన్ని ఒకరికొకరు సఖ్యంగా "పోరట్టులు" పెడుతూ ఉంటే అదే బంధుత్వం. ఈనాడు ఒకే కులంలో పెళ్ళిళ్ళు చేసుకునే వివిధ గోత్రాలు 'ఇచ్చి పుచ్చుకునే' సంబంధం గలవి అనడంలో అర్థం. ఆదిలో ఆ రెండు తెగలూ ఆహారాన్ని మార్పిడి పద్ధతులలో పంచుకొనడమనేదే పరమార్థం.[1]

ఋగ్వేద సమాజం నుండే మనకు గోత్రాలు కులాలు ఏర్పడ్డాయి. గోత్రాలు వచ్చాకనే సగోత్ర వివాహాలు కాక విగోత్ర వివాహాలు ప్రాచుర్యం పొందాయి.

ఆదిమ సమాజంలో కులాంతర వివాహాలు కూడదు. గోత్రాంతర వివాహాలే ఆచారం. స్వీయ గోత్రంలో ఇచ్చిపుచ్చుకోడాలు నిషిద్ధాలయ్యాక 'గోత్ర' చిహ్న జంతువుల భక్షణ కూడా నిషిద్ధమైంది. అయితే ప్రత్యేకమైన సందర్భాలలో అటువంటి

జంతు వధనే అనుమతించేవారు. కులాలు ఏర్పడ్డాక కులపెద్దల గోత్ర చిహ్న జంతువే జాతికి 'ప్రతీక' అయింది. కులపెద్ద ఆ జంతువుకు ప్రతినిధి. కులాన్ని పాలించవలసిన రాజుని ఆ కులపెద్ద మాత్రమే పుట్టించాలి, అంటే గోత్ర చిహ్నమైన జంతువే పుట్టిస్తున్నదన్నమాట. కులపెద్ద ఒక విధంగా కుల బ్రాహ్మణుడు, పురోహితుడు.

వశిష్టుడు మన వైదిక వాఙ్మయంలో మనకు తెలిసిన ప్రాచీన పురోహితుడు. ఇక్ష్వాకు వంశానికి గురువు. శ్రీరాముని ముత్తాత గారి ముత్తాత గారి తండ్రి కల్మాషపాదుడనే మిత్రసహుడు. ఇతనికి కూడా వశిష్టుడే గురువు కల్మాషపాదుని రాణి పేరు మదయంతి, ఈమె ఋతు సమయంలో రాజాజ్ఞానుసారం వశిష్టుని చేరింది. రాజ పత్ని గర్భవతి కాగానే ముని ఆశ్రమానికి తిరిగి వెళ్లిపోయాడు.[2]

మన భారతదేశంలోని రాచరికాల పుట్టు పూర్వోత్తరాలు పరిశీలిస్తే ఒక విషయం స్పష్టమవుతుంది. అభిషేక సమయంలో పురోహితుడూ రాజా పెళ్లి చేసుకొంటారు. ఇందులో చదివే మంత్రాలను 'రాజ్ఞః పురోహిత వరణ' మంత్రాలంటారు. వీటిలో పురోహితుడు చెప్పే మంత్రాలలో సుబంత శబ్దాలన్నీ పులింగాలు, రాజు చెప్పే శబ్దాలన్నీ స్త్రీ లింగాలు. ఇద్దరు మగవాళ్ళు చేసుకునే పెళ్లి అసహజం. ఆదిలో బ్రహ్మపురోహితుడు, క్షాత్ర వధువును పెళ్లి చేసుకునేవాడు. అందుకే ఆ మంత్రాలలోని సుబంత శబ్దాలు ఆయా లింగాలలో ఉన్నాయి. మాతృస్వామ్యం పోయి పితృసామ్యం వచ్చాక పురోహితుడూ రాజా పౌరోహిత్యానికీ, రాచరికానికి ప్రతినిధులయ్యారు.

మాతృస్వామ్యం ఇటీవలి దాకా కేరళలో సజీవంగానే ఉంది. అక్కడ క్షత్రియ, నాయరు స్త్రీ ముఖ్యులకు నంబూద్రి బ్రాహ్మణుడే సంకేత సంబంధాలు గల వ్యక్తి విత్తనం బ్రాహ్మణమైనా తరావాడ్ పెత్తనం అతనిది కాదు. నంబూద్రి బ్రాహ్మణులలో పెద్ద కొడుకూ, అతని తర్వాత వాడు మాత్రమే బ్రాహ్మణ వధువులను పెళ్లి చేసుకోవచ్చు. మిగతా కొడుకులంతా క్షత్రియ, నాయరు స్త్రీలతో సంబంధ బాంధవ్యమే పెట్టుకోవాలి. దేశంలో ఇవాళ చాలామంది వర్ణాంతర వివాహాలు సంస్కార చిహ్నాలనీ భావిస్తూ ఉంటే నంబూద్రి బ్రహ్మణ యువకులు స్వీయవర్ణంలోని వధువులను సంస్కార వివాహంలో చేసుకొందామని ప్రయత్నిస్తున్నారు. కాలం మారితే ఆచారాలు మారాలి. అది ధర్మం.

అయితే ఆదిలో ఉన్న యుగధర్మం, దాని ప్రకారంకులగురువు – ఏలిక బిడ్డను కనాలి. మదయంతి గర్భవతి కాగానే వశిష్టుడు తన ఆశ్రమానికి వెళ్లిపోయాడు. శాంతకు ఒక బిడ్డను కన్నాక ఆశ్రమానికి తిరిగి వచ్చెయ్యమని నిభాండకుడు ఋష్య శృంగునితో చెప్పారు. సంతానోత్పత్తి ముఖ్యంగాని సంసారం చేయడం ప్రధానాంశం కాదు. ఋశ్యశృంగుడు జాతక కథలో ముమ్మారు సంభోగించాక వానలు పడ్డాయి. ఇది వేదోక్తమైన విధి. ఊర్వశి పురూరవునితో పూర్వం ముమ్మారు సంగతి చెప్పింది.

త్రీః స్మ మాహ్నః శ్నథయోవైతసే నో తస్మ మేవ్యత్యై పృణాసి
పురూరవోను తేకేత మాయం రాజమే వీరతన్వస్త దాసీః [ఋగ్వేదం 10–95–5]

"దినానికి ముమ్మారు నీయంగంతో నన్ను ఇడియగొట్టి ఇష్టపడని గర్భాన్ని కలిగించావు. పురూరవా! నీ కోరికల కొరకే నేను వశమయ్యాను. ఓ వీరుడా! తదుపరి రాజుగా నీవు నా తనువు నుండి వెడలిపోయావు" ఈ ఋక్కు వల్ల గర్భధారణ జరిగాక ఏర్పరుచుకొన్న ' సమయం ' ఒప్పందంలోని సంగతులను బట్టి గర్భదాత తన దారంట వెళ్లిపోవాలి. ఒకప్పుడు బలిపశువుగా వెళ్లాలి.

రాజపత్నులు, అప్సరసలు బ్రాహ్మబీజాలకు క్షేత్రాలుగా ఉండేకాలం వెళ్ళిపోయాక యుగధర్మం మారినా ఆచారాన్ని మార్చడం, వీల్లేక సవరణలు తెచ్చి కొన్ని రూపాంతరాలు ఏర్పాటు చేశారు. రాజపత్ని కాక రాజకుమారి బ్రాహ్మ బీజానికి గోత్ర జంతు ప్రతీక అయిన వ్యక్తితో సంగమించాలన్న సర్దుబాటు ఆచారం వచ్చింది. వారసత్వం స్త్రీల నుండే వస్తూ ఉండేది. ఇది కూడా కారణం. బౌద్ధ జాతక కథల కాలానికే ఈ ప్రత్యామ్నాయం రావడం వల్ల ఋశ్యశృంగుని కథలలో మనం చెప్పుకొన్న మొదటి కథలోనూ మూడవ కథలోనూ రాజకుమారి మునికుమారుని చెడగొట్టడానికి స్వయంగా వెళ్లింది.

దేశంలో రాచరికం వేళ్లూని రాజపత్నిలాగే రాజకుమారి కూడా ఉన్నత స్థానంలోనే ఉండవలసిన మర్యాద వచ్చాక ఆమె స్వయంగా వెళ్లి బ్రహ్మచర్యం పాటిస్తున్న తపస్విని చెడగొట్టడం ఔచిత్యవంతం కాదనిపించింది. అందుకు వారకాంతలు వీలుగాదొరికారు. వారకాంతలకు వావివరసలు లేవు. వాళ్లు ఏది చేసినా చెల్లుతుంది. అందుచేత రాజసభలోని వాళ్లు వారవనితలనే పురమాయించాలని నిశ్చయించారు. వాల్మీకి రామాయణం బాలకాండ తొమ్మిదో సర్గలో రోమపాదునికి పురోహిత, అమాత్యులు అపాయం లేని ఉపాయంగా వేశ్యలచేత ఋశ్యశృంగుని రప్పిస్తే ఆ తర్వాత శాంతనిచ్చి పెళ్లి చేస్తే ఏ దోషమూ లేదన్నారు. [1–9–15]

రామాయణంలోని ఈ ఘట్టాన్ని అనువదించి వ్యాఖ్యానించిన వావిలకొలను సుబ్బారావుగారు మందరంలో ఋశ్యశృంగుని రప్పించడానికి లోమపాదుడు ఆలోచిస్తున్న సందర్భంలో ఇలా రాశారు.

"అస్ఖలిత బ్రహ్మ చర్యమున నుండిన మహావీర్యవంతు డతని నెట్లు రప్పించ సాధ్యపడును? ఆయన కాముడా? కాదు స్త్రీలన యెట్టి వారో యెరుగడు విషయ విచారణమూ లేదు. ఆయన చేయదగిన యోగ్యకార్యమాయిది కాదు. ఏమని పిలుతును అని యోచించి మంత్రుల రప్పించి వారితో నాలోచించి భృత్యపురోహితా మాత్యులను బంపెదను. అనిన వారు ఋశ్యశృంగుడిచ్చటకు వచ్చు నుపాయము చెప్పెదము వేశ్యలను బంపెదవేని వారాయనను దోడుకొని వత్తురు. వేశ్యలకు ఋషులను వశపరచుకొనుటే వృత్తి కావున వారికి వృత్తి భంగముకాదు. వీరాయనతో క్రీడింపబోరు కావున ఋశ్యశృంగునకు వేశ్యా సాంగత్య దోషము లేదు. నీవు నీ పుత్రిక నాతనికిచ్చి వివాహము చేయ సాధుభావముతో బంపించిన వాడనగుట నీపై ముని యలుగడు. ఆయన వచ్చుటచే వాన గురియును. కావున మనోహర వేషలైన వారయోషలను బంపుము"[3]

మన సనాతనుల ఆలోచనా సరళి చాలా విలక్షణమైనది. కర్ర విరక్కుండా,

పాముచావకుండా కార్యం జరిగిపోవాలి. ప్రాచీనకులాచారాలను విసర్జించకూడదు. వాటిని పాటిస్తూనే సామాజిక వ్యవస్థలో ఉన్నత వర్గాలలో ఉన్నవారి గౌరవ, మర్యాదలకు భంగం రానివ్వకూడదు. వాళ్ళకు ఎటువంటి కళంకం రాకూడదు. దోషం అంటగట్టకూడదు... అన్నీ అమర్చిపెడితే అనుభవించడానికి అలవాటుపడ్డ ప్రాణులు. న్యూనత వాటిల్లే ఆచారాలను తమ తరపున ఇంకొకరు పాటించాలి. అందువల్ల దోషమంటని కులమొకటి అవసరమొచ్చింది. అదే వేశ్యాకులం.

## అథోజ్ఞాపికలు

[1] జార్జి థాంప్సన్ తన ప్రాచీన గ్రీకు సమాజ అధ్యయనాంలో 'విగోత్ర వివాహాలు' [ఎగ్జోగమీ]ల ప్రాథమిక ఉద్దేశం ఆహార పదార్థాల సరఫరాను చెలామణిలోనికి తీసుకురావడమే అన్న సంగతి స్పష్టం చేశారు. STUDIES IN ANCIENT GREEK SOCIETY VOL I. - P.44.

[2] [వ్యాస మహాభారతం, ఆదిపర్వం 1765 అధ్యాయంలో 44,45,46,శ్లొకాలు]. మన పౌరాణిక కథాకల్పనాదకులు కల్మాషపాదుడు శాపగ్రస్తుడు కాబట్టే నియోగానికి అనుమతించాడు. అని సరిపెట్టారు.

[3] మందరం - బాలకాండ పుట 444 నుండి

# వేశ్యలు - వివిధ రీతులు

ప్రపంచంలోగల వృత్తులన్నింటిలో అత్యంత ప్రాచీనమైన వృత్తి ఏదంటే వేశ్యావృత్తి ఒక్కటే అన్న సమాధానం చెప్పేవాళ్లు వున్నారు. ఎవరైనా ఏదైనా వృత్తిని చేపట్టడానికి కారణం అది బతుకు తెరువు చూపెడు తుందనే. ఒకరు ఒక వ్యాపారాన్ని సాగిస్తున్నారంటే తాము అమ్మే సరుకు కావాలనుకొన్న వారు ఉండబట్టే. స్త్రీలు తమ శరీరాన్ని అమ్ముకుని బతకవలసిన చారిత్రక పరిస్థితులు ఏ దేశంలోనైనా రాచరికం కట్టుబాట్లు గట్టి పడ్డాకనే తలెత్తుతాయి. ఆదిమ గణ జీవితంలో అందరూ పాటుపడే వాళ్ళే. అందరూ సుఖపడేవాళ్ళే. అందరూ సమానులే ఆస్ట్రేలియాలో ఇప్పటికీ కొన్ని తెగల ఆదివాసులున్నారు. వాళ్ళకు ఒక నాయకుడంటూ ఎవరూ లేడు. అందుచేత ఆ గణ జీవితంలో దేవతలంటూ కూడా ఎవరూ ఏర్పడలేదు. వేశ్యలనే జాతీ, వ్యభిచారమనే అలవాటూ ఉమ్మడి సమాజ జీవనంలో తలెత్తవలసిన అవసరమే లేదు.

వేదకాలంలో వేశ్యలంటూ ఒక ప్రత్యేక కులం ఉన్న దాఖలాలు ఏమీ కనబడవు. ఉత్తరోత్తరా సామాజిక సిద్ధాంతాలూ, రాచరికాలు ముదిరాక సింధుజనుల నాగరికతలోని అప్సరసలనే దేవవేశ్యలుగా జమకట్టుకొనడం జరిగింది. ఋగ్వేదంలో రెండుచోట్ల (iv - 26 - 3, iv - 61 - 14) 'వేశ్య' శబ్దం ప్రయుక్త మైంది. ఈ రెండు సందర్భాలలో ఈ పదం 'ప్రవేశించదగ్గది,' 'పొరుగు చోటు' అన్న భావాన్నే స్ఫురింపచేస్తుంది. ఇతరులపై ఆధారపడే ప్రదేశం కనుక వేశ్య శబ్దానికి పడుపు కొంప అనే అర్థం తర్వాత వచ్చింది. ప్రాచీన భారతీయ నిఘంటువులలో ఇటు వంటి అర్థం కనబడుతున్నా, ప్రామాణిక ప్రయోగాలు మృగ్యమని మోనియర్ విలియమ్సు తన బృహన్నిఘంటువులో చెప్పాడు. వరాహమిహిర బృహత్సంహితలో 'వేశ్యాకామినీ' అనే ప్రయోగం ఉంది. మహాభారతంలో వేశ్యాస్త్రీ (భోగము పడుచు) ప్రయోగం పలుచోట్ల ఉంది. ఇతిహాస యుగం నుండి వేశ్య అంటే వెలయాలు అనే అర్థం రూఢిగా కనబడుతుంది.

మహాభారతం ఒక కలగూరగంప లాంటిది. అందులోని వివిధ పాత్రలు విభిన్న గణధర్మాలకు చెందినవారు. కర్ణుడు తన తల్లికి పెళ్ళికాకుండా పుట్టినవాడు. (కానీనుడు). ఇటువంటి వాడు శల్యుణ్ణి వావి వరుసలు లేని మద్రకుల గణానికి చెందినవాడవని దూషించాడు. శల్యునిది పాపదేశమన్నాడు. ఆదేశంలోని ఆచార వ్యవహారాలను పూసగుచ్చినట్టు వివరించాడు. (చూ॥ సంస్కృత మహాభారతం–కర్ణపర్వం అధ్యాయాలు.152–6). ఆంధ్ర మహాభారతంలో తిక్కనగారు టూకీగా తెనిగించారు. శల్యుని వంటివారు "పలువురకు బుట్టి నిచ్చలు కలుద్రావుచు చెరిగి యెట్లు గరతురు శీలంబులు?"అని కర్ణుడు అడిగాడు. (ఆంధ్ర మహాభారతం – కర్ణ – 2–48).

ఒక స్త్రీకి ఎందరైనా భర్తలుండవచ్చు. అది ఒకనాడు తప్పుకాదు. జతకట్టడానికి అసలు పెళ్ళి అనే తంతు అక్కర్లేని రోజులు కూడా ఉండేవి. ఏ సమాజంలోనైనా స్త్రీపురుష సంబంధాలు, ఆర్థిక జీవన విధానాలపై ఆధారపడి ఉంటాయి. ఒక్క

వనితకు పెక్కుమంది భర్తలన్న వ్యవస్థ మహాభారత కాలంలోనే కాదు, ఇప్పటికీ ఆర్థిక కారణాల వల్ల ఉంది. నేటి హిమాచల ప్రదేశ్‌లో వివిధ కులాలలో ఈ బహుభర్తల విధానం అన్ని కులాలలోనూ కలబడుతుంది.[1]

| కులం | పలువురు భర్తలు గల స్త్రీల సంఖ్య | | | | వెరశి |
|---|---|---|---|---|---|
| | ఇద్దరు భర్తలు | ముగ్గురు భర్తలు | నలుగురు భర్తలు | అయిదుగురు భర్తలు | |
| బ్రాహ్మణులు | 76 | 7 | – | – | 103 |
| కోలీ | 176 | 48 | 16 | 7 | 247 |
| బాడ్ (బౌద్ధ కానెట్) | 7 | – | 2 | 2 | 11 |
| కానెట్ | 521 | 173 | 68 | 42 | 804 |
| లోహార్ | 29 | 1 | – | – | 30 |
| రాజపుట్ | 13 | – | – | – | 13 |
| తర్ఖాన్ | 23 | 9 | – | – | 12 |
| మొత్తం | 865 | 237 | 86 | 51 | 1240 |

హిమాచలప్రదేశ్ ప్రభుత్వంలో వరుసగా ముఖ్యమంత్రి పదవిని చేపట్టిన వై.యస్. పర్మార్ రాసిన 'పాలియాంండ్రి ఇన్ ది హిమాలయాస్ 'అనే గ్రంథంలో స్టేట్ గెజటీరు నుండి కొన్ని వివరాలను ఇచ్చారు.

పై పట్టిక వల్ల ఎక్కువ మంది స్త్రీలకు ఇద్దరే భర్తలున్నట్టు కనబడుతుంది. ఒక కుటుంబంలో ఎందరన్నదమ్ములుంటే అందరూ భర్తలవడానికి అవకాశాలు ఉండటం చేత పరిమిత సంఖ్యలోనే భర్తలుంటారు. సాధారణంగా ఒక కుటుంబంలో అయిదుగురు కన్న ఎక్కువమంది ఏకోదర భ్రాతలు ఉండరు. ఈ అయిదు సంఖ్యను శాస్త్రకారులు అంగీకరించారు.

వాత్స్యాయనుడు తన కామ సూత్రాలలో "దృష్ట పంచపురుషానా అగమ్యా కాచిదస్తీతి బాభ్రవీయాః"అని బాభ్రవ్య మతాన్ని చెప్పాడు. (1–5–33)బాభ్రవ్యుడనే కామసూత్రకర్త మతం ప్రకారం స్త్రీ సాధారణంగా అయిదుగురు వరకు భర్తలను వరించవచ్చు. అలా వరించిన స్త్రీని అగమ్యురాలుగా (అంటే సంభోగ యోగ్యాధికారం లేనిదానిగా) భావించాలి. ఆమె జోలికి కామవాంఛతో పోరాదు. భర్తల సంఖ్య అయిదును మించితే ఆమె గమ్యురాలు అవుతుంది. అయిదుగురు భర్తలున్న స్త్రీని బంధకి అంటారు. నలుగురు భర్తలున్న సతిని స్వైరిణి అంటారు. ఒక భర్తను విడిచి ఇంకొకర్ణి చేపట్టే స్త్రీని పునర్భువు అంటారు. దీనినే మనం మారు మనువు అంటాం. రాయలసీమలో ఇప్పటికి ద్రౌపదికి గుళ్ళూ, పూజలూ ఉన్నాయి. కొన్ని

వెనుకబడిన తెగలలో మారు మనువులు సహజం. వరుసగా నలుగురు భర్తలకు 'విడాకు' లిచ్చి అయిదవ భర్తను చేసుకొన్న స్త్రీని 'పెదగౌడసాని' అంటారు. ఆ తెగలో వారికి గౌడసాని మాటంటే వేదవాక్యం.[2]

పాండవులందరికీ ద్రౌపది ఉమ్మడి భార్యగా ఉన్నా ఆ అన్నదమ్ముల్లో ఒక్కొక్కరికీ ఒకరో పలువురో సొంత భార్యలు కూడా విడివిడిగా ఉన్నారు. అన్నదమ్ములలో పెద్ద వాడే ముందు పెళ్ళి చేసుకోవాలన్న నియమం లేదు. భీముడు అందరికన్నా ముందుగా హిడింబితో సమయసంబంధం పెట్టకొని ఒక బిడ్డను కన్నాడు. బిడ్డ తల్లి దగ్గరే పెరుగుతాడు. బిడ్డపుట్టాక ఇటువంటి పెళ్ళిలోని స్త్రీపురుషులు తమతమ దారులంట. పోవచ్చు. అర్జునుడు కూడా తీర్థయాత్రలకు వెళుతూ ఉలూచినీ చిత్రాంగదనూ సమయసంబంధ భార్యలుగా చేసుకొని బిడ్డలు కన్నాక తనదారిన తాను పోయాడు. ఒక్క సుభద్రను మేనరికంగా ఎత్తుకొచ్చి కాపురం చేశాడు. ధర్మరాజుకు ద్రౌపది కాక ఇద్దరు భార్యలున్నారు. ఇందులో ఒకతె స్వయంవరలబ్ధ. భీమునికి కూడా ఇతర భార్యలు ఇద్దరున్నారు. నకులసహదేవులు ఇద్దరికీ చెరొక సొంత భార్య చొప్పున ఉన్నారు. ఈ స్త్రీలు స్వయంవరలబ్ధలు.

మహాభారతకాలంలో వివాహ వ్యవస్థ భారతదేశమంతటా ఒక్కలాగే లేదు. ఒక కుటుంబ వ్యక్తులకు ఒకే రకమైన పద్ధతిలేదు. కొన్ని గుణాలలో అసలు పెళ్ళంటూ లేదు. ధర్మరాజు రాజసూయం చేయడానికి ముందు అతని సోదరులు దిగ్విజయాలు చేశారు. అర్జునుడు, నకులుడు వేరువేరు దిక్కులను జయించారు. దిక్కులు వేరయినా ఒక రకమైన ఆచార ఐక్యత కనబడుతుంది. ఈ పాండవులిద్దరూ తమ దిగ్విజయ యాత్రలో ఉత్సవ సంకేతగణాలను జయించినట్టు సభాపర్వం చెప్తుంది. ఈ గణాలు ఆనాడు వివాహ వ్యవస్థ నికరమైన రూపు తీసుకోలేదని సాక్షమిస్తాయి. 'ఉత్సవ సంకేత'మనే పద బంధానికి నీలకంఠ వ్యాఖ్య వివరణాత్మకమైన అర్థం చెప్పింది.

"ఉత్సవ సంకేత గణాలలో స్త్రీపురుషుల మధ్య పరస్పరాకర్షణ కామసంబంధానికి తగినంత కారణంగా భావించేవారు. పెళ్ళి చేసుకొనడమన్నది వారి సంఘంలో లేనే లేదు. జంతువుల్లలో లాగే వీరిలో సంభోగ సంబంధాలలో విచక్షణ పట్టింపు కనబడవు."

ఉత్సవ మంటే పండుగ, జాతర. సంకేతమంటే సంబంధం, నిమిత్తం, కలయిక. ఉత్సవ సంకేత గణంలోని స్త్రీపురుషులు పండుగనాడు వావివరుసలు పట్టింపులు లేక కామక్రీడలలో కలుసుకొనే వారన్నమాట. ఋగ్వేద సమాజంలో కూడా పండు గలుండేవి. వాటిలో పురుషులను కలుసుకొనడానికి అన్నిరకాల వయస్సులు గల స్త్రీలు అలంకరించుకొని వెళ్ళేవారు. ఋగ్వేదంలోని ఉత్సవ ప్రదేశాన్ని'సమన'అనేవారు. చలికాలంలో ఆరుబయట తెల్లవారు ఝామునుంచీ అనగా ఉషోదయకాలంనుంచీ సమన సమావేశాలు ప్రారంభమవుతూ ఉండేవి. ఉషోదేవత ఈ పండుగను విరచిస్తుందని ఋగ్వేదంలోని ఒక ఋక్కు చెప్తుంది. [వియానృజతి సమనం-I-48-6]. తెలుగు దేశంలోని భోగి మంటలలాగ ఋగ్వేదకాలంలో చలిమంటలు కూడా ఉండేవి. సమన సంబరం ఆ నెగళ్ళతోనే ఆరంభమయ్యేది. కవులు గీతాలు పాడి కీర్తిని పొందేవారు. ఒకచోట ధనుర్విద్యా ప్రదర్శన జరిగేది. మరొక పక్క గుర్రాల పరుగు పందాలు నడిపేవారు. పెళ్ళికాని ఆడపిల్లలు తగిన జతగాళ్ళకోసం గాలించి కలుసుకొనేవారు. సమన సమావేశాలు కేవలం వినోద విహారాలకేగాని యజ్ఞకర్మలకోసం ఉద్దేశించినవి కావు. చాలామంది పాశ్చాత్య పండితులు ఈ పండుగలు వేశ్యలు పాల్గొనేవారని భావించారు. అయితే భారతీయ పరిశోధకులు సమన సమావేశాలలో వెలకాంతలు లేరని అభిప్రాయ పడుతున్నారు. అపరిచిత వ్యక్తుల పరిచయాన్ని యువతులు ఈ

పండుగలలో అభిలషించినంత మాత్రాన వాళ్ళు వేశ్యలనుకోనక్కరలేదు. ఋగ్వేదం పదవ మండలం నాటికి ఇంద్రునికి ఇంద్రాణి అనే భార్య వచ్చింది. సమన సమావేశాలు కడు ప్రాచీన ఆచారాలయ్యాయి.

భారతదేశంలో వివాహ వ్యవస్థను ఒక దారికి తీసుకువచ్చి కట్టుదిట్టం చేసినవాడు శ్వేతకేతువు అనే పేరుగల ఋషి అని ఇతిహాసాలు చెప్తాయి. ఇతడు ఉద్దాలకుడనే మహాముని కుమారుడు. ఇతనికి ఊహ తెలుస్తున్న వయస్సులో ఒక సంఘటన జరిగింది. శ్వేతకేతు తల్లి ఋతుమతి అయిన సందర్భంలో ఒక వృద్ధ విప్రుడు అతిథిగా వచ్చి పుత్రార్థం ఆమెను కామించి ఆమెతో గమనాభిలాషను వ్యక్తం చేశాడు. ఆమె అంగీకరించింది. ఇది చూసి శ్వేతకేతువు హృదయం గాయపడింది. తండ్రితో చెప్పాడు. ఆయన 'ఆ విప్రుడూ, మీ తల్లీ పూర్వాచారాన్నే పాటిస్తున్నారు.' అని సర్ది చెప్పాడు. శ్వేతకేతు ఆగ్రహించాడు. పూర్వాచారాన్ని మార్చాలని నిశ్చయించుకొన్నాడు. సనాతన ధర్మానికి ఎదురు తిరిగాడు. సనాతన ధర్మం ఏమిటంటే –

"పక్వాన్నమివ రాజేంద్ర సర్వసాధారణా స్త్రియః
తస్మాత్తాసు నకుప్యేత వరజ్యేత, రమేఏవ"

"ఓ రాజేంద్రా ! పక్వాన్నమెలా వారిదీ వీరిదీ అనే భేదము లేక సర్వసాధారణమైనదో (అంటే అందరికీ అనుభవించ అర్హమై ఎలా ఉందో) అలాగే స్త్రీలు సర్వసాధారణలు కనుక పురుషులు వారి విషయమున నేరాన్ని ఆరోపించి కోపించకూడదు; విముఖులూ కాకూడదు. వారిని రమించవలసినదే !"

శ్వేతకేతు ఈ ధర్మం మీద తిరుగుబాటు చేశాడు. సంస్కారాలు ప్రవేశపెట్టి ఒక వ్యవస్థకు ఏర్పాటు చేశాడు.

"ఇది మొదలుకొని ఔద్దాలికి యగు శ్వేతకేతు ఋషి యొక్క సమయమును అనుసరించి, లోకులు మద్యపానము నుండీ, అధమ వర్ణము వారు ఉత్తమ వర్ణులగు బ్రాహ్మణులూ, గురువులూ మున్నగువారి కన్యలను వివాహ మాడునట్టి ఆచారము నుండీ, పరస్త్రీగమనము నుండీ లోకులకు నివృత్తి కలుగుకాక." శ్వేతకేతు సంఘంలో గమ్యాగమ్య వ్యవస్థను ఏర్పరిచాడు. అంటే ఎవరితో రమించవచ్చో, ఎవరితో కూడదో నిర్ణయించాడు. శ్వేతకేతు కేవలం వ్యవస్థను ఏర్పరచడమేగాక అయిదువందల అధ్యాయాల కామశాస్త్రాన్ని కూడా రచించాడు.

శ్వేతకేతు తర్వాత ఏడు అధికరణాలతో, నూటయాభై అధ్యాయాలలో బాభ్రవ్యుడనే పాంచాల దేశీయుడు ఇంకో కామశాస్త్రాన్ని రచించాడు. ఇందులో ఆరో అధికరణం పేరు వైశికాధికరణం. అంటే ఇది వేశ్యలకు సంబంధించిన అధ్యాయం. శాస్త్ర గ్రంథాలలో ఈ బాభ్రవ్యకృతే మొట్టమొదటి సారిగా వేశ్యల విషయంలో ప్రామాణికమన్నమాట.

బాభ్రవ్యుని పిమ్మట దత్తకాచార్యుడనే వేత్త కేవలం వైశికాధికారణాన్ని పృథక్కరించాడు. పాటలీపుత్ర నగరంలోని వేశ్యల అభ్యర్థన మీద దత్తకాచార్యుడు ఈ గ్రంథాన్ని రచించాడట.

తన కాలందాకా ఎవరెవరు ఏయే కామశాస్త్రాలను రచించారో వాటన్నింటినీ కూలంకషంగా మథించి, సారం గ్రహించి వాత్స్యాయనుడు కామసూత్రాలను చెప్పాడు. ఇతని గ్రంథంలో వైశికాధికరణం కూడా ఉంది. దీనిలో ఆరు అధ్యాయాలున్నాయి. వేశ్యల జీవిత విధానం గురించి ఎన్నో వివరాలున్నాయి. ఎన్నిరకాలుగా ద్రవ్యాకర్షణ

చేయాలో వృత్తి ధర్మంలో ఎవరెవరి సహాయం పొందాలో, ఆర్జించిన ద్రవ్యాన్ని ఏంచేయాలో అన్నీ వివరించాడు.

పక్వాన్నం లాంటి భామలు అందరికీ సాధారణలు రాదనే సంఘంలో అందరికీ సాధారణలుగా లభించే కులం ఒకటి అవసరమైంది. వేశ్యలకు వివాహ నియమం లేదు. వైధవ్యం లేదు. ఆమెకు సెక్సు స్వేచ్ఛ పూర్తిగా ఉంది. 'వేశే భవా వేశ్యా' అని వేశ్య శబ్దానికి వ్యుత్పత్తి చెప్తారు. వేశ మందు పుట్టినది వేశ్య అవుతుంది. వేశమనే మాటకు అర్థాలు చాలా ఉన్నాయి. 1.ప్రదేశము, చొచ్చుట, 2.మార్గం, 3.గృహము, ఇల్లు, 4.వేశ్యాగృహం, 5. వేషం 6.వస్త్రభూషణాదులచే రూపాంతరం చెందే మారువేషం, 7.కూలీ జీతం. ఈ అర్థాలలో చివరిదైన ఆర్థిక కారణమే ఎక్కువ నప్పుతుంది. వేశ్యలను వెలయాండ్రని కూడా అంటారు కదా. వేశ్యను సంస్కృతంలో పణ్యాంగన అంటారు.

వేశ్య అనే మాటకు ఇకో వ్యుత్పత్తి కూడా చెప్తారు. 'వేశేనైపథ్యం తేన శోభతే వేశ్యా' అంటే అలంకారములచేత ప్రకాశించేది వేశ్య అని అర్థం. అయినా కామసూత్రాల ప్రకారం 'అర్థశ్చరాజ్ఞః [1-2-15], వేశ్యాశ్చఇతి [1-2-17]'అని శాస్త్రం కనుక పురుషార్థాలలో తక్కిన వాటి కంటె రాజులకు అర్థమేశ్రేష్టమైనది, అలాగే వేశ్యా స్త్రీలకు కూడా అర్థమే ముఖ్యం. అందుచేత 'వేశము వల్ల వచ్చేది.'[అనగా కూలికి వచ్చేది]వేశ్య అన్న వ్యుత్పత్తే సామాజిక శాస్త్రరీత్యా నప్పుతుంది.

కడుపునిండ తవుడు గంపలో పెట్టక
చన్నుముట్టనీదు కొన్న బర్రె
వారకాంత విటుని వలచునా యూరక
విశ్వదాభిరామ వినురవేమ.

సంఘంలోని ఏయే స్త్రీలకు వేశవృత్తి విధించారో వాత్స్యాయనుడు వివరించాడు. లోకంలో నీచపు పనులు [అంటే దాస్యమునకు చెందిన నీచ కార్యాలు] చేసే ఒక తెగ దాసీలను కుంభదాసీలంటారు. 1.కుంభదాసీలు, 2.పరిచారికలు, 3.కులటలు, 4.స్వైరిణీ స్త్రీలు, 5.నటాంగనలు, 6.శిల్పకారికలు, 7.ప్రకాశవినష్టములగు స్త్రీలు 8.రూపాజీవలు, 9.గణికలు అనే ఈ జాతుల వారు వేశ్యలలో చేర్చవలసిన వారు[6-6-57].

వేశ్యలలో ఇన్ని రీతుల వారిని పేర్కొన్నా ముఖ్యంగా మూడు రకాల వారినే ప్రధానంగా గుర్తించారు. వాళ్ళు కుంభదాసీలు, రూపాజీవలు, గణికలు. ఈ వర్గీకరణలో వీరిని అడుగు, నడిమి, పైస్థాయిల క్రమంలో చెప్పారు. ఒక్కొక్క వర్గం వారిలో మళ్ళీ ఉత్తమ, మధ్య, అధమలూ ఉంటారు. కుంభదాసీలు కేవలం తొత్తులు. కుంభం అంటే ఊడిగం. కుంభవృత్తిలో జీవించే దానిని కుంభదాసి అంటారు. రూపాజీవకు రూపమే 'ఆజీవము'[అనగా వృత్తి]. కాబట్టి వారిని రూపాజీవ అన్నారు. ఈ వర్గం వారికి కళలంత ముఖ్యం కాదు.

రూపాజీవలూ, గణికలూ సర్వాంగాలలో ఒప్పులుకులికే ఆభరణాలు ధరించాలి. తెల్ల చీరలే కట్టుకోవాలి. సుగంధ ద్రవ్యాలు అంటే ఏలకులు, లవంగాలు, జాజికాయ, జాపత్రి, మొదలైనవి వేసిన తాంబూలం వేసుకోవాలి. ఇల్లు చూస్తే ముద్దొచ్చేటట్టు ఇమ్ముగా అలంకరించుకోవాలి. కుంభదాసీలు కొలదిపాటి బంగారం తాపడం చేసిన నగలు పెట్టుకోవచ్చు. గణికలు తమ ఖర్చు వెచ్చాలను ఒక్క విటుడే భరించగలిగితే అతనితోనే ఏకచారిణిగా జీవించవచ్చు. అయితే ఎన్నివిధాల అతని నుంచి డబ్బు లాగాలో

అన్ని విధాలా లాగి తీరాలి. ప్రతి వేశ్యకూ ఎటువంటిదైనా ఒక తల్లి ఉండటం ముఖ్యం.

"వేశ" మన్న శబ్దానికి ఇల్లు, అందులోనూ పడుపు కొంప అన్న అర్థం వచ్చాక వేశ్యల ఇల్లున్న వాడను వేశ్యావాటిక అని పిలిచేవారు. వేశ్యను 'వాటీ వధూని' అనేవారు. తెలుగులో వెలయాలును వాడవదిన అంటారు. ఒకే వృత్తిగలవారు ఒకే కులం వాళ్ళు ఒక వాడలోనే ఇళ్ళు కట్టుకుంటారు. వాడను సంస్కృతంలో 'వాటి, వాటిక' అంటారు. వేశ్యా వాటికల లాగే వనవాటిక ఆశ్రమ వాటిక మొదలైన పదబంధాలు ఎన్నో ఉన్నాయి. అంతఃపుర స్త్రీలతోటను ఉద్యానవన మంటారు. మంత్రుల తోటను ఉపవాటిక, వృక్షవాటిక అంటారు. మనోజ్ఞవనాన్ని కామారణ్యం అంటారు. వేశ్యాగృహారామాన్ని కూడా మంత్రులతోట లాగే ఉప వాటిక, వృక్షవాటిక అని పిలవడంలో కొంత సంప్రదాయం ఉన్నట్టుతోచక మానదు. తన వృక్షవాటికలో వేశ్యా మధుపానం చేయడం కద్దు. క్రీ.శ. 2 వ శతాబ్దిలో కుషానులనాటి అనాటి శిల్పాలు దాఖలా (చిత్రం 16)

ఇంకా కొంచెం లోతుకు వెళ్తే పెళ్ళిళ్ళలో నవధాన్యాలు వేసి మొలిపించటానికి ఆధారమైన పాత్రను కూడా వాటిక అనే పిలిచేవారు. ప్రస్తుతం పాలిక అని దానిని పేర్కొంటున్నారు. మాటల అంతరార్థాలు మన సంస్కృతి చరిత్రను చెబుతాయి. మౌర్య సామ్రాజ్య యుగంలోనూ, సాతవాహన సామ్రాజ్యయుగంలోనూ, నాగరికుల సంస్కృతిలో వేశ్యలకు చాలా ప్రముఖ స్థానం ఉంది. కౌటిల్యుని అర్థ శాస్త్రంలో ప్రత్యేకం ఒక అధ్యాయాన్నే గణికల విధుల గురించి, కేటాయించారు. [దీనిని గురించి తరువాత ప్రకరణంలో తెలుసుకొందాం] వేశ్యలందరూ ఎన్నో విధాలుగా ద్రవ్యాకర్షణ చేసి ఎనలేని సంపదను కూడబెడతారు. ఈ ఐశ్వర్యాన్ని పోయేటప్పుడు ఏం చేసుకుంటారు? ఎవరికిస్తారు? వాత్స్యాయనుడు వేశ్యల ప్రకృష్టలాభాన్ని అందులోనూ, ఉత్తమ గణికల లాభాతిశయాన్ని ఎలా వినియోగం చేయాలో చెప్పాడు.

"ఉత్తమ గణికలు తా మార్జించిన లాభాతిశయాన్ని ఖర్చుచేసి ఆ ఖర్చుతో దేవ కులములు, తటాకములు, ఆరామములు కట్టించటానికి ప్రయత్నించాలి. దేవకులములు అంటే దేవాలయాలు. తటాకములు అంటే కొలనులు, పుష్కరిణులు. ఆరామములు అంటే ధర్మార్థం వేయించే తోటలు, గణికలు తమ సొమ్ముతో స్థలములు నిర్మింప చేయాలి. స్థలములు అంటే ఏటిమీద, కాలువల మీద, రాకపోకలకు అనువుగా వంతెనలు కట్టించటం. ఊరి వెలుపల ఇళ్ళను కట్టించటం. ఊరి వెలుపల మట్టి ఇళ్ళను కట్టించి వాటిలో ధాన్యపు గోదాలు, రస గంధ రతనాదులు నింపి అగ్ని చైత్యాలుగా అంకితం చేయటం కూడా ఉత్తమ గణికల ద్రవ్యం సద్వినియోగం చేయటమవుతుంది. వేల కొలది ఆవులను బ్రాహ్మణులకు దానం చేయాలి. వేశ్యాధనాన్ని బ్రాహ్మణోత్తములు ఆమె చేతి మీదుగా పుచ్చుకొనరు కాబట్టి ఇతరుల ద్వారా ఇప్పించాలి. వివిధ దేవతలకు నైవేద్య దీపారాధన లాంటి పూజాకార్యాల నిమిత్తం దానం ఇవ్వాలి. ఇట్టి సత్కార్యాలు విరివిగా చేసేవారే ఉత్తమ గణికలు. ఒకటి రెండు పాళ్ళు తక్కువ వాళ్ళు క్రమంగా మధ్యమ, అధమ గణికలవుతారు. అంటే వచ్చిన డబ్బును పూర్తిగా దాన ధర్మకార్యాలకు వెచ్చించే వారు ఉత్తమ గణికలు. సగం వెచ్చించేవారు మధ్యములు, నాలుగోవంతు వెచ్చించేవారు అధమగణికలు" [6–5–25].

గణికలు ఏ తరగతి వారయినా వారి ఆర్జనం పూర్తిగా గాని, కొంతగాని సంఘానికే దక్కుతుంది. ఆదిలో గణికలు సంఘం కోసమే జీవించేవారు. మాతృస్వామ్య



చిత్రం 16. సురాపాన చేసిన సుందరి

వ్యవస్థలో గణమాతృకే గణిక, కొన్ని గుంపులు గణంగా, కొన్ని గణాలు కుటుంబాలుగా, కొన్ని కుటుంబాలు కులంగా, కొన్ని కులాలు ఊరుగా ఏర్పడ్డప్పుడు కులం దాటి కామ సంబంధం పెట్టుకోరాదన్న నిబంధనే ఏర్పడ్డప్పుడు దానికి అతీతంగా మొత్తం సంఘం క్షేమాన్ని ఆశించి కులాన్ని పాలించే కులపాలిక ఒక కులంనుంచి ఇంకొక కులానికి వెళ్ళివస్తున్నప్పుడు కులట అవుతుంది. అందుకే కులట అనే పదానికి కులం విడిచి పోయేది పతివ్రతయగు భిక్షుకి అనే అర్థాలున్నాయి.

బౌద్ధ వాఙ్మయంలో భిక్షుకికి ప్రముఖ స్థానం ఉంది. అలాగే గణికల ప్రసక్తి ప్రశస్తి కూడా కనిపిస్తాయి. బుద్ధుని కాలంలో వైశాలీనగరం సౌభాగ్యానికి ఆమ్రపాలి లేక అంబాపాలి అనే గణిక కారణభూతురాలని మహావగ్గ పేర్కొంటుంది. అంబాపాలి ఒక రాత్రి నిద్రకు 50 కార్షాపణాలు పుచ్చుకునేదట. తన ఇంటికి విటుణ్ణి రప్పించుకొనటం కన్న వాళ్ళ ఇంటికే వెళ్ళేదట. ఈ సమాచారాన్ని విశ్లేషించటంలో గణ మాతృక లేక గణిక ఒక కులం నుంచి ఇంకో కులానికి పర్యటన చేయటం అని అన్వయిచుకోవాలని ఆధునిక విద్వాంసులు భావిస్తున్నారు.

మన తెలుగు ప్రజల సామాజిక జీవనంలో ప్రాచీన కాలపు ఆచారాలు ఇంకా సజీవంగా ఉన్నాయి. గణమాతృక గణికలా జీవించటం మాతంగి కన్యలలో చూడవచ్చు. మాతంగిని కూడా సగౌరవంగా 'మాత' అని పిలుస్తారు. ఊరి మేలు కోసమే ఆమె జీవిస్తుంది. జాతరలలో, ఆమె స్థానం ప్రత్యేకమైంది. ఆమె అమ్మవారికి ప్రతినిధి. ఆమెలో అమ్మవారిని జనులు చూసుకుంటారు. వివాహం చేసుకోదు. అలాగని సెక్సు సంబంధాల నుంచి దూరంగా ఉండదు. ఆమె ఎప్పుడూ కన్యే!

తెలుగు ప్రజల సామాజిక జీవనంలోలాగే ఇతర భాషా ప్రాంతల్లోకూడా మాతల వంటి వారున్నారు. వీరు కూడా ఊరి జాతరలలో కొలువులలో పూజారిణులే. వీరికి మానవ మాత్రులతో వివాహం జరగదు. సమాజంలో గణికలు ఎక్కువ సంఖ్యలలో ఏర్పడి వాళ్ళలో రమారమి అందరూ ధనికుల విలాసాలకే అంకితమైనప్పుడు దేవకార్యాల కోసం ప్రత్యేకమైన గణికలు అవసరమయ్యారు. సవర్ణుల దేవాలయాలు నిర్మితమయ్యాక అంటరాని కులాల మాతలకు వాట్లల్లో ప్రవేశం లేదు. అందుచేత ఆదిమ ఆచారాలనే పాటించి వానలు కురవటం కోసం, పంటలు సంతానం పెరగటం కోసం, చేసే ఆరాధనలకు ఒక గణం ఏర్పడింది. ఒక్క పక్క రాజదాసీలు ఉంటే మరో పక్క దేవదాసీలు సమిష్టి సంక్షేమం కోసం ఉద్భవించారు.

## అథోజ్ఞాపికలు

[1] వై.యస్. పర్మార్ పాలియాండ్రీ ఇన్ హిమాలయాస్, పుట 82. హిమాచల్‌ప్రదేశ్ ప్రభుత్వంలో వరుసగా ముఖ్యమంత్రి పదవిని చేపట్టిన ఈ గ్రంథకర్త స్టేట్ గెజెటీరు నుండి ఇచ్చిన వివరాలు ఇవి.

[2] తూమాటి దోణప్ప జానపద కళా సంపద పుట:63.

[3] వేదిక్ ఇండెక్స్, సంపుటం 1, పుట 481.

[4] శకుంతలరావుశాస్త్రి ఉమెన్ ఇన్ ది వేదిక్ ఏజ్ పుట 8.

[5] శరద్ పాటిల్ పుట 43.

# సోమసాని - గుడిసాని

దేవదాసీలు గుడి సేవ కోసమే ప్రత్యేకంగా ఏర్పడిన ఒక వర్గం. వీళ్ళు ఒక జాతికి కాని, ఒక కులానికి గాని చెందిన వాళ్ళు కారు. వీరిది సంప్రదాయసిద్ధమైన వృత్తి ఆచారం. తెలుగులో దేవదాసీలను సానులు అని పిలుస్తారు. "సాని "అన్న పదం "స్వామిని" అన్న శబ్దం నుంచి వచ్చింది. సాని అంటే చాలా గౌరవప్రదమైన పిలుపు. ప్రభువు యొక్క భార్యను "సాని" అని మర్యాద పూర్వకంగా పేర్కొంటారు. ఉదాహరణకు దొరసాని. దేవుని భార్య కాబట్టి గణికను సాని అని పిలువడంలో ఆశ్చర్యం లేదు.

అయితే ఈ సంప్రదాయంలో ఒక కన్యను దేవునికి ఇచ్చి ప్రత్యక్షంగా పెళ్ళి చేయరు. గుడి నుంచి తీసుకు వచ్చిన కటారిని పెళ్ళి ఇంట్లో పెట్టి దానికీ, పిల్లకూ పెళ్ళి చేస్తారు. పెళ్ళికూతురి అమ్మమ్మో, ఆతరంలోని నిత్యసుమంగళో పిల్ల మెడలో తాళి కడుతుంది. కటారి కాని, తత్తుల్యమైన ఇతర చిహ్నం ఏదైనా గాని నిజానికి అమ్మవారికి సంకేతం. సానిని దేవతకిచ్చి పెళ్ళి చేస్తారు. దేవిలో ఉన్న శక్తులన్నీ సానికి సంక్రమిస్తాయని విశ్వసిస్తారు. గుడిలో మగ పూజారులెంతమందున్నా సాని నిర్వహించవలసిన విధులు మరెవరూ చేయకూడదు. స్త్రీలు, ముఖ్యంగా నిత్య సుమంగళులే వాటిని చేయాలి. గుళ్ళు కట్టక ముందు నుంచీ కూడా గణం మంచి కోసం, ప్రజోత్పత్తి కోసం, సమష్టి ప్రయోజనాల కోసం స్త్రీలే మంత్ర తతంగాన్ని నడుపుతూ ఉండేవారు.

ఇప్పటికీ తెలుగు జిల్లాల్లో మాతంగి కన్యలు, మాతమ్మలు, మాతలు అమ్మవారి కొలుపులలో మంత్రచర్యలు, జరపడంలో ముఖ్య పాత్రనే వహిస్తారు. ఇది అత్యంత ప్రాచీన కాలాల నుంచి వస్తున్న పద్ధతే. సమాజం వ్యావసాయిక స్థితిని అందుకొనని ముందుకాలాల్లో సంచార జీవనం గడిపే ఆటవిక జాతులందరిలో తల్లి పెత్తనమే ఉంటుంది. వ్యవసాయాన్ని కనిపెట్టినది కూడా స్త్రీలే. నేల తల్లి పండటానికి ఎన్నెన్ని మంత్ర చర్యలు ఆచరించాలో అన్నీ మాతృత్వాధికారం ఉన్న సమాజంలోనే మొదట ఉద్భవించాయి. ఈ తతంగం ఎంత ప్రబలమైనదంటే దీని ప్రభావం పితృస్వామికం ముఖ్య లక్షణమై పశు పోషణ జీవనాధారమై పశు మాంస భక్షణ ఆహార విధానాలలో ప్రధానమైన ఆర్యులు కూడా సప్తసింధు దేశాల ప్రజల ఆచారాలను స్వీకరించి సొంతం చేసుకొనేటంతగా ఉత్పత్తిని పెంచే మంత్ర చర్యల్లో అశ్వమేధ యాగం కూడా ఒకటి, ఆదిలో ఇది అచ్చంగా ఆడపెత్తనం గల సమాజంలో, గణతంత్ర పాలనలో ప్రారంభమైనది. దానిని రాచరికం పెరిగి సార్వభౌమాధిపత్యం దాకా విస్తరించిన మగ పెత్తనపు ఆర్యులు స్వీకరించారు. తమ యజ్ఞ యాగాలలో విలీనం చేసుకున్నారు.

భారతదేశానికి ఆర్యావర్తం అనే పేరున్నా ఆర్యులు తొలి నుంచి ఈ దేశం వాళ్ళు కారు. బయటి నుంచి వచ్చారు. ఆర్యులు భారతదేశంలో ప్రవేశించినది క్రీ.పూ.1500కంటే ముందుకాదని చరిత్ర కారులు భావిస్తున్నారు. సప్తసింధు దేశాలలోనికి వచ్చాకనే ఋగ్వేద రచన జరిగింది. ఆర్యుల గురించి, ఋగ్వేద కాలం గురించి చెప్పుకోవడానికి ఋగ్వేదమే ప్రమాణం. ఇందులోని ఆచార వ్యవహారాలను, నమ్మకాలను, మూఢనమ్మకాలను, ఉత్పత్తి విధానాలను, ఆహార పానీయాది పద్ధతులు మొదలైనవి ఋగ్వేదం అధ్యయనం చేయడం వల్లనే తెలుస్తాయి.

ఆర్యులు భారతదేశానికి రావడానికి రెండు సహస్రాబ్దాలకు ముందే సింధు నాగరికత అత్యున్నత వ్యావసాయిక సంస్కృతిలో మూడు పువ్వులూ, ఆరుకాయలుగా విలసిల్లింది. ఇతర ఖండాలలో నౌకా వ్యాపారాన్ని చేసింది. నగరాలను కట్టుకొంటుంది. ఉత్పత్తి పెంపుదలకు అవసరమైన మంత్ర చర్యలను ఆచరిస్తోంది. ఆర్యులు పశుపాలకులు, వాళ్ళకు నగరాలతో అవసరం లేదు. అందుకే పురాలను నాశనం చేశారు. పంట చేలను పచ్చిక బీళ్ళుగా వాడుకున్నారు. అయితే ఒక మోతాదులో వ్యవసాయాన్ని కూడా అవలంబించక తప్పలేదు. సింధు ప్రజల మంత్ర చర్యలను కూడా తమ జీవిత విధానానికి అనువుగా మలుచుకోవలసివచ్చింది. వ్యావసాయిక మంత్ర చర్యలో క్షేత్రాన్ని సారవంతం చేయడం, బీజాన్ని స్థైర్యం చేయడం అవసరం. భూమాత కడుపు పండడానికి రాష్ట్ర మాత కడుపు కూడా పండాలి. కులపాలిక పురోహితునితో పవిత్ర సంభోగం చేయాలి. దీనిని చూసి దేవతలు సృష్టి కార్యానికి ఉద్యుక్తులవుతారు.

సర్వదేశాలలో ప్రజలు నేలను తల్లిగా, నింగిని తండ్రిగా భావిస్తారు.

ఆర్యులూ అలాగే భూమ్యాకాశాలను జంట దేవతలుగా ఊహించుకున్నారు. పశు పాలకులు కావడం చేత వాళ్ళకు నేల తల్లిని ధేనువులాగా, నింగి శ్రేష్ఠమైన ఆబోతులాగా తోచడం సహజం. ఆర్యులకు పాడియావులూ ఆంబోతులే కాక చక్కని గుర్రాలు కూడా ఉండేవి. బాగా బలిసిన గొర్రెలూ, మేకలూ ఉండేవి. వీటన్నింటినీ మందలుగా పెంచేవారు. పాలు పిండి తీసేవారు. వెన్న, పెరుగు, నెయ్యి, మొదలైన పాలలోని పది వీర్యాలను అనుభవించేవారు. యజ్ఞయాగాదులలో తమ మందలలోని వాటిని కొన్నింటిని పూజించేవారు. సమంత్రకంగా వధించేవారు చక్కగా వండుకుని తృప్తిగా భుజించేవారు.

ఋగ్వేద ఆర్యులు కడుపునిండా తినేవారు. ముక్కు దాకా తాగేవారు. వారు తినే వాటిని, తాగే వాటినీ సమంత్రకంగా సంప్రదాయానుసారం సిద్ధం చేసుకునేవారు. వాటిని అగ్నిలో హోమం చేసి తమ దేవతలకు సమర్పించి తాము సేవించేవారు. గోవును చంపి లోపల ఉన్న మాంసాన్ని కానీ బయట ఉన్న చర్మాన్ని కానీ, దెబ్బతినకుండా చేసేవారు. తరువాత గోమాంసాన్ని వేరు చేసేవారు. గోవును చంపేచోటుకు ప్రత్యేకంగా ఒక పేరు ఉంది. దాన్ని "సూనా"అంటారు. గోవును చంపి వండడంలో పద్ధతులు ఉన్నట్లు గుర్రం విషయంలో కూడా ఉన్నాయి. దీర్ఘతమసుడనే ఋషి 22 ఋక్కులలో అశ్వహననాన్ని పచనాన్ని గానం చేశాడు.[ప్రథమ మండలంలోని 162 వ సూక్తం ]. ఈ మంత్రాలనే ఉత్తరోత్తరా అశ్వమేధ యాగంలో ఋత్విక్కులు చదివేవారు. ఋగ్వేద కాలంలో మాంసాన్ని బాగా ఉడికించి తినేవారు. దాన్ని 'ఉఖా ' అనే కుండలో వండేవారు. భారీ ఎత్తున వ్యవసాయం చేసే కాలంలో ఉత్తరోత్తరా పాడి పంటలకు అవసరమైన గోవులను, రాజరికం వృద్ధి చెందాక గుర్రాలను తినడం తగ్గించేశారు. గొర్రెలనూ, మేకలనూ తినే వారు.

వేద కాలంలో సమష్టి జీవన విధానంలో యాగానుష్ఠానమన్నది చాలా ముఖ్యం.

యజ్ఞాలు అనేక రకాలు. కొన్ని ఒక్క రోజులోనే ముగిస్తారు. రెండు, మూడు, నాలుగు – ఇలా 12 రోజుల దాకా జరిగించేవి కొన్ని ఉంటాయి. సంవత్సరం మొదలు 12 సంవత్సరాల దాకా చేసే యాగాలు కూడా ఉన్నాయి. వీటిని సత్రయాగాలు, దీర్ఘ సత్రాలు అంటారు. వేద కాలంలోని అత్యంత ప్రాచీన యజ్ఞరూపం సత్రమేనని విజ్ఞులు చెప్తారు. సత్రయాగంలోని ప్రముఖమైన మంత్ర చర్యను "మహావ్రతం" అంటారు. మహా వ్రతానికి అర్థం అన్నం, ఆహారం అని శతపథ బ్రాహ్మణం చెబుతుంది [4–6–4–2].సత్రయాగాల మౌలికమైన ఉద్దేశ్యం, ప్రయోజనం ఆహార సముపార్జనమే.

ఆర్యులు చేసే యాగాల్లో ముఖ్యమైన కొన్నింటిలో వాజపేయం, అశ్వమేథం, గోమేథం, నరమేథం, పౌండరీకం, రాజసూయం అనేవి వున్నాయి. వాజపేయంలో వాజము అంటే నెయ్యి, పేయము అంటే తాగదగినది, పానీయం. ఈ యజ్ఞాలన్నీ ఉత్పత్తి పెంపుదల కోసం చేసేవే. వీటిలో యజ్ఞ పశువును వేదోక్తంగా చంపడం, సమంత్రకమైన సంభోగం, సౌభాగ్యదాయకమైన మంత్ర చర్యలూ ఉంటాయి. యజ్ఞాలలో చావు పుట్టుకల సమ్మేళనం కనబడుతుంది.

వైదిక యజ్ఞాలలో పురుష మేథం చాలా ప్రాచీనమైంది. శుక్ల యజుర్వేదం 30 వ అధ్యాయంలో ఈ పురుష మేథం వివరాలన్నీ ఇచ్చారు. ఇందులో బలి ఇవ్వదగిన 184 రకాల వ్యక్తుల పట్టిక కూడా ఇచ్చారు.

బ్రాహ్మణులు, వీరుడు, వైశ్యుడు, శూద్రులు, దొంగ, హంతకుడు, గాయకుడు, నటుడు, జూదగాడు, వేశ్య, గొడ్రాలు, వైణికుడు, వైణవికుడు, [పిల్లన గ్రోవి ఊదే వాడు]. గుడ్డి వాడు, చెవిటి వాడు, బట్టతలవాడు మొదలైన వారిలో కొందరు మనుష్యులతోపాటు చాలా జంతువులను బలి వేసారు. బలిపశువైన పురుషుణ్ణి వెయ్యి గోవులను కానీ, నూరు గుర్రాలను కానీ ఇచ్చి కొంటారు.[1] రాను రాను పురుష మేథంలోని మానవ పశువును కొన వలసిన అవసరం వచ్చింది కానీ ఆదిమ కాలంలో రాష్ట్ర మాతతో సంభోగించే పురోహిత రాజన్యుణ్ణే బలిచ్చేవారు. దీనికి చాలా కారణాలు వున్నాయి.

ఉపనిషత్తులలో ఛాందోగ్యం చాలా ప్రాచీనమైనదే. రాహుల్ సాంకృత్యాయన్ గారి లెక్క ప్రకారం. ఇది క్రీస్తు పూర్వం 700 ప్రాంతాలది. అంటే ఆర్యులు సప్త సింధు దేశాలకు వచ్చిన ఏడెనిమిది వందల సంవత్సరాల తరువాత రూపొందింది. ఈ ఉపనిషత్తులో 3–17–1 నుంచి పురుషమేథ ప్రసక్తి కనబడుతుంది. ఈ యజ్ఞంలో పాల్గొనే వాడికి ఆకలి వేయడం, దాహం వేయడం, ఆనందం లేకపోవడం దీక్షగా చెప్పారు. తినడం, తాగడం, ఆనందించడం ఉపసదస్సు అన్నారు. నవ్వడం, తినడం, మైథునంలో పాల్గొనడం స్తోత్రాలుగా శస్త్రాలుగా చెప్పారు. సృష్టికార్యం చేయడం పూర్తి చేసి ఆ మంత్ర చర్యలో మరణించడమే అవబృథస్నానం అన్నారు. [ఛాందోగ్యం 3–17–4]. ఈ ఉపనిషత్తు రచనా కాలం నాటికి అహింసన్నది కూడా ప్రచారంలోకి వచ్చింది. దానిని దక్షిణలలో కలిపారు. పురుష మేథంలో పునరుత్పాదనం, మరణం కూడా ఉన్నాయని ఈ ఉపనిషత్తు విస్పష్టం చేస్తోంది.

ఛాందోగ్యంలోనూ, బృహదారణ్యకంలోనూ మైథునాన్ని ఒక యజ్ఞ కార్యంగానే పేర్కొన్నారు. [ఛాందోగ్యం 5–9– 1, బృహదారణ్యకం 6–2–13] ప్రతి యజ్ఞంలోనూ అగ్ని, సమిధ, ధూమం, అర్చి, అంగారం, విస్ఫులింగం, ఆహుతి, ఫలితం అనే ఎనిమిది విషయాలు ఉంటాయి. రతి కార్యం అనే యజ్ఞంలో ఇవి ఇలా ఉంటాయి.

| | | |
|---|---|---|
| అగ్ని | – | స్త్రీ |
| సమిధ | – | ఉపస్థ |
| ధూమం | – | రోమాలు |
| అర్చి [దీప్తి] | – | యోని |
| అంగారం [చంద్ర నిప్పు] | – | అంతర్భాగ ప్రవేశం |
| విస్ఫులింగం [జ్వాల] | – | మైథునానందం |
| ఆహుతి | – | వీర్యం |
| ఫలితం | – | గర్భం |

పంచాగ్నులు [దక్షిణాగ్నీ గార్హపత్యం, ఆహవనీయం, సభాగ్ని అవసథాగ్ని] పంచయజ్ఞాలు [దేవ, పితృ,భూత, బ్రహ్మ, మనుష్య యజ్ఞములు] ప్రాచీన కాలం నుంచి ప్రజల సంఖ్య [అంటే సంతానాభివృద్ధి] పశువుల సంఖ్య పెరగటానికి చేసే వ్యావసాయిక మంత్ర చర్యలే. వీటిలో బలి, రతి సమ్మిళితమైన ఉంటాయి. ఉపనిషత్తుల కాలం కన్నా చాలా పూర్వమే పురుషాధిక్యత వచ్చింది. పురుష దృక్పథం నుంచే విశ్వాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించారు.

"ఏషాం వైభూతానాం పృథివీరసః పృథివ్యా ఆపః ఆపామౌషధయ, ఔష–ధీనాం పుష్పాణి, పుష్పాణాం ఫలాని, ఫలానాం పురుషః పురుషస్య రేతః." [బృహదారణ్యకం 6–4–1]

"ఈ సర్వ భూతాలకూ రసము అనగా సారము పృధ్వి పృధ్వికి సారము నీరు నీటికి సారము ఓషధులు అనగా వృక్ష రాశి! ఓషధుల సారము పుష్పాలు, పుష్పాల సారం పళ్లు పళ్ళకు సారము పురుషుడు. పురుషునికి సారం రేతస్సు" అని ఊహించారు. పురుషుడైన ప్రజాపతి తన రేతస్సును ప్రతిష్ఠించ డానికి సంకల్పించాడు. స్త్రీని సృష్టించాడు. ఆమెకు మర్మాంగంగా ఉపస్థను సృష్టించాడు. అది "వేది" గా యజ్ఞం ప్రారంభించాడు. [బృహదారణ్యకంలో సవివరంగా చెప్పిన అన్ని విషయాలకు మధ్య తరగతి మర్యాదస్థులు అర్థాలు రాయరు. కావలసిన వారు 6–4–3 నుంచి 6–4–5 దాకా ఉన్న గ్రంథాన్ని చూసుకోవాలి.]

పురుషాధిక్యత ఉన్న సమాజంలో సైతం పురుషులందురూ సమానులు కారు. పాలితుల కన్నా పాలకులు గొప్ప వారు. వాళ్ళలో రాజన్యులు మరీ గొప్ప వారు. అందరి కన్నా గొప్పవాడు సామ్రాట్టు. సార్వభౌమాధికారాన్ని వాంఛించే ఏకరాట్టు అశ్వమేధ యాగం చేయాలి. దీనిని ఋగ్వేదకాలంలో మొట్ట మొదటి సారిగా సుదాసు అనే రాజు చేత విశ్వామిత్రుడు చేయించాడు. ఆ రాజుకు ఇతడు పురోహితుడు. దిగ్విజయం కోసం గుర్రాన్ని విడిచి పెట్టడం విశ్వామిత్రుడు రచించిన బుక్కుల్లో కనిపిస్తుంది. [3–53–11] నాటి నుంచి ఇది ఎందరో చక్రవర్తులు చేశారు. రామాయణంలో దశరథుడు, రాముడు, మహాభారతంలో ధర్మరాజు కూడా చేశారు. చారిత్రక యుగాలలో తెలుగు భూములను పాలించిన వారూ చేశారు.

ఇది నిజానికి మూడు రోజులు యజ్ఞమే కానీ దీనికి అవసరమైన ఏర్పాట్లకు ఒక సంవత్సరంపైగా పడుతుంది. ఇది యజ్ఞం చేసే యజమాని విజయానికీ, శౌర్యానికీ

ఉత్తరోత్తరా సంకేతమైనా ఆదిలో వ్యావసాయిక మంత్ర చర్య మాత్రమే. ఆడవాళ్ళ పండుగే యజమాని దీక్ష ప్రారంభం కాగానే అతని నలుగురు రాణులూ సర్వాభరణ భూషితలై నూతన వస్త్రాలు ధరించి వస్తారు. పట్ట మహిషిని, రాజ కుమార్తెలు అనుసరిస్తారు.

రాజుగారి ముద్దులు భార్య " వావాత" ను క్షత్రియ కుమార్తెలు అనుసరించి వస్తారు.

ఇంకా గొడ్డు వీగని రాణి " పరివృక్తి" సూత్రగ్రామణీదుహితలతో వస్తుంది.

రాజోద్యోగులలో ఒకరి కుమార్తెను రాజు వివాహమాడితే ఆమెను "పాలాకలి" అంటారు. ఈ నాలుగో రాణి ఇతర రాజోద్యోగుల కుమార్తెలతో వస్తుంది.

అప్పుడు యజమాని యాగశాలలోనికి ప్రవేశించాలి. ఇందరు స్త్రీలు పాల్గొనే తంతులో గుర్రాన్ని దేశ సంచారానికి విడిచి పెడతారు. అశ్వం ఏడాది తరువాత తిరిగి వచ్చాక నలుగురు రాణులూ యాగశాలపై నేతి కల్లాపులు చల్లుతారు.

గుర్రానికి నూటొక్క బంగారు పూసల దండను కడతారు. ఆహారం సమర్పిస్తారు. అది దాన్ని తినకపోతే నీళ్ళలో పారెయ్యాలి. హోత, బ్రహ్మ అనే ఋత్విక్కులు సమంత్రక సంభాషణలు జరిపాక ఒక వస్త్రాన్ని తృణాలపై పరుస్తారు. దానిపై ఒక పచ్చడాన్ని పరుస్తారు. దానిపై బంగారు శలాకను ఉంతారు. పచ్చడం మీద యాగాశ్వాన్ని మంత్రోక్తంగా వధిస్తారు. దాని కళేబరం చుట్టూ నలుగురు రాణులూ ఎడమ నుంచి కుడికి మూడుసార్లు కుడినుంచి ఎడమకు మూడుసార్లు వాజసనేయ సంహిత [23–19] లోని మంత్రాలను చదువుతూ ప్రదక్షిణ చేస్తారు. తమ వస్త్రాల చెరగులతో గుర్రానికి వీవనలు వీస్తారు. శోకాలు తీస్తారు.

ఆ పిమ్మట పట్ట మహిషి గుర్రం పక్కన పడుకుంటుంది. అధ్వర్యుడు వాళ్ళమీద పచ్చడం కప్పుతాడు. పట్టపురాణి గుర్రం యొక్క గూఢావయవాన్ని తన గూఢావయవంలో ఉంచుకొని శయనిస్తుంది.

ఆమెతో హోత బూతు సంభాషణలు ప్రారంభిస్తాడు. ఆమె అటు వంటి బూతులతోనె బదులు చెబుతుంది. రెండవ ఋత్విక్కు అయిన బ్రహ్మ ముద్దుల రాణి అయిన వావాతతోనూ ఆమె పరివార స్త్రీల తోనూ బూతులు మాట్లాడుతారు. మిగతా ఇద్దరు ఋత్విక్కులు మిగతా ఇద్దరు రాణులతోనూ, వారివార స్త్రీలతోనూ బూతు సంభాషణలు కొనసాగిస్తారు. ఇవన్నీ వాజసనేయ సంహితలోని మంత్రాల రూపంలోనే జరుగుతాయి. [23లో 22నుంచి 31దాకా] తరువాత పట్టపురాణి గుర్రం శరీరం నుంచి కొవ్వును హోమం చేయడానికి తీస్తుంది.

ఈ వివరాలన్నీ నరేంద్రనాథ్ భట్టాచార్య రచించిన 'ఏనిషెంట్ ఇండియన్ రిట్యువల్స్ [మనోహర్ బుక్ సర్వీస్ 1975] అనే గ్రంథంలో ఉన్నాయి.' అశ్వమేధం గురించి వివరాలిచ్చే విజ్ఞాన సర్వస్వాలన్నీ ఈ విషయాలను దాటవేస్తాయి. కొమర్రాజు లక్ష్మణరావు గారు ముఖ్య సంపాదకులుగా సంకలనం చేసిన 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం' రెండవ భాగంలో కనువర్తి మార్కండేయ శర్మగారు "ఋత్విక్కులు రాజపత్నులతోడ ప్రశ్న ప్రతి వచన సంభాషణ మొనర్తురు. తరువాత అశ్వావయవ హోమాదికము

సలుపబడును" అని ముక్తసరిగా రాశారు. ముఖ్య సంపాదకులు ఇక్కడ ఒక అధోజ్ఞాపికలో ఇలా రాశారు.

"వాజసనేయ సంహితము దానిపై మహీధరాదులు వ్రాసిన భాష్యమును, తైత్తిరీయమును, దానిపై సాయణాచార్యులు వ్రాసిన భాష్యమును బట్టి చూడగా గుఱ్ఱము చంపబడిన తరవాత, సార్వభౌముని పట్టమహిషి ఈ గుఱ్ఱము నొద్ద శయనించి క్రీడ సల్పవలెను. ప్రధాన ఋత్విజులు యజమానుని పత్నులతో బూతు ప్రసంగములు చేయవలెను. [ వాజసనేయ సంహిత 23 అధ్యాయము మీద మహీధర భాష్యము చూడనగును. తైత్తిరీయ సంహిత 7వ కాండము మీద నారాయణ భాష్యము చూడనగును]. కాని వేదము యొక్క ఈ భాగమునకు ఈ యశ్లీలార్థము చేయుట తప్పనుచు. దానికి మంచి యర్థము వేరొకటి యున్నదని దయానంద సరస్వతి భావము. [ చూడుడు ఋగ్వేద భాష్య భూమిక]"

మంచి అర్థం మాట ఎలాగున్నా అత్యంత ప్రాచీన కాలంలో ప్రధాన ఋత్విజులు రాజపత్నులతో బూతుమాటలాడడం కాక బూతు పనులే చేసేవారని ఆధునిక పండితులు నిరూపిస్తున్నారు. దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ గారు తమ 'లోకాయత' గ్రంథం [పుటలు 318-19]లోనూ, నరేంద్ర భట్టా చార్య ముందు చెప్పిన గ్రంథం [ పుటలు 7-8]లోనూ వాజననేయ సంహిత [23లోని 26-27] మంత్రాలను ఉదహరించి విశదం చేశారు. ఉద్గాత అనే ఋత్విజుడు వావాత వరివార స్త్రీలతో ఇలా అంటాడు.

*ఊర్ధ్వమేన ఉచ్ఛ్రాపయ గిరౌభారం హరన్నివ*
*అథాస్యై మధ్యమేదతామ్ శీతే వాతేపునన్నివ*

"గిరిపైన భారాన్ని వహించినట్లు ఎత్తండి ఈమెను పైకి ఎత్తండి. ఆమె మధ్యభాగం విప్పారాలి. శీత గాలిలో ధాన్యాన్ని ఆరపెట్టినట్టు."

దీనికి వావాత సమాధానం చెప్పి అతణ్ణి పై కెత్తమంటుంది. అతని మధ్యభాగం కార్యాన్ని ప్రారంభించాలని కోరుతుంది.

అశ్వమేధంలోని తంతు అవునో కాదో గాని రతి కార్యంలో పురుషుడు శీర్షాసన భంగిమలో ఉండగా స్త్రీని ఆమె చెలికత్తెలు పైకి ఎత్తి పట్టుకొనడమనేది ఖజురాహో కామశిల్పాలలో కనబడుతుంది.[చూ॥ చిత్రం-17].

ఇవాళ నాలుగు గోడల మధ్య గుట్టుచప్పుడు కాకుండా చేసే సెక్సు కార్యాన్ని అత్యంత ప్రాచీన కాలంలో బట్టబయలులో ప్రజలంతా చూస్తుండగా చేయడం ఎంత ఎబ్బెట్టుగా, జుగుప్సాకరంగా నేటి సభ్య జనులకు తోచినా అది ఆ 'సత్యకాలంలో' ఒక వ్యావసాయిక మంత్ర చర్య. పట్టపు రాణితో సంగమించిన వానిని బలి వేసేవారు. యజమాని చక్రవర్తి అయ్యాక ఈ యజ్ఞంలో గుర్రం అతనికి ప్రాతినిధ్యం వహించింది. అందుకే గుర్రాన్ని వధించేవారు. తరువాత ఇతర యజ్ఞాలలో కూడా ప్రత్యామ్నాయాలను ప్రవేశపెట్టారు. సజీవ పశువులకు బదులుగా పిష్ట పశువులను



చిత్రం 17. ఖజురహోలో కామ శిల్పం

అంగీకరించారు. అయితే ఏదో ఒక రూపంలో వ్యావసాయిక మంత్ర చర్యలలో సెక్సు అంశాన్ని మాత్రం ఒక్క మనదేశంలోనే కాక ఇతర దేశాల ఆదిమ ప్రజలూ నిలుపుకొన్నారు.

సెంట్రల్ అమెరికాలోని ఆదిమవాసులు విత్తనాలు చల్లే కాలంలో అలా జల్లడానికి ముందు పొలాలలో సెక్సు కార్యం జరపడానికి కొందర్ని నియోగిస్తారు. మాస్కోవ్కే ప్రజలు పొలంలో రతి కార్యం చేయడానికి ఒక స్త్రీని, ఒక పురుషుణ్ణి ఎన్నుకొంటారు. పెరూ, చిలీ, న్యూమెక్సికో, నికరాగ్వా మొదలైన లాటిన్ అమెరికా దేశాల్లో ఇటువంటి ఆచారాలే ఉన్నాయి. మనదేశంలో ఛోటా నాగపూర్‌కు చెందిన హోస్ తెగలు పంటల పండుగ రోజుల్లో ఆడపిల్లలకు సెక్సు విషయంలో సంపూర్ణ స్వాతంత్ర్యం ఇస్తారు. నీలగిరి కొండల్లోని 'కొత' ప్రజలలో కూడా ఇలాంటి ఆచారమే ఉంది. ఒక్క అనాగరిక తెగలలోనే కాక సభ్యత అలవరచుకున్న నాగరిక ప్రజలలో కూడా హోలి సందర్భంలో విచ్చలవిడితనం ఉంది.

సామాజిక సత్యాన్వేషణకే సాహిత్య జీవితాన్ని అంకితం చేసిన మహనీయుడు శ్రీ

సురవరం ప్రతాపరెడ్డి గారు తమ 'హిందువుల పండుగలు' అనే గ్రంథంలో హోలి వ్యావసాయికమైనదని గుర్తించారు.

"మనదేశమందు క్రొత్తగా పండిన ధాన్యమును గడ్డితో తెచ్చి గ్రామస్తులందఱును నొక చోట చేరి దానిని గాల్చి సగము పక్వమైన తర్వాత భుజించు పండుగ చేయుచుందురని ఊహించవచ్చును. వడ్లు, గోధుమలు, జొన్నలు, సెనగలు ఈ ఫాల్గుణ పౌర్ణమి వరకు పూర్తిగా పండును. కావున వసంత కాలములోని హోలికా ధాన్యమును వేపుకొని భుజించుచుండిరే కాని హోలికా రాక్షసిని కాల్చలేదని నమ్మవచ్చును" [పుట 147]

అయితే ఈ పంటల పండుగలో ఆదిమ సెక్సు స్వాతంత్ర్యపు జ్ఞాపకాలు సమాజం మరచిపోలేదు. హోలికాదహనం చేస్తున్నపుడు దీపన మంత్రాలున్నాయి. బూతులను ఉపయోగించడానికి, నీచ కార్యాలు చేయడానికే అనుజ్ఞ ఇందులో కనబడుతుంది. ప్రతాపరెడ్డి గారు ఇంకా ఇలా రాశారు.

"ఈ యుత్సవములలో జనులు కొన్ని హేయమగు పనులను జేయుదురు. కొన్ని ప్రాంతములలో వీధులలో జనులొకరిపై నొకరు దుమ్ము జల్లుకొందురు. మరియు నొకరి నొకరు తిట్టుకొందురు. రంగులు జల్లుకొందురు కొన్ని ప్రాంతములలో నదేప నిగా వారకాంతలను కూలికి పిలుచుకొని వచ్చి మంగళ వాద్యములతో నూరేగింపు చేయుచు వారిపై రంగులను చెంబుల తోడను, పిచికారీల తోడను జల్లుచుందురు. ఆంధ్ర దేశమునందీ యుత్సవములు కామదహన మనియు, కాముని పున్నమయనియు వ్యవహరింతురు. ఆంధ్ర దేశమున కన్న మహారాష్ట్ర దేశ మందింకను హేయమగు పనులు చేయుదురు. ఇందూరు సంస్థానమందును దత్పరిసర ప్రదేశము లందును నీ పండుగనాడు 'న త్థూరాం' అను గొప్ప విగ్రహము నొకటి చేసి, దానికొక గొప్ప లింగము నుంచుచుండిరట. ఈ యంగమును స్త్రీ పురుషులు పూజించుచుండిరట. హైదరాబాద్ నగరములో కూడా మార్వాడీలుండు బేగం బజారు మున్నగు ప్రాంతములలో నిన్న మొన్నటి వరకు ఈ 'నత్థూరాం' యొక్క వికార విగ్రహములు బజారులో స్థాపింపబడుచుండెను." [142,143]

శిష్టులకు ఈ పామర ఆచారాలు హేయమనిపించడం సహజం. ఈ ఆచారాలను అరికట్టించడానికి ప్రయత్నాలు జరిగాయి. కొన్నిచోట్ల అదుపులోనికి వచ్చాయి. అయితే ఇది సర్వ దేశాలలో, సర్వజాతులలో పాతుకుపోయిన వ్యావసాయిక మంత్ర చర్యలకు ప్రత్యామ్నాయ రూపాలు. సురవరం ప్రతాపరెడ్డి గారు ఈ సంగతి కూడా గుర్తించి పాఠకులకు సవిస్తరంగా తెలియజేయకపోలేదు. చూడండి వారు రాసిన విషయాలు.

"ఇది కేవలము హిందూ స్థానము నందే గాక ప్రాచీనమందు బహు దేశములలోను నాచరింపబడుచుండెను. రోములో [ఇటలీ దేశములో] ప్రాచీనమందు లూపర్కేలియా అను వసంతోత్సవము చేయబడుచుండెను. అందు యువకులు వీధులలో నగ్నులై పరుగెత్తుచుండిరి. మరియు వారి కడ్డముగా మగనాండ్రు సంతాన ప్రాప్తికలుగునని నమ్మికతో నిలిచి వారి చేత నుండు తోలు కొరడాలు దెబ్బలను దినుచుండిరి. రోము జనులు మన్మథుని బ్యాకస్ అనుచుండిరి. ఈ బ్యాకస్ పండుగలో చెప్పరాని కామ వికారములు ప్రదర్శించుచుండిరి."

"జర్మనీలో పూర్వ కాలమున నిట్టి దురాచారమే యుండెను. అచ్చటి యువకులు నగ్నులై వీధులలో దిరుగుచు స్త్రీలను బూతులతో దిట్టుచుండిరట. గ్రీసు, పోర్చుగల్లు మున్నగు దేశములలో నిట్టి వసంతోత్సవములే యుండెడివని పాశ్చాత్య గ్రంథకర్తలు నిరూపించియున్నారు....."

"ఈ విధముగా ప్రాచీన మందార్య శాఖలలో జేరిన జాతులన్నింటిలో ఈ వసంతోత్సవ ముండుటయు, నన్నితాపులలో నీతిబాహ్యపు చర్యాలను పచ్చి శృంగార చేష్టలను చేయుటయు ప్రసిద్ధము..." [పుటలు 150–151]

ఆర్యులు భారత దేశానికి రాకముందు నుంచీ, వచ్చాక ఈ వ్యావసాయిక మంత్ర చర్య ఆరు బయట జరుగుతూ ఉండేది. యాగశాలలు పరమ పవిత్రమైనవి. కనుక అక్కడే అవి జరిగేవి. యాగశాలలు క్రమంగా తగ్గిపోయి దేవాలయాలు వచ్చాక వ్యావసాయికమైన సెక్సు చర్యల ప్రత్యామ్నాయాలుగా గుడిలోనే చోటు చేసుకున్నాయి. యజ్ఞాలలో యజమాని పత్నిని సోమిదమ్మ, సోమిసాని అని కూడా పిలుస్తారు. యాగశాల స్థానంలో వచ్చిన దేవాలయాలలో సోమిసాని స్థానాన్ని గుడిసాని పొందింది. చారిత్రక పరిణామంలో ఆదిమ సెక్సు మంత్ర చర్యలు గుడిలో ప్రత్యామ్నాయ ప్రతీకల, ప్రతిమల, కామశిల్పాల రూపంలో నిక్షిప్తమయ్యాయి.

## అథోజ్ఞాపిక

[1] చూ. తిరుమల తిరుపతి దేవస్థానం వారి ప్రచురణ. అర్థ విజ్ఞాన సర్వస్వం, పుట 320

# గుడిచరిత్ర - చరిత్రలో గుడి

వేదకాలం నాటి యజ్ఞ యాగాదులలో చావు పుట్టుకల-సమ్మేళనం ఉండేదని చూశాం. ప్రకృతిని పరిశీలించిన ఆదిమానవులు పుట్టిన ప్రతి ప్రాణీ చనిపోక తప్పదని, చచ్చినవన్నీ మళ్ళీ పుడతాయనీ గ్రహించారు. ఉషస్సును "పునః పునర్జాయమానా" అని [1-92-10] చంద్రుణ్ణి 'నవో నవోజాయ మానః' అనీ [10-85-19] ఋగ్వేద ఋషులు తమ సూక్తాలలో చెప్పారు. విత్తనంలోంచి చెట్టు వస్తుంది. చెట్టు నుండి విత్తనాలు వస్తాయి. దేవతలకు ఒకరిని బలి వేస్తే సస్యసంపద, సంతాన భాగ్యం కలుగుతుందని నమ్మేవారు. భార్యను 'జాయ' - అని పిలిచేవారు. పతి ఆమె యందు పుత్రుని రూపంలో మళ్ళీ పుడతాడని అప్పటి విశ్వాసం. 'ఆత్మా వైపుత్ర నామాసి'. జన్మ నిచ్చేది జనని. ఈమె నుంచే జనత ఉద్భవిస్తారు. నేల తల్లి లాంటిది. నింగి తండ్రి లాంటివాడు ఈ దేవతల చేత సృష్టికార్యం చేయించడం మానవుల ధర్మం. ఎందరో దేవతల చేత పనులు చేయించాలి. వాళ్ళను మెప్పించాలి. అందుకే యజ్ఞయాగాదులు అవసరం.

వేద కాలంలో యజ్ఞశాలలను మించి మరే పవిత్ర స్థలాలు లేవు. యాగశాలను కూడా క్రతువు పూర్తయ్యాక పూర్తిగా కాల్చివేసేవారు. ఆ ప్రాచీన కాలంలోనే కాదు. నిన్నటిదాకా భారతదేశంలోని వివిధ గ్రామాలలో ప్రాకృత దేవతలకు గుడులంటూ లేవు. ఆహార సేకరణ దశలోనూ, ఆహారోత్పత్తి దశలోనూ సమాజం మాతృస్వామికమే కనుక దేవతను మాతృ స్వరూపిణిగానే భావించుకొన్నారు. ద్రావిడులు వ్యవసాయ ప్రధాన జీవులు. అందుచేత వారి దేవతల స్వరూప స్వభావాలు ప్రత్యేకమైనవి. దక్షిణ భారతంలోని నాలుగు ప్రధాన భాషా ప్రాంతాలలో ఎంత లేదన్నా శతాధికమైన గ్రామదేవతలున్నారు. వారందరిలోనూ నెలకొన్న మాతృ దేవతా లక్షణాలను నాయని కృష్ణకుమారిగారు ఇలా క్రోడీకరించారు.

1. ఆమె భయంకర స్వరూపిణి, చతుర్భుజ, లంబజిహ్వక, వికటదంత.
2. బలిని గ్రహించడం, రక్తపానం, ఆసవసేవనం ఆవిడకు ప్రీతికరాలు.
3. మనుష్యుడు ఈమెను భయ నివారణకే కొలవడానికి పూనుకొంటాడు.
4. తన్ను కొలవని మనుష్యులను పట్టి పల్లార్చి రోగాల పాలు చేయడంలో ఈవిడకు పట్టుదల మెండు.
5. పాలిత జనం మీద ఈవిడకు సంతాన బుద్ధి ఉండడంవల్ల ఈవిడ జగద్ధాత్రి.
6. గ్రామాలను పరిరక్షించడం, చెలరేగిన వ్యాధులను అదుపులో ఉంచడం, పశువులనూ, జనులనూ ఈతి బాధల నుంచి 'గ్రహ బాధల' నుంచి శత్రువుల నుంచి రక్షించడం ఈవిడ నిత్య కృత్యాలు. అంతే కాక ఊరి పొలిమేరలనూ, పంట పొలాలనూ, చెరువులనూ, నీటి వనరులనూ కాపాడే రక్షక దేవత [గార్డియన్ డైటీ] ఈవిడ.

ఇవన్నీ ఆర్యదేవతా లక్షణాల కంటె పూర్తిగా భిన్నాలని స్పష్టమవుతూంది.

దేవత పేరు ఊరి కొక మాదిరిగా ఉన్నా లక్షణాలు మాత్రం సర్వసామాన్యమే. ఇటువంటి మాతృదేవతల పూజా కలాపాలను "కొలుపులు" అంటారు. ఇందులో బ్రాహ్మణ పౌరోహిత్యం ఉండదు. తదితర వర్ణాలవారు పాల్గొని ఉమ్మడిగా ఈ జాతరలు చేస్తారు. కుమ్మరి అమ్మవారి బొమ్మను చేస్తాడు. చాకలి దానిని బలి వేసే చోటుకు తీసుకువెళ్తాడు. ఈడిగవాడు పసుపూ కుంకుమ పెట్టిన కుండల నిండా కల్లు ఇస్తాడు. వేట వేయవలసిన పోతును మాలలు మాదిగలు ఊరేగిస్తారు. ఊరిపెద్ద బానల నిండుగా బోనాలు వండించి పంపిస్తాడు. ఆసాదులు అమ్మవారి మీద పాటలు పాడుతారు. మాతంగి నాట్యం చేస్తుంది. మాదిగ దున్నపోతును బలివేశాక కుడి కాలు నరికి పోతు నోట్లో పెట్టాక, చాకలి ఊరివాళ్ళు తెచ్చిన సన్నజీవాలను బలి వేస్తాడు. వడ్రంగి చేసిన కర్ర బండి మీద పోతు తలనూ, నెత్రుబోనాన్నీ ఊరేగిస్తారు. ఊరివారందరూ తాగి కర్రలతో కత్తులతో ఊగుతూ చిందులు వేస్తూ ఊరేగుతారు. తప్పెటలూ, కొమ్ముబూరలూ మొదలైనవి మోగుతూనే ఉంటాయి. నెత్రుబోనాన్ని వీధులలో జల్లుతూ 'పొలి,పొలి'అని కేకలు పెట్టే సందర్భంలో వాద్యఘోష ఆపివేస్తారు. నెత్రుబోనం మెతుకులు పడ్డచోట అంటు వ్యాధులు సోకవని జనుల విశ్వాసం. బలి ఇచ్చిన జంతువు దబ్బలను [కార్జం] నోట కరచుకొని ఊరి మాదిగ ఊరు చుట్టూ తిరుగుతాడు. ఆ రక్తం పడినంత మేరా కలరా మశూచి వంటి వ్యాధులు రావు. పశువులకు గాలి సోకదు. పంటలకు రక్షణ ఉంటుంది. ఈతి బాధలు రావు.

ప్రాణులు రక్తానికుండే మహత్తరమైన శక్తి పట్ల సర్వ దేశాలలోని ఆదిమ ప్రజలకు ఒకే రకమైన విశ్వాసాలు కలగడంలో ఆశ్చర్యమేమీ లేదు. అనాగరిక దశ నుంచి పరిణామం చెందుతున్నప్పుడు తెలిసీ తెలియని ఊహలు రావడం సహజం. ప్రాణికి రక్తం ముఖ్యమైన ప్రాణావసరం. నెత్తురు పోతే జీవం పోతుంది. దేహంలోని కలేజా, కార్జం లేక దబ్బలలో జీవముంటుందని ఆదిమానవులు విశ్వసించారు. దాని నెత్తురు ఎక్కడ చిందితే అక్కడ ప్రాణం మొలుస్తుదన్న అంధ విశ్వాసం కూడా ప్రబలింది. యజ్ఞయాగాదులలోనూ జాతరలలోనూ బలి ఇచ్చే జంతువులు మానవులకు ప్రత్యామ్నాయాలు. ఆదిలో నరబలి సర్వసామాన్యం. తోటి మానవుని బలి ఇచ్చే జాతి ఆ మంత్ర చర్యలో జాతి సమిష్టి 'జీవిత భీమా'ను నికరం చేసుకుంటున్నదని నృశాస్త్రవేత్త వెస్టర్ మార్క్ ఇలా చెప్పాడు.

"నరబలుల పద్ధతులపై ఒక తులనాత్మక అధ్యయనం వల్ల ఏయే సందర్భాలలో మానవ పశువులను బలి ఇస్తున్నారో, తేలుతుంది. యుద్ధానికి ముందూ, ముట్టడి సమయంలోనూ, అంటు వ్యాధుల విస్తరణను అడ్డుకొనడానికీ, ఆపడానికీ సర్వనాశనకరమైన క్షామాన్ని అరికట్టడానికీ, ప్రజలకు అవసరమైన నీటిని నేల ఇవ్వలేకపోయినప్పుడూ, నదుల వల్ల, సముద్రాల వల్ల వచ్చే జల ప్రళయాలను నివారించడానికీ ఒకానొక ప్రముఖ వ్యక్తి మరణాన్ని, ముఖ్యంగా తమ నాయకుని లేదా రాజు చావును ఆపడానికీ నరబలులు చేయటం కద్దు. ఈ వాస్తవిక కారణాలను బట్టి నేను తేల్చుకున్నదమంటే ప్రత్యామ్నాయ విధానంగా నరబలి ద్వారా జీవిత భీమాను ఖాయం చేసుకొంటున్నారు. భయంకర క్షామ నివారణకు, సమృద్ధిగా సస్య సంపదకూ నరబలి ఒక ఎరువు లాంటి

మంత్రచర్య ప్రజా జీవితానికి అపద వాటిల్లుతున్నప్పుడే పరమ భీభత్సమైన ఈ దురాచారాన్ని ఎంచుకొంటున్నారు."

వైదికుల యజ్ఞ యాగాదుల్లోనైనా, జానపదుల జాతరల్లోనైనా బలి ఒక తప్పనిసరి మంత్ర చర్య. ఇక్కడి మరణం భావి జననాలకు రక్ష, హామీ. అయితే వైదిక దేవతలకు కాని, గ్రామ దేవతలకు కాని ఆదిలో ఒక రూపమూ, ఒక గుడీ లేనే లేవు. యాగం పూర్తికాగానే యాగశాలను దగ్ధం చేసేవారు. జాతర పూర్తయ్యాక ఇంకేమీ గుర్తుగా పూర్వం మిగిలేది కాదు. ఉత్తరోత్తరా చిన్న చిన్న రాళ్ళు గ్రామ దేవతలకు నెలవులయ్యాయి. వైదికులు గుడులను ఆదిలోనే అంగీకరించలేదు. అయితే భారతదేశంలోని వివిధ మతాలవారికి గుడులు ప్రస్తుతం ఉన్నాయి. జైన, బౌద్ధ, హిందూ మతాలవారికీ, హిందూ మతంలోని వివిధ వర్గాలవారికీ దేవాలయాలు ఏర్పడ్డాయి. గుడి అన్నది ఎలా వచ్చింది? దీని ఉద్దేశమేమిటి? ఆరాధనా భావాలు ఎలా పరిణామం చెందాయి?

పూర్వకాలంలో గుడిని 'చైత్యము' అని పిలిచేవారు. ఈ పదం చితి నుండి వచ్చింది. చైత్యమనే మాటకు ఆయతనము, యజ్ఞశాల, శ్మశానము, కట్టడము అనే అర్థాలున్నాయి. చితి యజ్ఞంలోనూ ఉంటుంది. శ్మశానంలోనూ ఉంటుంది. శ్మశానంలో అంత్య కర్మలు చేశాక, చేసినచోట కట్టే కట్టడాన్ని చైత్యము అని పిలిచేవారు. వ్యక్తులు చనిపోయాక వారి దేహాలను పాతి పెట్టడమో, దహనం చేయటమో ఇప్పుడు పాటించే పద్ధతులు. ప్రముఖులు మరణించాక వారిని ఖననం చేసినా, దహనం చేసినా వారి జ్ఞాపకార్థం స్మారక చిహ్నాలనూ, ఆయతనాలను నిర్మించడం అత్యంత ప్రాచీన కాలం నుండీ ఆనవాయితీగానే ఉంది.

క్రీస్తుపూర్వం 500 నాటి చారిత్రక సాక్ష్యాల వల్ల అప్పటికే సమాధులూ, స్థూపాలూ, ఉండేవని తెలుస్తోంది. బుద్ధుడు క్రీస్తుపూర్వం 486లో మహాపరినిర్యాణం చెందాడు. ఆనాటి ఆచారాల ప్రకారం బుద్ధదేవుని గోత్రజులైన శాక్య వంశపు వారు అతని అస్తులను ఒక పాత్రలో ఉంచి ఒక సమాధిలో ఉంచారు. ఆ పాత్ర పైన ఒక శాసనం ఉంది. అందులో ఇలా రాశారు.

*"ఇయం సలిల నిధానే బుధస భగవతే సకియానాం*
*సుకుతి భటినాం సభగినకం సపుత దలనం"*

దీని అర్థం "భగవంతుడైన ఈ బుద్ధుని ఈ శరీర నిధానమూ భగవంతుని యన్నదమ్ములను సుపుత్ర భగినీకులును అయిన శాక్యులచే నిర్మింపబడినిది."

సమాధి మట్టి దిబ్బలను స్తూపాలంటారు. వాటి పక్కనే కట్టే గుడుల వంటి నిర్మాణాలను చైత్యాలంటారు. వీటి దగ్గరగా భక్తులు నివాస మేర్పరచుకొంటే వాటిని విహారాలంటారు. విహారాలనే ఆరామాలని కూడా పిలుస్తారు. ఆరామం అంటే వనమన్నమాట. శ్మశానాన్ని పితృవనం అని కూడా పిలుస్తారు.

చనిపోయిన అందరికీ సమాధులు కట్టరు. మంది మంచి కోసం ప్రాణాలిచ్చిన వీరులకూ, గణానికి నాయకత్వం వహించిన మొనగాళ్ళకూ, దుర్మరణం చెందిన స్త్రీ పురుషులకు వారు గతించినచోట ఛాయాస్తంభాలను నాటుతారు. వీరగల్లులు

కడతారు. వాటి పక్కనే వీర గుడులు చిన్నవి నిర్మిస్తారు. వీరుల లింగాలను కూడా ప్రతిష్ఠిస్తారు.

అనాది నుంచీ గుడికి, వల్లకాటికీ సంబంధముంది. శివుడు కాటి దేవుడు.



చిత్రం 18. వీరగుడి

కాటిరేడు. అందుకే శివాలయాన్ని ఊరవతల కట్టమని శాస్త్రాలు చెప్తాయి. రాజ్యాలను పాలించిన రాజులు, చక్రవర్తులూ తమ తండ్రులను దహనం చేసిన చోట శివాలయాలు నిర్మించారు. క్రీ.శ. 9వ శతాబ్దంలోని చోళ రాజ్యం ఏలిన రాజాదిత్యుడు, ఉత్తర ఆర్కాటు జిల్లాలోని సోలపురం వద్ద ఒక శాసనం వేయించాడు. తన తండ్రిని సమాధి చేసిన చోట శివాలయాన్ని నిర్మించినట్టు దానివల్ల తెలుస్తుంది. చిత్తూరు జిల్లాలోని తొండమానాడు శాసనం వల్ల ఒకటవ ఆదిత్యుని సమాధిపై శివాలయం కట్టినట్లు తెలియవస్తుంది. రాజుల సమాధుల పైనే కాదు, సామాన్య ప్రజలలో కూడా కొద్దిగా సంపన్నులకు సైతం శ్మశానాలలో శివలింగ ప్రతిష్ఠ జరగడం నేటికీ ఆచారంగానే ఉంది. కొందరు తులసికోటలు నిర్మిస్తారు. సమాధులపై చెట్లను పాతటం పూర్వాచారమే. ఈ చెట్ల గురించి తరువాత తెలుసుకొందాం.

గుడి అన్నది ఆకారం ఏర్పరచుకోవటం. శవ సంస్కారం నుంచే వచ్చింది. ఆదిలో ఆటవిక దశ నుంచి అనాగరిక దశ దాకా శవ సంస్కారంలో వివిధ పద్ధతులను మానవ సంఘాలు పాటించేవి. వాటి తీరు గమనిద్దాం.

1. అత్యంత ఆటవిక దశలో, చనిపోయిన వారి శవాన్ని ఇతర గణ సభ్యులు భక్షించేవారు.

2. కొన్ని యుగాల తర్వాత శవాలను చెట్లపై విడిచిపెట్టేవారు. [అజ్ఞాత వాసానికి వెళుతున్న పాండవులు తమ ఆయుధాలను చెట్టుపై పెట్టి తమ తల్లి కళేబరాన్ని పెడుతున్నామని దగ్గర్లో ఉన్నవారికి చెప్పారు.]

3. శవాలను కాకులకూ, గద్దలకూ విడిచిపెట్టేవారు. నేటికీ పార్సీలు ఈ ఆచారాన్ని పాటిస్తారు. మాంసాన్ని పక్షులు పూర్తిగా తిన్నాక అస్తులను ఒక ప్రత్యేకంగా కేటాయించిన నూతిలో పడవేస్తారు.

4. కొందరు పర్వత ప్రాంతాలలోని వారు శవాలను గుహలలో విడిచి పెడతారు.

5. నదుల సమీపంలో ఉండే జన సంఘాలు శవాలను పారుతున్న నీటిలో విడిచి పెడతారు. గంగానదిలో శవాలను ముంచటం నేటికీ కనబడే ఆచారమే. ఇంకెక్కడ దహనం చేసినా అస్తులను గంగలో నిమజ్జనం చేయటం పరిపాటే. జల సమాధి అనేది కొన్ని జాతులకు ప్రియమైన అంత్యేష్టి.

6. శవాన్ని భూమిలో పాతిపెట్టడం అనాగరిక దశలో చివరి యుగాల ఆచారం.






చిత్రం 19. రాక్షస గుళ్ళు

ప్రముఖుల శవాలను తల్లి కడుపులో బిడ్డను పడుకోపెట్టే భంగిమలో కాళ్ళూ చేతులూ మడిచివేసి ఖననం చేసేవారు. పాతిపెట్టిన చోట - చుట్టూ రాళ్ళను ఒక వలయంగా పేర్చేవారు. శవమున్న చోట గుర్తుకు కూడా రాళ్ళను అక్కడ ఉంచేవారు. [చిత్రం నెం. 19] వీటిని రాక్షస గుళ్ళు అంటారు. ఇవి చాలా పురాతన ఆచారాన్ని సూచిస్తాయి.

7. అనాగరిక దశ నుండి నాగరిక దశలో ప్రవేశిస్తున్నప్పుడు శవ దహనం ఆచారమైంది.





చిత్రం 20. అస్థి అవశేషాలు నిక్షిప్తంచేసిన గుడిసెలు

అస్థి సంచయనం అయ్యాక వాటిని గంగలో వదిలిపెట్టడానికి బదులు గుడిసెలో నిక్షిప్తం చేసేవారు. ఈ గుడిసెల ఆకారంలోనే తర్వాత గుళ్ళు వచ్చాయి. అస్థి అవశేషాలను దాచే గుడిసెల ఆకారాలు గుడుల లాగే ఉంటాయి. [చిత్రం 20]



చిత్రం 21. తొద జాతి వారి బోల్

నీలగిరిలోని 'తొడ'జాతివారు 'బోత్' అనే పేరుతో స్మారక గృహాలను నిర్మిస్తారు. ఇది దక్షిణ భారతదేశంలోని దేవాలయాలకు ఆదిమ రూపాలా అన్నట్లు శిఖరం ప్రదక్షిణ క్రమం మొదలైన అంగాలతో ఉంటాయి [చిత్రం 21]



చిత్రం 22. నాసిక్‌లోని చైత్య గుహ



చిత్రం 23. బర్‌బర్ కొండలలోని లోమస్ ఋషి గుహ అశోకుని కాలం నాటిది (దారు శిల్పాలను అనుకరించే రాతి శిల్పం

గుహాలయాలను చెక్కుతున్నప్పుడు గుడిసెను అనుకరించేవారు. దారు శిల్పాలను గుర్తుచేసే గుహాలయ శిల్పాలు కనబడతాయి. (చూ॥ చిత్రాలు 22, 23) ద్రావిడజాతుల గుడులు ఈ విధంగా పరిణామం చెందుతున్నప్పుడు వైదిక యజ్ఞయాగాదులు చేసేవాళ్ళకు అసలు గుడులన్నవే లేవు. వీటిని వైదికులు ఒప్పుకోరు. జైనులు, బౌద్ధులు పశుహింసను, యజ్ఞాలను నిరసించారు. అహింసను ప్రబోధం చేశారు. దానివల్ల పాడి పంటలకు ఆధారమైన పశుసంపద పెరిగింది. వ్యవసాయమూ వాణిజ్యమూ వృద్ధిచెందాయి. జైన మునులూ బౌద్ధ భిక్షులూ జన పదాలలో కాక అరామాలలోనూ, కొండలలోనూ నివసింపసాగారు. జైనుల, బౌద్ధుల గుహారామాలు జన పదాలకు చేరువలోనే ఉండే అడవులలో వాణిజ్య మార్గాలకు దగ్గరలో ఉండేవి. వర్తక వర్గాలూ, జైనులకూ, బౌద్ధులకూ కానుకలు, ఆస్తులూ, భూములూ ధారపోసి గుహాలయాలను గండరించేవారు. భారీ ఎత్తు చైత్య శిల్పాలను గుహాలలో చెక్కేవారు. ఆకులు, కొమ్మలు, లతలు, వన్య పశుపక్షాదుల చిత్రాలూ సాంఘిక దృశ్యాలు, యక్ష, గంధర్వ కిన్నెర కింపురషాదుల రూపాలను ఉబ్బెత్తు చిత్రాలుగా గుహల గోడలపై రూపొందించేవారు.

ప్రజలు, రాజులు, రాణులు ఇచ్చిన కానుకలతో జైనులు, బౌద్ధులు ఐశ్వర్యవంతులయ్యారు. భూస్వాములయ్యారు. వీరి భూములపై రైతాంగం ఆధారపడసాగింది. మహాయాన బౌద్ధం బాగా విస్తరించింది. భారీ సైజు స్తూపాలూ చైత్యాలూ గుహాలయాలూ వ్యాపించాయి. జైనులు రమారమీ రాజ్యాధికారాలు సంతరించుకొన్న ప్రబలురుగా వర్ధిల్లారు. ఈ బౌద్ధ జైనమతాలను నిరసించే శైవులు భక్తి మార్గాన్ని ప్రబోధించారు. లింగపూజలను ప్రచారం చేశారు. ప్రాకృతజనులు పాటించే వ్యావసాయిక మంత్రచర్యలను శైవం అంగీకరించింది. హింసకు బదులు ఆత్మహింస ప్రాకృత జనంలో వ్యాప్తిచెందింది. వారికి గుడి కన్నా జాతర బయలు ముఖ్యం.

బౌద్ధాన్ని జైనాన్ని శైవాన్నీ అంగీకరించని వైదిక బ్రాహ్మణ్యం ఈ మతాలవారు

మఠాధిపతులై, భూస్వాములై అధికారాలు చెలాయించటం చూశారు. స్మార్త బ్రాహ్మణులు వ్రతాలను ప్రోత్సహించసాగారు. వ్రత కల్పాలను రచించారు. ప్రతి చాంద్రమాన తిథికీ ఒక పండుగను నిర్ణయించారు. బ్రాహ్మణులకు దానాలూ, దక్షిణలూ ఇవ్వాలని ప్రతి వ్రతకల్పంలోనూ నిర్దేశించారు. ఇవి బ్రాహ్మణులకే ఇవ్వాలి. వైద్యం చేసే బ్రాహ్మణులకూ, విగ్రహారాధకులకూ, నర్తకులకూ, గాయకులకూ, శూద్రులకు పౌరోహిత్యం వహించేవాళ్ళకూ, వడ్డీ వ్యాపారం చేసే బ్రాహ్మణులకూ దానాలూ, దక్షిణలూ ఇవ్వకూడదని శాస్త్రం పుట్టించారు.

జైనులు, బౌద్ధులు, శైవులు వేద ప్రామాణ్యాన్ని బ్రాహ్మణాధిక్యతను అంగీకరించరు. పైగా ఖండిస్తారు. శైవులు గుడుల నిర్మాణాన్ని ప్రోత్సహించారు భక్తిని ప్రభోధించారు. ఫ్యూడల్ వ్యవస్థ భక్తిపైనే బలపడుతుంది. కనుక రాజులు ఆలయనిర్మాణాలకు పూనుకున్నారు. పల్లవులు, చోళులు, పాండ్యులు, తమిళనాడులోను, చాళుక్యులు, గాంగులు, హోయసలులు కర్ణాటకలోనూ, వేంగీ చాళుక్యులు ఆంధ్రప్రదేశ్ లోనూ, ఆలయ నిర్మాణాలు విస్తృతంగా సాగించారు. ఈ హిందూ దేవాలయాల భూముల పైనా, తోటలపైనా, తటాకాలపైనా రైతాంగం ఆధారపడసాగింది.

మొదట దేవాలయాలకు దూరంగా ఉండే స్మార్త బ్రాహ్మణ్యం ఆ ఆయతనాల ప్రాబల్యం చూశాక వాటిని ప్రమాణికం చేశారు. బృహన్నిర్మాణాలలో వైదిక యజ్ఞశాలల పోలికలను చూపెట్ట సాగారు. ఆలయమూ యాగశాలా ఒకే పద్ధతిమీద ఉంటుందనే సిద్ధాంతాన్ని ప్రచారంచేశారు. తులనాత్మకంగా చూస్తే రెండింటికీ కొన్ని సామ్యాలు లేకపోలేదు. [చిత్రం నెం 24] క్రీస్తుశకం 8-12 శతాబ్దాల మధ్య హిందూదేవాలయం సంపూర్ణ స్వరూపాన్ని సంతరించుకొంది. సంస్కృతంలో గుడికి చాలా పర్యాయపదాలు ఉన్నాయి. వాటిలో కొన్ని ఆకారాదిక్రమంలో చూడండి.

ఆలయానికి ఇన్ని పర్యాయ పదాలున్నా విమానం, ప్రాసారం అన్నవే చాలా ప్రాచుర్యం పొందిన పదాలు. విమానాలు అయిదు రకాలుగా అయిదుగురు దేవతలకు సంబంధించినవి అయిదు ఆకారాలలో ఉంటాయి.

| విమానం పేరు | దేవత పేరు | ఆకారం |
|---|---|---|
| 1. వైరాజు | బ్రహ్మ | చతురస్రం |
| 2. పుష్పకం | కుబేరుడు | దీర్ఘ చతురస్రం |
| 3. కైలాసం | శివుడు | వృత్తాకారం |
| 4. మణిక | వరుణుడు | వృత్తాయత (Eleptical) |
| 5. త్రివిష్టపం | ఇంద్రుడు | అష్టాస్రము (Octagonal) |

భారతదేశం లోని గుడులను విభిన్న రీతులలో నిర్మిస్తారు. కొన్నిగ్రంథాలలో వీటిని నాగర, ద్రావిడ, వారాట అనే పదాలతో మూడు విధాలుగా పేర్కొంటారు.చాలా గ్రంథాలు మాత్రం వీటినే నాగర, ద్రావిడ, వేసర అనే పదాలతో పిలుస్తాయి. ఈ మాటలే ప్రాచుర్యం పొందాయి.అయితే పశ్చిమ చాళుక్యశాసనం ఒకదానిలో నాలుగు భిన్నరీతుల దేవాలయాలను నాగర, కాళింగ, ద్రావిడ, వేసర అని పేర్కొనడం కనపడుతుంది.




4. దేవాలయము

1. ధ్వజము
2. బలిగృహము
3. బలిపీఠము
4. హపిశ్యాం
5. మండపము
6. గర్భగృహము
7. మూలవిగ్రహప్రతిష్ఠ
8. దేవీవిగ్రహప్రతిష్ఠ (అవసరమగునెడల)

డురకాల గుడులున్నాయి. అవిక్రమంగా
4.లతిన, 5.సాధార,6.భూమి,7.నాగర పుష్ప
్రనా ఇదే గ్రంథంలో ఇంకొక సందర్భంలో
4.భూమి, 5.లతిక, 6.సాధార, 7.మిశ్రక అని

నిర్మించినా దాని గర్భగృహద్వారశాఖలపైన
ంహిత (LV) హయశీర్ష పంచతంత్రం, అగ్నిపు
(XL30-34) మొదలైన ప్రామాణికగ్రంథాలు
్తాపం (క్రీస్తుపూర్వం 2వశతాబ్ది ప్రాంతాలు)
ో లభించే ప్రాచీనతరమైన చారిత్రక సాక్ష్యాలు.

స్తూపాలనుగానీ, చైత్యాలనుగాని శాస్త్రోక్త పరిమాణాలతో నిర్మించాలి. అయితే దేవాలయ నిర్మాణ పద్ధతులు ఆగమాల ప్రకారం జరుగుతాయి. వేదాలను నిగమాలు అంటారు. అగమాలు ప్రజల సంప్రదాయం నుంచి వచ్చినవి.

అన్య సంస్కృతి ఆరాధ్యమైనప్పుడు, పాలక వర్గాల జీవన విధానాలు అనుసరణీయమైన ఫ్యాషన్లయినప్పుడు ఆ ప్రాకృత జనుల దేవతలు క్షుద్ర దేవతలయిపోతారు. వాళ్ళ ఆరాధనా విధానాలు హేయమైనవి అవుతాయి. పరసలు గుడి బయటే జరుగుతాయి. నాయని కృష్ణకుమారిగారి పరసను ఇలాగ వివరించారు.

"పరసలో అన్నిచోట్లనుండీ జనులు 'పావనాలు" ముద్రగడలూ' పట్టుకొనివస్తారు. ఎక్కడ చూచినా 'పటము పందిళ్ళు' వెలసి విరాజిల్లుతుంటవి. పోతురాజుల ఆటోపం ఎక్కువగాకనిపిస్తుంది. జమిడకల్ని వాయించే బవనీలు, కొర్రునెక్కి ఆడే కుమారవర్గం, శీవెల వారు, గావులవారు, బారు కటార్లవారు, పగ్గాలవారు, సిడెలెక్కువారు, 'సింగం' పూనినవారు, పుట్టు పాపలు విచ్చలవిడిగా విధిగా విజృంభిస్తూ ఉంటారు.

కుతిక రంపాలు, గుండె గాలాలు, నాలుగ మడుపు కొర్రులు, నడి నెత్తి కొర్రులు దార్చిన వీరభక్తులు విహరిస్తుంటారు. భేరి ఢమారులు, బిరుచు మద్దెలలు, బూరగొమ్ములు, ఢక్కలు, తప్పెట్లు, సింగినాదాలు, చిరుతవీణెలు, గంటలు, కైపిడి గంటలు మొదలైన వాద్యాలు ఘోరుకొల్పుతూ భీకర వాతావరణాన్ని కల్పిస్తుంటవి."

ప్రాకృత జనుల దేవతలు కూడా భీకరమైనవే. ఆ దేవతలు భయంకర స్వరూపిణులు. వీళ్ళు గుళ్ళలో ఉండరు. ఊళ్ళలో వేప చెట్ల కింద, పాముల పుట్టల్లో నెలకొని ఉంటారు. వ్యావసాయిక మంత్ర చర్యలను చేసే ప్రాకృత జనులు చెట్లలో దేవతలను ముఖ్యంగా యక్షిణీ దేవతలను చూడడం సహజమే. సంతానాభివృద్ధి, సస్యసంపద మొదలైన సఫలతలు కోరేవాళ్ళు వృక్షాలను నమ్ముకోవడంలో ఆశ్చర్యం లేదు.

## అధోజ్ఞాపికలు

[1] జానపద గేయాలు - సాంఘిక చరిత్ర ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ప్రచురం.

[2] వెర్రియర్ ఎల్విన్ తన 'మారియా మర్డర్, అండ్ సూయిసైడ్' గ్రంథంలో ఉదహరించారు. పుటలు 74-75.

[3] Stella Kramrish - The Hindu Temple Page No. 291

# యక్షులూ - వృక్షాలూ

ఆదిమ విశ్వాసాలున్న ప్రాకృత జనులందరూ వృక్షాలను పూజ్య భావంతో గౌరవిస్తారు. సమాజం పచ్చగా ఉండాలంటే లోకం చెట్లతో, చేమలతో పచ్చగా ఉండాలని ప్రాకృత జనులకు ప్రాచీన కాలంలోనే తెలుసు. చెట్లు చిగురిస్తాయి. మొగ్గ తొడుగుతాయి. పూలు వికసిస్తాయి. ఫలిస్తాయి. ప్రాణి కోటికి తిండి పెడతాయి. చెట్లు ఋతువులను బట్టి ఆకులను రాల్చినా మళ్ళీ కొత్త చిగుళ్ళు తొడుగుతాయి. చెట్లలో ఏవో శక్తులుండకపోతే ఇది సాధ్యం కాదని ప్రాకృత జనులు భావించడంలో తప్పు లేదు.

వృక్షాలలో యక్షులు జీవిస్తూ ఉంటాయి. ఒక వృక్షంలో ఉండే యక్షిణి దానిని విడిచిపెట్టి వెళ్ళిపోతే ఆ చెట్టు ఎండిపోతుంది. మోడైపోతుంది. బౌద్ధుల జాతక కథలలో వృక్ష దేవతల ప్రసక్తులున్నాయి. మౌర్యుల కాలం నుంచీ వివిధ ప్రదేశాలలోని శిల్ప చిత్రాలలో వృక్షాలూ, వాటిని అనుకున్న యక్షులూ కనబడతాయి. టేకు, మామిడి, మర్రి, మద్ది, మోదుగ, జువ్వి, రావి చెట్ల వంటివి దేవతా శక్తులున్న వృక్షాలయ్యాయి. రావి చెట్టునే సంస్కృతంలో అశ్వత్థం అంటారు. దీనికి పిప్పలమనే పర్యాయపదం ఉంది. శాక్యముని రావి చెట్టు కిందనే బుద్ధుడయ్యాడు. కనుక దానిని బోధివృక్షమని కూడా అంటారు.

బౌద్ధులకు పరమ పవిత్రమైన అశ్వత్థ వృక్షం ఉత్తరోత్తరా హైందవులకు కూడా ఆరాధ్య వృక్షమయింది. రావి చెట్టులో త్రిమూర్తులున్నారన్న నమ్మకమేర్పడింది. అశ్వత్థ దర్శనం చేస్తున్నప్పుడు పఠించవలసిన శ్లోకం విస్తృత ప్రచారం పొందింది.

మూలతో బ్రహ్మ రూపాయ
మధ్యతో విష్ణు రూపిణే
అగ్రత శివ రూపాయ
వృక్ష రాజాయతే నమః

సంతాన సౌభాగ్యాన్ని అభిలషించే స్త్రీలు అశ్వత్థ ప్రదక్షిణలు చేస్తే కోరికలీడేరుతా యన్న విశ్వాసం అనాదిగా ఉంది. రావి చెట్టుకున్నట్టే ఇతర వృక్షాలకు కూడా కొన్ని కొన్ని ప్రత్యేకతలున్నాయి. సాల వృక్షాల అంటే మద్ది చెట్లు వర్షాలు కురిపిస్తాయని ఛోటా నాగపూర్ ప్రాంతాల్లోని ఆదిమవాసులు విశ్వసిస్తారు. కొరవ జాతి వారు ఈ చెట్టు క్రిందనే ధర్తీ మాత [నేల తల్లి] గుడిని నిలుపుకొంటారు. చెట్లు ప్రీతి కోసం జంతు బలులు కూడా వేస్తారు.

సింధు లోయ నాగరికత తరువాత మౌర్యుల కాలంలోనే మనకు రూప శిల్పాలు లభ్యమవుతున్నాయి. ఆనాడు యక్ష పూజలు కూడా ఉండేవి. కనుక బౌద్ధ శిల్పాలలో యక్షిణీ యక్ష రూప శిల్పాలు ప్రవేశించాయి. తొలి దశలోని యక్ష ప్రతిమలు స్తబ్ధుల్లాగా కనబడతాయి. స్త్రీ సహజమైన లావణ్యం కనబడదు. స్థూలకాయులు గుర్తుకొస్తారు.

ఇవి శిలా ప్రతిమలైనప్పటికీ దారు శిల్పాలను అంటే కర్ర మీద చెక్కిన బొమ్మలను పోలి ఉంటాయి. శుంగ రాజుల కాలంలోని బార్హూత్ స్థూపంలోని శిలా ప్రతిమలలో జీవ చైతన్యం కనబడుతుంది.

శ్రావస్తిలో ప్రఖ్యాతమైన జేతవన బౌద్ధ గాథను బార్హూత్ శిల్పాలలో చిత్రించారు. ఆ వనంలోని మామిడి చెట్లూ, చైత్యాలూ, బండెడు బంగారు నాణాలను గుమ్మరిస్తున్న అనాధ పిండకుని రూపం చెక్కారు. పెద్ద పరిమాణంలో ముప్పై యక్ష యక్షిణీ నాగరాజు దేవతా ప్రతిమలు కూడా ఉన్నాయి. ఉత్తర తోరణం వద్ద కుబేరుని శిల్పముంది. కుబేరుడు యక్షుల ప్రభువు. ఋగ్వేదంలోని ఇంద్రుణ్ణి ఎలాగైతే దీర్ఘకాయునిగా సురాపాన ప్రియునిగా వర్ణించారో అలాగే బౌద్ధ శిల్పాలలో కుబేరుడి రూపాన్ని చిత్రించారు.

యమునా నదీ తీరాన ఉన్న ప్రాచీనపురం మధురా నగరంలో చాలా శిల్పాలు లభించాయి. 1836లో కర్నల్ స్టాసీ, తరువాత డాక్టర్ వోగెల్ గుర్తించిన కుబేర రూప శిల్పాలలో అతను తప్ప తాగిన మైకంలో ఉన్న వ్యక్తిలాగా కనబడతాడు. ఒక రూప శిల్పంలో కుబేరుడు మొరటువాడిగా, రమారమీ నగ్నంగా మఠం వేసుకుని కూర్చుని, కుడి చేతిలో పాన పాత్ర; ఎడమ చేతిలో పొడుగాటి డబ్బుల సంచీ పట్టుకుని కనబడతాడు.(చిత్రం 25) కుడి చేతిలో పక్క నిలుచున్న పరిచారిక పాన పాత్రను నింపడం చూడవచ్చు. కుషాణ యుగంలో కుబేర రూప శిల్పాలు కొల్లలుగా లభిస్తున్నాయి.



చిత్రం 25. మధుర మ్యూజియంలో కుబేర శిల్పం

ృ బౌద్ధ శిల్పాలలోనే కాక మధురానగరిలోని జైన శిల్పాలలో కూడా
ారు. (చిత్రం 26) ఈ స్త్రీ రూపాలు బౌద్ధ పైన ఏ రకమైన
'నే ఉంటాయి. మొల చుట్టూ ఆభరణాలు కొద్దిగా ఉన్నా యోని (
తుంది. (చూ... చిత్రాలు 27, 28) ఏ మతంలోని యక్షిణే అయినా
పట్టుకొనడమో, అనుకుని కాళ్ళతో వాటేసుకోవడమో చేస్తూ ఉం
లు అందరూ ఒక మరుగుజ్జు మీద నిలబడి ఉంటారు. యక్షు
ు నర వాహనుడు కాబట్టి యక్షిణులు కూడా నర వాహన రూపు
ో గుర్తింపునకు వీలుగా కనబడుతారు.



చిత్రం 26. జైన స్తూపం

దేవాలయ సామ్యాలయిన బౌద్ధుల ఆరామాలు, జైనుల బసదు
ులు కదా. ఇక్కడ తాగుబోతు కుబేర రూప శిల్పాలూ, చెట్లను



చిత్రం 27. జైన స్తంభం మీద యక్షిణి



చిత్రం 28. యక్షిణి (సాల భంజిక )

దిసమొల యక్షిణుల ప్రతిమా చిత్రాలు ఎందుకున్నాయి? ఇవి గుడిలో సెక్సు పనికి సంకేతాలు. ఇక్కడ కుబేరుడే కాక యక్షులలో ఆడ, మగా కలిసి మద్యపానం చేస్తున్న శిల్పకపాలాలు మధురా నగరిలో లభించాయి. కర్నల్ స్టాసీ గుర్తించిన ఒక చతురస్రపు రాతి పలక మీద రెండు జంటలు కనబడతాయి. ఈ నలుగురూ మధుపానాసక్తులు. మొదటి జంటలోని యక్షిణి విరబూచిన అశోక వృక్షం కింద నిలుచుని ఉంది. ఆమె చెలికాడు స్థూలకాయుడు. బాగా తాగి ఉన్నాడు. తన ఎడమ చేతిని ఆమె నడుము చుట్టూ వేశాడు. ఆమె అతని కుడి చేతిని గట్టిగా పట్టుకుని అతను మైకంలో ఉన్నందున కింద పడిపోకుండా ఆసరా అయింది. కల్లు కుండలు నేల మీద పడి ఉన్నాయి. రెండవ జంట ఏమీ పట్టించుకోనట్టే కనబడతారు.

ఈ రాతి పలక మరో పక్క కూడా మధుపాన గోష్టి శిల్పమే ఉంది. ఇందులో అయిదుగురు వ్యక్తులున్నారు. ఈ శిల్పాలను గుర్తించిన తెల్ల దొరలు తమకు తెలిసిన గ్రీకు పురాణ కథలలోని బాఖస్ అనే దేవుడు, తాగుబోతుల దేవర కనుక, ఈ శిల్పాలను బఖలానియన్ శిల్పాలన్నారు. ఈ కపాట చిత్రాలలో "స్త్రీలు మద్యం సేవించి కాముక చేష్టలు ప్రదర్శించే విషయాలున్నాయి. స్త్రీలు మద్యం సేవించడం భారతీయేతర సంప్రదాయము. ఈ రకపు చెక్కడాలను అనతి కాలంలోనే విసర్జించడం జరిగింది." అంటూ పురావస్తు శాస్త్రం పాఠ్య గ్రంథాలు విద్యార్థులకు ఉపదేశం చేస్తున్నాయి.[2]

దేవాలయ సదృశ్యమైన బౌద్ధ, జైన స్థూపాల వద్ద లభ్యమైన యక్ష కన్యల శిల్పాలు

ఒక ప్రాచీన విశ్వాసాన్ని ప్రదర్శిస్తున్నాయి.

పైరులుగానీ, ఫలవృక్షాలుగానీ పండాలంటే ప్రకృతికి మానవులు కూడా తోడ్పడా లనే నమ్మకం సనాతనులకు అన్ని దేశాలలోనూ ఉండేది. నేల తల్లినీ, నింగి తండ్రినీ సృష్టి కార్యం చేయమని ప్రోత్సహించే పనులను ప్రాకృత జనులందరూ చేసేవారు. వృక్షాలు అకాలంలో పుష్పించాలంటే కొన్ని దోహద క్రియలు చేయాలని పూర్వుల విశ్వాసం. వృక్షాలకూ, యక్షులకూ సంబంధాలు ఉన్నాయని కూడా నమ్మేవారు.

కాళిదాసు గుప్త రాజుల కాలం నాటివాడు. ఆ కవికులగురువు రచించిన కావ్యాలలో, మేఘసందేశంలో ఎంత చక్కని కవిత్వముందో అంత చక్కని సమకాలిక జీవిత చిత్రణ కూడా ఉంది. ప్రవాసంలో ఉన్న ఒక యక్షుడు అలకాపురంలో ఉన్న తన ప్రియురాలికి ఒక మేఘం ద్వారా సందేశం పంపడమే ఈ రమణీయ కావ్య ప్రయోజనమైనా అడుగడుగునా ఆనాటి ఆచార వ్యవహారాలను కాళిదాసు ఇందులో కవితామయం చేశాడు. అలకానగరంలో తన గృహం వద్ద వున్న క్రీడా పర్వతం మీద చెట్లను యక్షుడు ఇలా వర్ణించాడు.

*రక్తాశోకశ్చల కిసలయః కేసరశ్చాత్రకాంతః*
*ప్రత్యాసన్నౌ కురవకవృతేర్మాధవీ మండపస్య*
*ఏకః సఖ్యాస్తవ సహ మయా వామపాదాభిలాషీ*
*కాంక్షత్యన్యో వదనమదిరాం దోహదచ్ఛద్మనాస్యాః* (ఉత్తర మేఘం – 17)

"ఆ క్రీడా పర్వతం పైన పూచిన గురివింద తీగెల పందిరి ఉంది. దాని చుట్టూ గోరింటలు కంచెలుగా ఉన్నాయి. ఆ పందిరి ఎదుట ఒక రక్తా శోకమూ, ఒక వకుళం ఉన్నాయి. అందులో అశోకం నాతో కూడిన ప్రియురాలి ఎడమ కాలి తాపును వాంఛిస్తుంది. రెండవది నా ప్రియురాలి పుక్కిటి మద్యాన్ని కోరుతుంది. " ఇది ఈ శ్లోకానికి అర్థం. దీనికి మల్లినాథ సూరి వ్యాఖ్యానం రాస్తూ కొన్ని దోహద క్రియలను వివరించాడు. గ్రంథాంతరాలలో మరికొన్ని భోగట్టాలున్నాయి.

కాలికి పారాణి పెట్టుకుని, నగ ధరించిన స్త్రీ పెనిమిటితో కూడా తన ఎడమ కాలితో ఒక తావు తంతే అశోక వృక్షం అకాలంలో పుష్పిస్తుందట. యౌవనవతి మద్యం తాగి దానిని పుక్కిట పట్టి పొగడ చెట్టు మీద ఉమ్మితే ఆ చెట్టు ఋతువుగాని ఋతువులో సైతం పూలు పూస్తుందట. కాళిదాసు ఈ రెండింటి గురించి ఈ శ్లోకంలో చెప్పాడు.

దోహద క్రియ చేయవలసిన చెట్లు కొన్ని మన సాహిత్యంలో కనబడుతున్నాయి. ఏ చెట్టుకు ఏ దోహదం అవసరమో ఇలా చెప్పారు.

| | | |
|---|---|---|
| అశోకం | – | పాద తాడనం |
| కొండగోగు | – | సల్లాపం లేక పురోసర్తనం |
| గోరంట | – | ఆలింగనం |
| పొగడ | – | ముఖసీధువు మద్యగండూషము |
| బొట్టుగ | – | వీక్షణం |

మందారం - నర్మవాక్యం
మామిడి - కరస్పర్శనం
మోరటి - గానం
వావిలి - ఊర్పు
సంపెంగ - ముఖరాగం
సురపొన్న - నవ్వు

భారతదేశంలో ఎన్నో వృక్షాలుండగా పై పదకొండు చెట్లనే దోహద క్రియలకు ఎందుకు ఎంచుకున్నారు? లోతుకు వెళ్ళి పరిశోధిస్తే కొన్ని వృక్షాలకూ, ఆడవారి అవసరాలకూ గల సంబంధం స్పష్టమవుతుంది. అకారాదిగా భోగట్టాలు తెలిసిన చెట్ల సంగతి తెలియపరుస్తాను.

**అశోకం:** సంస్కృతంలో ఈ చెట్టును సప్తవర్ణ అని కూడా పిలుస్తారు. తెలుగులో దీనినే ఏడాకుల పొన్న అంటారు. కొన్ని ప్రాంతాలలో ఏడాకుల అరటి అని కూడా వ్యవహరిస్తారు. దీని కొమ్మలు బూరుగ [శాల్మలీ] ఆకులలాగా ఉండి కొమ్మకు ఏడేసి ఉంటాయి. ఇది పెద్ద వృక్షంలా పెరుగుతుంది. విస్తారంగా పుష్పిస్తుంది. ఈ చెట్టు పట్ట ఆడవారి కుసుమ రోగం, ఋతుస్రావ దోషాలను హరిస్తుంది. అశోక వృక్షాన్ని చెలికానితో కలిసి ఉన్న యువతి పారాణి కాళ్ళతో తంతే పుష్పిస్తుందని విశ్వాసం.

**కొండగోగు:** దీనికి కర్ణికారము, కర్ణికా ద్రుమం అనే పేర్లు కూడా ఉన్నాయి. దీని కషాయం, ఆకుల రసం, వేర్ల రసం రక్త దోషాలను నివారిస్తాయి. పడుచులు ఈ చెట్ల దగ్గర నిలబడి నర్తనం చేస్తూ నల్లాపమాడితే ఇవి పుష్పిస్తాయట.

**గోరంట:** మన దేశంలోనే కాక ప్రాచీన ఈజిప్టు దేశంలో కూడా ఈ చెట్టు ప్రసిద్ధమే. ఈ వృక్ష జాతిలో శ్రేష్టమైనదొకటి ఉంది. దాని పువ్వులు చక్కని సువాసనతో ఉంటాయి. గోరింటాకు చర్మ రోగ నివారిణి పుప్పి గోళ్ళు పోయి, గోళ్ళు బలంగా పెరుగుతాయి. తల వెంట్రుకలు దృఢమవుతాయి. ఈ చెట్టుకు దోహద క్రియ ఆలింగనం.

**పొగడ:** దీనిని మధు పుష్పం, వకుళం అని కూడా పిలుస్తారు. పొగడ పువ్వులు చక్కని పరిమళం గలవి. వైద్యంలో ఎన్నో రకాలుగా పూవుల చూర్ణం, పొగడ పండు, పప్పు తీసేసిన పొగడ గింజలూ, పొగడ చెక్క పనికివస్తాయి. పొగడ చెక్క చూర్ణం స్త్రీకి లోనికి ఇస్తే స్త్రీల వంధ్యత్వ దోషం నివారణమై సంతానం కలుగుతుందని నమ్మకం. వయసులో ఉన్న వనిత మధువు తాగి పుక్కిట పట్టుకుని దాన్ని పొగడ చెట్టు మీద ఉమ్మితే ఈ చెట్టు పుష్పిస్తుందని పూర్వులు విశ్వసించారు. ఈ దోహద క్రియను ముఖ సీధువు, మద్యగండూషము అంటారు.

**బొట్టుగ:** ఈ చెట్టునే తిలకము అని కూడా పిలుస్తారు. తిలలంటే నువ్వులు, నువ్వు పువ్వును స్త్రీ ముక్కుతో పోలుస్తారు. నువ్వు పూల రసము వాత దోషాన్ని హరిస్తుంది. నువ్వులు, నువ్వుల పప్పు, నూనె మొదలైనవి స్త్రీల ఋతు రక్తాని చక్కగా వెడలిస్తాయి. శరీరాన్ని బిగదీసి ఆరోగ్యాన్ని కలిగిస్తాయి. కొంచెం మేహాన్ని

ఉద్రేకింపచేస్తాయి. యౌవనంలో ఉన్న ఆడది కళ్ళారా చూస్తేనే చాలు టొట్టుగ పండుతుంది. ఈ దోహద క్రియను వీక్షణం అంటారు.

మందారం: దోహద వృక్షాల జాబితాలో దీన్ని అందరూ చేర్చలేదు. మేఘసందేశ వ్యాఖ్యలో మల్లినాథ సూరి "మందారో నర్మ వాక్యాత్"అన్నాడు. తెలుగులో ఈ వృక్షాన్ని దాసాని చెట్టు అంటారు మందారాల్లో లెక్కలేనన్ని జాతులున్నాయి. ఈ పూల రసంతో సగభాగం నూనె కలిపి రాసుకుంటే శిరోజాలు నల్లబడతాయి. ఈ పూలను నేతితో వేయించి లోనికిస్తే స్త్రీల ఋతు రక్తస్రావం కడుతుందనీ, ప్రతిరోజూ పొద్దున్న ఒకటి, రెండు పూలు తింటే కన్యలు ఋతుమతులవుతారనీ వైద్య విశ్వాసం. నర్మవాక్యాలు అంటే సరదాగా పరాచికాలు మాట్లాడితే మందారం పుష్పిస్తుందట.

మామిడి: మామిడిని సంస్కృతంలో ఆమ్రం, చూతం, పికరాగం అని పిలుస్తారు. మామిళ్ళలో ఎన్నో రకాలున్నాయి. మామిడాకులు శుభకార్యాలలో తోరణాలుగా కడ తారు. మామిడి కర్ర గృహ నిర్మాణంలో గృహ పరికరాల తయారీలో ఉపయోగిస్తారు. మామిడి చిగుళ్ళు లేక ఆకుల కషాయానికి వైద్య ప్రయోజనాలున్నాయి. చెక్క రసం, కషాయం, చూర్ణం స్త్రీల అధిక రక్తస్రావాన్ని కట్టి, కుసుమ రోగాన్ని నివారిస్తుంటాయి. వీర్యాన్ని గట్టిపడేలా చేయడమే కాకుండా ఇంద్రియ నష్టం, శీఘ్ర స్ఖలనాలను నివారించడానికి వడపిందెలుమందట. మామిడికి దోహద క్రియ కరస్పర్శనం.

మోరటి: ఈ చెట్టుకు ప్రేంకణం, ప్రియాళువు అనే పేర్లున్నాయి. ఇది పొన్న చెట్టు జాతికి సంబంధించినది. దీనినే పున్నాగం అని కూడా పిలుస్తారు. ఇది మేహ వాతానికి మందు. ఈ చెట్టుకు గానం దోహద క్రియ. సురపొన్నకు నవ్వు దోహద క్రియ.

వావిలి: దీనికి సింధువారమని కూడా పేరుంది. తెల్ల వావిలికి శాఫాలీ అని, నల్లవావిలికి ఇంద్రాణి అనే పేర్లున్నాయి. వావిలి ఆకు వేసి కాచిన నీళ్ళతో పురిటాలుకు స్నానం చేయిస్తారు. ఈ చెట్టు దగ్గర నిలబడి యువతులు ఊద్పు ఊద్చటమే దోహద క్రియ.

సంపెంగ: సంపెంగలలో తొమ్మిది జాతిభేదాలున్నాయి. వాటిని నవ చంపకాలంటారు. పూవులలో కూడా వివిధ పరిమళాలు ఉంటాయి. ఇవి మానవుల అలంకారాలకే కాని పూజకు పనికిరావు. ఇవి విషాన్ని హరిస్తాయి. సంపెంగకు ముఖరాగం దోహద క్రియ.

ఈ దోహద వృక్షాల భోగట్టాలు పరిశీలిస్తే వీటిలో అధిక భాగం స్త్రీల ఋతు రక్త సంబంధులని తేలుతుంది. కన్యలు సమర్తాడడానికి, అధిక ఋతురక్తస్రానం కట్టడానికి ఈ చెట్లు ఉపయోగపడతాయి. అందుకే వీటిని అకాలంలో పుష్పింపచేయడానికి యక్షకాంతలు గుడిలాంటి పవిత్ర వనాలలో ప్రయత్నిస్తారు. వీటిని దోహ క్రియలనడంలో కూడా కొంత ఔచిత్యం ఉంది. దోహదపదాలకు అర్థం చూడండి.

దోహదము – గర్భిణ్యాభిలాష, వేవిళ్ళు, ఎరువు, గర్భము, చూలు, గర్భలక్షణము,

ఇచ్చు, లాలన, తీవ్రేచ్చ.

దోహద లక్షణము -. గర్భ చిహ్నము, యౌవన సంధి.

దోహదవతి – వేవిళ్ళు గల ఆడది.

చెట్లను పుష్పింపచేయడం వల్ల వాటిలాగే తాము కూడా పుష్పవతులవుదామని స్త్రీలు వాంఛిస్తున్నారని చెప్పాలి. పుష్కరిణి వద్ద అప్సరసలు ఎలాగైతే బిడ్డ పుట్టేదాకా పరిమిత కాల భర్తలతో జతకడతారో, అలాగే యక్షకాంతలు కూడా బౌద్ధారామాలలో, జైన బసదులలో సెక్సు కార్యానికి ప్రోత్సాహం చూపుతున్నారని మొత్తం మీద తేలుతుంది.

# వామాచారం - వజ్రయానం

వ్యావసాయికమైన ఉత్పత్తి మీద ముఖ్యంగా ఆధారపడిన ఆర్థిక విధానం గల సమాజంలో వృక్ష దేవతలకు ప్రాముఖ్యం ఉంటుంది. ఆదిమ సమాజాలలో చెట్లకూ, ఆడ వారికి గల సామ్యాలను జనులు గుర్తించారు. చేలు పండటానికీ, స్త్రీల కడుపుపంట పండటానికీ లంకె ఉందని భావించారు. ప్రపంచం మొత్తం మీద వివిధ జాతుల ఆదిమ విశ్వాసాలలో ఋతుస్రావం మొదట పవిత్రమైనదయింది. తరువాత మైలగా మారింది. గర్భధారణకు కారణాలేమిటో క్రమేణా బోధపడసాగాయి.

కొండ గుహలలో గణాలు జీవించేటప్పుడు అవే తమ మంత్ర చర్యలకు తావుల యినప్పుడు మాతృమూర్తుల మట్టి బొమ్మలను చేయడం, వాటి ద్వారా ప్రకృతిని



చిత్రం 29. ఆస్ట్రియా దేశం



చిత్రం 30. ఫ్రాంసు దేశం

(దంతపు బొమ్మ)

చిత్రం 29. 30. 31. 32. మాతృ దేవతల ప్రతిమలు



చిత్రం 31. ఆస్ట్రియా లోనిదే



చిత్రం 32 నెలలు లెక్కించుకొనే చూలాలు.

చేతిలో నెలవంక వుంది

శాసించడం జరిగింది. మాతృత్వానికి స్తనాలు చిహ్నమని భావించి కొన్ని బొమ్మలలో మాతృదేవతను బహుళ స్తనిగా రూపొందించారు. బలిసిన పిర్రలూ, పెద్ద బొమ్ములూ నిండు చూలు చిహ్నాలయినప్పుడు ఆ బొమ్మలు చేసి ఆరాధించారు. ప్రపంచంలోని అత్యంత ప్రాచీనమైన కొండ గుహలలో ఈ విగ్రహాలు దొరికాయి. [చిత్రాలు... నెం. 29, 30, 31, 32] సింధు నాగరికత పూర్తిగా వ్యవసాయం పైనే ఆధారపడినదే కనుక అక్కడ కూడా మాతృ దేవతల పూజలున్నాయి. స్త్రీలే పూజారిణులు [చూడుడు చిత్రం...నెం.5]

భారతదేశంలో సింధు నాగరికత రోజుల నుంచీ వామాచారం సంప్రదాయంగా వస్తూనే ఉంది "వామ"అనే పదానికి స్త్రీ, ఆడది, సౌందర్యవతియైన స్త్రీ, గౌరి, లక్ష్మి, సరస్వతి అనే అర్థాలను ఏ నిఘంటువయినా చెపుతుంది. వామాచారం అంటే స్త్రీల ఆచారం అనే సంగతి స్పష్టమైనదే. వ్యావసాయికంగా స్త్రీలు పాటించే ఆదిమ మంత్ర చర్యలు వామాచారంగా చలామణి అయ్యాయి. వర్ణాశ్రమ ధర్మాలూ, వర్గ విభజన వచ్చాక వ్యవసాయం చేసేది ముఖ్యంగా శూద్రులయ్యారు. వారిలోనూ స్త్రీలకే సేద్యంలోని నాట్లు, కలుపుతీయడం, కోతలు మొదలైన కార్యాలు ఆచార రీత్యా తప్పనిసరి అయ్యాయి. పురుషాధిక్యత పెరుగుతున్న సమాజంలో కూడా వ్యవసాయ కర్మలలో మాతృస్వామ్య సమాజాలలోని వామాచార విధులు పాటించేవారు. ఆది సమాజాలలోని అన్నపానాదులలో మత్స్యం, మాంసం, ముద్ర [వేపుడు గింజలు]మద్యం ముఖ్యమైనవి. సమాజంలో ప్రజోత్పత్తికి మైథునం అవసరం. ఈ అయిదింటినీ ఏ ప్రాకృత సమాజంలోని జనులూ విస్మరించలేరు. విసర్జించలేదు. మత్స్యం, మాంసం, ముద్ర, మద్యం, మైథునం అనే ఈ అయిదూ "మ"కార గుణింతం నుంచి వచ్చి మాటలే. అందుచేత ఈ అయిదింటినీ పంచ "మ"కారాలన్నారు. ఇవి వామాచారంలో ముఖ్యాంగాలు.

సింధు నాగరికత యుగాలలోగాని, తరువాత వచ్చిన ఋగ్వేద ఆర్యుల జీవితా లలోగాని, అనేకానేక భారతీయ గణ సంఘాలలోగానీ వ్యక్తిగత ఆస్తులు వచ్చాకనే పట్టింపులు ప్రారంభమయ్యాయి. ఆదిమ సమాజాలలో వ్యక్తిగత ఆస్తులు లేనట్టే – వ్యక్తిగతమైన రహస్యాలు లేవు. ఏది చేసినా మరుగు, చాటుమాటు అనేవి ఉండేవి కావు. అన్ని చర్యలూ ఉమ్మడిగా, బహిరంగంగా బట్టబయలుగా చేసేవారు. సమాజానికి పనికివచ్చేదంతా సభ్యమైనది. అశ్లీలత, బూతు అనేవి లేవు. బూతు వల్ల ఉత్పత్తి పెరిగితే అది కాంక్షణీయమే. కళ్ళు మూసుకోవలసిన పనిలేదు.

ఉన్నత వర్గాలూ, నిమ్న వర్గాలూ ఏర్పడ్డాక కాయకష్టం చేయడం హేయమైన కార్యంగా కలవాళ్ళు భావించడం మొదలు పెట్టాక మంచి చెడ్డల గురించి మర్యాద మప్పితాలు వచ్చాయి. ఉత్పత్తి పనులన్నీ నిమ్న వర్గాల వారే చేసేవారు. వాళ్ళల్లో కూడా అంటదగ్గ హీనులు, అంటరాని హీనులు ఏర్పడ్డారు. వ్యావసాయకమైన ఉత్పత్తి సఫలత చెందటానికి ఆదిమ వామాచారాలను నిమ్న కులాల స్త్రీలు పాటించేవారు. అందుకే ఆ సంఘంలో డొంబి, సవరి, చండాలి, మాతంగి, రజకి మొదలైన వారు ముఖ్యులు. శూద్ర స్త్రీ లందరూ ఉత్పత్తి చర్యలలో పాల్గొనేవారు.

చిత్రం 33. చిత్రం 34. మొహంజదారోలో మాతృదేవత పూజారిణి



వర్గ భేదాలు ఏర్పడ్డాక తారతమ్యాలు, అసమానతలు చూసి రోసి కొందరు జ్ఞానసాధనకు శ్రమణులయ్యారు. శ్రమపడే వారిని శ్రమణులంటారు. అయితే వీరు శారీరకమైన శ్రమపడి ఉత్పత్తి చేయరు. శరీరాన్ని శుష్కింపచేసి మానసిక శ్రమపడతారు. వీరిలో ఆత్మవాదులు అనాత్మవాదులూ ఉన్నారు. అక్రియావాదులు పాప పుణ్యాలు లేవంటారు. ఏది చేసినా పాపమన్నది అంటదంటారు. నియతివాదులు

పవిత్రతకు, అపవిత్రతకు హేతువులు లేవంటారు. ఉచ్ఛేదవాదులు యజ్ఞయాగాదుల ఫలముగాని, పరిణామముగాని హాళక్కి అంటారు. విక్షేపవాదులు స్వర్గ, నరకాలు ఉన్నాయో లేదో తెలియనివంటారు. నాస్తిక వాదులు అగ్ని హోత్రాదులు బుద్ధిలేని వాళ్ళకు ఉపజీవికలని నిరసిస్తారు. లోకాయితులు వీరి నుంచే వచ్చారు. జైనులు, బౌద్ధులు సరేసరి. సంసారాన్ని రోసి బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ జనపదాలకు దూరంగా వెళ్ళిపోయారు. భిక్షపైన బ్రతుకుతారు.

ద్రావిడ దేశాలలో సాధకులు ఊరవతల శ్మశానాలలో భూత, ప్రేత, పిశాచ, శాకినీ, ఢాకినుల మధ్య బతకసాగారు. వీరికి లకులము అనే గద లేక దండం ముఖ్యం. వీరిని లకులీశపాశుపతులంటారు. ఈ శైవులలో విభిన్న మార్గాల వాళ్ళున్నారు. కాపాలికులు, కాలముఖులు ప్రబలులయ్యారు. శ్మశానాలలో నివసించడమే కాక మనుష్యుల పుర్రెలలో మద్యమాంసాలు సేవిస్తారు. అందుకే వీరిని కాపాలికులన్నారు. కాటి బూడిదను ఒళ్ళంతా పూసుకుంటారు. పుర్రెల దండలు ధరిస్తారు. నరబలులు ఇస్తారు. శవసాధన చేస్తారు.

కాపాలికులిలాగే కాలాముఖులు కూడా కపాలాలలోనే అన్నం భుజిస్తారు. మద్యం సేవిస్తారు. భస్మం పూసుకుంటారు. అట్టలు కట్టిన జుట్టును పెంచుకుంటారు. రుద్రాక్షమాలలు ధరిస్తారు. దీక్ష తీసుకున్న తరువాత జాతి భేదాలు పాటించరు. పంచమకారాలను పాటిస్తారు.

శైవులేకాక శాక్తేయులు కూడా బీభత్సదాయకమైన మార్గాలను ఆచరిస్తారు. స్త్రీకి ప్రాముఖ్యముంటుంది. వీరు భగమును లత అంటారు. లతా సాధన, యోని అభిషేకము మొదలైన విధులను పూజావిధానాలుగా స్వీకరించారు. పంచ మకారాలు వీరికి ముఖ్యం.

గాణాపత్యమనే మరొక మతముంది. ఉచ్ఛిష్ట గణపతిని కొలిచే ఈ శాఖలో కూడా పంచ మకారాలున్నాయి.

ఆదిమ వామాచారాలు పల్లిగ్గా వ్యావసాయిక మంత్ర చర్యల రూపంలో ఉత్పత్తి కోసం జరిగితే కాపాలిక, కాలాముఖ , శాక్త గాణాపత్యాలు గుప్త విద్యలై చాటుమాటున జరిగేవయ్యాయి. గురువే వీటిని బోధించాలి. రహస్యం ముఖ్యమైంది. వీరి భయానక చర్యలు సామాన్య ప్రజలకు భీతావహాలయి, వీరు భయంకరలయ్యారు. వీరి వంటి వారు ఇతర పంథాలను అనుసరించారు.

అహింస, బ్రహ్మచర్యం పాటించే బౌద్ధంలోనికి కూడా భోగాలాలసత ప్రవేశించింది. మహాయాన మతంతో మహదైశ్వర్యాలను పొందిన వారు వామాచారంలోని పంచ మకారాలను మాత్రమే స్వీకరించారు. వ్యావసాయిక కాయకష్టం మాత్రం చేయరు. వీరి మార్గం వజ్రయానమయింది. శాక్తంలోని లింగాన్ని వీరు వజ్రం లేక మణి అంటారు. శాక్తంలోని యోనిని వీరు పద్మం అంటారు. “ఓం ! మణి పద్మోహం” అన్నిది వీరి మంత్రమైంది. బౌద్ధులలో స్త్రీ, పురుషులు విచ్చలవిడిగా సంచరించసాగారు. బౌద్ధ విహారాలను అందుకే లంజల దిబ్బ లంటారు.

బౌద్ధుల గుహాలయాలలో, చైత్యాలలో, స్థూపాల ప్రదక్షిణ క్రమాల దగ్గర చెక్కే

శిల్పాలలో సూచన ప్రాయంగా సెక్సును ధ్వనించే మిథున శిల్పాలు, యక్ష శిల్పాల స్థానంలో ఆలింగనం చేసుకునే మిథునాలు, మద్యపాన దృశ్యాలు మొదలైనవి వచ్చి చేరాయి. చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళై వాళ్ళకు గుడులు ఏర్పడినప్పుడు శిల్పాలు లేవు. కాని రాజులు పెద్ద ఆలయాలు నిర్మించడం మొదలు పెట్టాక పురాణ ఇతిహాసాలలోని వివిధ దేవతల కథల మధ్య కామ శిల్పాలు కూడా చోటు చేసుకున్నాయి. సంస్కృత కావ్యాలలో సంభోగ వర్ణనలు ఎటువంటి స్థానాన్ని ఆక్రమించాయో దేవాలయ శిల్పాలలో కామ దృశ్యాలు చిత్రీకరణ కూడా అలాంటి ప్రాముఖ్యాన్ని పొందింది.

దేవాలయాలలో బూతు బొమ్మలు ఎందుకు? అన్న ప్రశ్నకు సంప్రదాయవాదులు కూడా ఎనిమిది సాకులు, సంజాయిషీలు ఇస్తారు.

1. ఓంకారంలో ఎలాగైతే సంయోగాన్ని చూడాలో అలాగే ఈ శిల్పాలలో ప్రకృతి పురుష శక్తుల సంయోగాన్ని దైవత్వంలో ఏకత్వాన్ని చూడాలి.
2. ఆధ్యాత్మిక సచ్చిదానందాన్ని ఐహిక చిహ్నాలతో ఈ శిల్పాలు సూచిస్తాయి.
3. భక్తులలోని విషయ వాంఛలను ఈ మిథునాలు రేకెత్తించి వాటిని అధిగమించడానికి తోడ్పడతాయి.
4. ఈ శిల్పాలు ఐహిక జీవితంలోని నృత్య, గీత, అలంకరణాది దృశ్యాలను చిత్రించడంతో పాటు మానవ వ్యాపారాలలో భాగమైన శరీర సుఖాన్ని కూడా తెలియచేస్తాయి. కళ దేనినీ విస్మరించదు, విసర్జించదు.
5. దృష్టి దోషాల నుంచీ, పిడుగుపాటు నుంచీ ఈ శిల్పాలు దేవాలయాలను రక్షిస్తాయి.
6. విషయ వాంఛాసక్తులను సైతం ఈ చిత్రాలు గుడికి రప్పిస్తాయి. ఆలయానికి ఏ మిష మీద వచ్చినా మంచిదే కదా!
7. ఈ మిథున శిల్పాలు అజ్ఞానులకు కామ శాస్త్ర శిక్షణను ప్రత్యక్ష దృశ్యాలతో ప్రబోధించి జ్ఞానవంతులను చేస్తాయి.
8. తంత్ర విద్యలలోని మంత్ర చర్యలకు ఇవి సూక్ష్మైన యోగ చిత్రీకరణలు.

ఇటువంటి సాకుల గురించి, సంజాయిషీల గురించి చాలా గ్రంథాలలో విపులమైన చర్చలు జరిగాయి. మచ్చుకు ఒక గ్రంథంలోని వివరణ పరికిద్దాం. స్టెల్లా క్రమరిష్ 'హిందూ దేవాలయం'పైన ఒక ఉద్గ్రంథం రచించింది. అందులో 'మిథున' అనే ప్రకరణం సారాంశం ఇలా ఉంది.

"......ప్రియురాలి సంపరిష్వక్తుడైన మనుజునికి బాహ్యమూ అంతరమూ ఎలాగైతే తెలియవో అలాగే ప్రాజ్ఞాత్మ తో లీనమైన పురుషునికి బాహ్యాంతరాలు తెలియవు. అప్పుడే పురుషుడు ఆప్తకాముడు, ఆత్మకాముడు, అకాముడు, శోక శూన్య స్వరూపుడు. బృహదారణ్యకోపనిషత్(4–3–21) గాఢ పరిష్వంగంలోని మిథున సంగమం మోక్షానికి ప్రతీక. ఈ సంకేతాన్ని గర్భ గృహద్వార బంధశాఖలపైనా, ఆలయకుడ్యాలపైనా అందుకే చిత్రించాలి."

"......ప్రకృతి లేకుండా పురుషుడు ఏకాకిగా రతిని అనుభవించలేడు. అందుకే

ద్వితీయాన్ని కోరుకున్నాడు. (సవై నైవరేమే తస్మాదేకాకీ నమ రతే సద్వితీయ మైచ్ఛత్) ఏ ప్రకారంగా లోకంలో స్త్రీ పురుషులు సంపరిష్వక్తులవుతారో అలాగ తననే రెండు విధాలుగా పురుషుడు చేసుకొన్నాడు కనుకనే పతిపత్నులు సంభవించారు. తన నుండి వచ్చిన స్త్రీతో పురుషుడు సంభోగించాడు. (సమ భవత్) కాబట్టి మానవులు ప్రభవించారు. (బృహదారణ్యకోపనిషత్ 1-4-3)"

".....పరమాత్మ నుండి వియోగం చెందిన సాధకుడు అతనిలో లీనమవడాన్ని వాంఛిస్తాడు. మనో వాక్కాయ కర్మలతో యోగి బ్రహ్మజ్ఞాన లబ్ధి కోసం ప్రక్రియలు సల్పుతాడు. సన్యాసులలో వివిధ వర్గాల వారు ఉంటారు. కింది తరగతి సన్యాసులు మాత్రమే శక్తి సహాయంతో శారీరక యోగం సాధించాలి. (అత్యున్నత తరగతి లోని అవధూతకు మాత్రమే మోక్షమార్గంగా స్త్రీ సంభోగం అనవసరం) ఈ సంయోగాన్ని లతా సాధన అంటారు. శివ సంహిత (పుట 45) ప్రాణతోషిణి (పుట 618), గంధర్వ తంత్ర (పుట 60) కులావళి (పుట 20) మొదలైన తాంత్రిక గ్రంథాలు లతా సాధనను వివరిస్తాయి. మామిడి చెట్టును మాధవీలత పెనవేసుకున్నట్లు శక్తి శివుణ్ణి ఆలింగనం చేసుకొంటుంది. దేవతలను సన్న్యాసులను రతి క్రీడలలో అందుకే గుడి గోడలపై చిత్రించాలి."

మన దేవాలయాల క్రమ పరిణామాలను అధ్యయనం చేసిన వారికి ఈ చిత్ర రచనా విధానాలలో అంచెలు బోధపడతాయి. ఆదిలో శివ పురాణాలలోని గాథలను ముఖ్యంగా దారుకా వనంలోని భిక్షాటన మూర్తిని చిత్రించేవారు. మన్మథుణ్ణి అతని ఇద్దరు భార్యలైన రతి ప్రీతి చెరొక ప్రక్క ఉన్నట్లు చూపెట్టేవారు. భిక్షాటన మూర్తిని ఊర్ధ్వలింగునిగా చిత్రించేవారు. తరువాత తంత్రంలోని వివిధ యోగ సంభోగాలను చూపేవారు. పంచ మకారాల సారాన్ని చూపేవారు.

తంత్రం అంటే ఏమిటి? ఆదిమ వామాచారంలోని వ్యావసాయిక మంత్ర చర్యే !"తనోతి తన్యతేవా ఇతి తంత్రః"విస్తరిచు, వ్యాపించు అనే అర్థాలలో తంత్రం మొదట ప్రచారంలో ఉండేది. సంతానం, తనయ అనే పదాలలోని "తన "అనే మాటకు ఏ అర్థమో తంత్రంలోని "తన"కు కూడా అదే అర్థం. మానవ సంతానాన్ని వ్యాపింపచేయడం, వంశాన్ని విస్తరింపచేయడం అన్నవే ఆదిమ తంత్రం లక్ష్యాలు. దీనినే ప్రాచీన వామాచారం బోధించింది. పాటించింది. అయితే భయంకరమైన ఆచారాలను పాటించేవారు. ఈపంచ మకారాలను స్వీకరించి వ్యవసాయేతర మంత్ర చర్యలకు వాడుకొన్నాక "వామము"అనే మాటకు చెడు అర్థాలు వచ్చాయి.

వామము: వక్రమైనది, విపరీతమైనది, ప్రతికూలమైనది, అనుకూలము కానిది, వ్యతిరేకముగా చేయునది, వ్యతిరేక స్వభావము కలది, వక్ర బుద్ధి కలది, కుటిల స్వభావముకలది, లొంగనిది, మొండికెత్తినది, నీచమైనది, చెడ్డది.

ఈ అర్థాలన్నీ తంత్రోక్తమైన మద్య మాంసాది సేవన రూపమైన దురాచారాల వల్ల వచ్చినవని చెపుతూనే "వామము" అన్న మాటకు ఆదిలో ఉన్న "అందమైనది, ఇంపైనది"అన్న అసలు అర్థాలను కూడా నిఘంటువులు ఇవ్వక తప్పలేదు.

దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ వంటి పండితులు తంత్రం గురించి "లోకాయత"

వంటి గ్రంథాలలో చాలా విపులమైన చర్చలు చేశారు. మన దేశంలోని వామాచారం వంటిదీ, తంత్ర చర్యల వంటివీ చీనాలోని టావోయిజంలో కనబడతాయని సవిస్తరమైన ఉదాహరణలతో రుజువు చేశారు. శైవ, శాక్త, గాణాపత్యాలలోనే కాక సహజీయ వైష్ణవ మతంలో కూడా ఇవి చోటు చేసుకున్నాయి. చర్యా గీతికలలో వీటి ప్రసక్తులు ఉంటాయి.

దేవాలయాలను బృహన్నిర్మాణాలుగా రూపొందించిన వాళ్ళంతా రాజ్యాధినేతలే. వాళ్ళ మతాలూ, అభిమతాలూ, రుచులూ, అభిరుచులూ ఆ ఆయతనాలలో చోటు చేసుకున్నాయి. అసంఖ్యాకులైన శిల్పులు వీటిని మలిచారు. ఆగమ శాస్త్రాల ప్రకారం వీటిని కట్టారు. ద్రావిడ, నాగర, వేసర రీతులలో నిర్మించిన ఏ దేవాలయంలోనైనా ఉదాత్త పౌరాణిక శిల్పాలతోపాటు కామ శిల్పాలు కూడా చోటు చేసుకున్నాయి. వీటి చరిత్రను సమీక్షిస్తూ తెలుగు భాషా సమితి వారు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వం 14వ సంపుటం "లలిత కళలు"అనే సంకలనంలో ఈ మైథున చిత్రాల గురించి విపులమైన సంజాయిషీ యిచ్చారు. దానిని యథాతథంగా, సుదీర్ఘంగా ఉదహరించడం ఇక్కడ అప్రస్తుతం కాదు. చూడండి:

"అర్చా మూర్తులు కాని సామాన్య విగ్రహముల శిల్పమున శిల్పి యందలి పని తనపు ప్రతిభకు స్వచ్ఛందతయు తోడైనది. అట్టి శిల్పములు భువనేశ్వర్, పూరి, కోణార్కములందు అత్యధిక సంఖ్యలో నేడు కననగుచున్నవి. భావోద్రేకత, స్వైరవిహారము, తప్పొప్పుల నెరుగని జీవితానంద రసపిపాస, మానవ మూర్తి యందలి రమ్యత, ఐహిక భోగాపేక్ష ఇందు అల్లిబిల్లిగా పెనగొని ప్రస్ఫుటముగా రూపుగొనినవి. ముఖ్యంగా పూరి, కోణార్కములలోని మిథున చిత్రములు కొందరి విమర్శలకు గురియైనవి.

"కానీ ఒక కళా ఖండమును అర్థము చేసుకొనదలచుకునే సహృదయుడు, ఆ కళాఖండమును రూపొందచేసిన శిల్పి హృదయమును, అతని పరిసరములను, అతని సమకాలీనపు సంఘమునందలి విలువలను గుర్తెరుగుకొనవలయునను మూల నియమమును ఆ విమర్శకులు గుర్తింపకపోవుట ఒక శోచనీయమగు విషయము. అందువలన ఆ శిల్పములు రూపుగొనుటకు కారణములగు భావనను గురించి ఇటకొలదిగ చర్చించుట సముచితము.

"భారతీయ శిల్పమున – అది బౌద్ధము కానిండు, హిందువుది కానిండు – మిథునమును రూపొందించుట తొలుతటి నుండియు ఆచరితము అయినదనుట వివాదాస్పము కాని విషయము సాంచి, అమరావతి స్తూపము లందట్టి మిథునములు కానవచ్చుచున్నవి. మథుర యందును అట్టి మిథున శిల్పములు విరివిగానే యున్నవి. ఇక ఎల్లోరాలోని శివ పార్వతుల ఆలింగన రీతి యందు చక్కగా ప్రకాశితము. ప్రకృతి పురుషుల సంయోగమే సృజనకు మూలకందమను సనాతన భావమే. ఇటుల భారతీయ శిల్పమున ఎల్లెడల, అన్ని కాలములందు, ఏదియో ఒక శిల్పమున మాత్రమే కాదు, పౌరాణిక మూర్తుల రూప కల్పన మందును, వాఙ్మయమునను ఆ భావన విస్తృతముగా అలముకొనినది. అర్ధనారీశ్వర రూపము ఈ భావననే ప్రస్ఫుటీకరించును. ప్రాచీన యుగమున రచితమై, నాగరికులగు హైందవుల కెల్ల పఠనీయ గ్రంథముగా విలసిల్లుచున్న వాత్స్యాయన కామ సూత్రముల ప్రాతిపదిక ఈ భావనయే.

"అయినను బౌద్ధ శిల్పములందలి మిథునములందు కన్నను, పూరీ, కోణార్కములందలి వానిలో మైథున క్రియ, అతి బాహ్యముగా ప్రకటితమయ్యె ననుట ఎవరును కాదనరు. ఇందులకు కారణములు ఆనాటి భారతదేశమున బౌద్ధులచేతను, హిందువుల చేతను సమానముగా ఆదరితమైన తాంత్రిక భావన, తంత్ర శాస్త్రములు, శాక్తేయ మతమున ఎక్కువగా ఆదరితములగుట నిజమే అయినను, అది ఏదియో ఒక తీరున తక్కిన మతముల పైనను తమ ప్రభావమును నెరపినవి. బౌద్ధ మతమునందలి గుహ్య సమాజమున, వజ్రయానమున, హిదూ మతానుయాయుల చేత ఆదరింపబడిన నవనాథ సంప్రదాయమున మైథున క్రియకు సత్పురుషుని సాధనలో ఒక ప్రముఖ స్థానము కల్పింపబడినది. చతుర్విధ పురుషార్థములలో ఒకటిగా కామమును పరిగణించిన హిందువులను, ఆ కాలమున, దానికి అనితర ప్రాముఖ్యమును కల్పించిరి. అప్పుడు రూపొందిన సంస్కృత కావ్యములందేమి, అనంతర కాలమున వానిని అనుసరించిన తక్కిన భారతీయ భాషా ప్రబంధములందేమి, రతి బంధన వర్ణన ఒక ముఖ్యాంగముగా పరిణమించింది.

"అందువలననే శిల్పమున ఒక ప్రబంధమును నిర్మింపదలిచిన హైందవ శిల్పియందును ఈ భావన ప్రాబల్యమును ఆర్జించి, కొన్ని శిల్పములందు, అందును ముఖ్యముగా పూరీ, కోణార్కములందును మధ్య భారతములోని ఖజురాహోలోను వెలికురికినది. ఆనాటి కావ్యములందలి శృంగార కవనమును ఆస్వాదింపగలిగిన పండిత లోకమును యిట్టి శిల్పములను సైతము హృదయ సదృశములని భావించి యుండును.

"ఇంతియే కాదు, అశ్లీలత యను దానికి దేశకాలాతీతమగు కొలబద్దను దేనినీ నిర్ణయింపజాలము. ఈనాడు కొన్ని ప్రాచీన జాతుల యందే కాదు, సభ్యత యందు ఉచ్ఛతమ స్థాయికి చేరుకొనినటుల భావించు కొన్ని సంఘముల స్త్రీ వేషధారణలలో ఊర్ధ్వ భాగము అనాచ్ఛాదమై ఉండుట చక్కని సంప్రదాయముగా భావింపబడగ, కొన్ని సభ్య జాతుల వారు అట్టి వేషమును అశ్లీలముగను, అసభ్యము అని నిరసించుట కననగుచున్నది. ఇట్టి యెడ ఒక నిశ్చితమగు కొలబద్ద నిర్ణయించలేమనుట సువిదితము. కావున కోణార్కమునను, తక్కిన చోటులను కననగు మిథున శిల్పములను వాని నిర్మాణ కాలపు సాంఘిక పరిసరముల దృష్టితో అర్థము చేసుకుని వానికి రూపమొసగిన శిల్పుల ప్రతిభకు విలువలను నిర్దేశించుట మాత్రము సహృదయుల ధర్మము."(పుటలు 175–176)

ఈ సుదీర్ఘమైన ఉదాహరణ సంప్రదాయసిద్ధమైన సమర్ధన రీతులను తెలుసుకొనడానికి ఉపకరిస్తుంది. అయితే ఒక ఆచారం గాని, మంత్ర చర్యగాని ఆవిర్భవించడానికి సామాజికమైన అవసరాలుంటాయి. సాహిత్యంగాని, కళగాని, శిల్పంగాని సాంఘిక ప్రయోజన రహితంగా ఆదిలో పుట్టదు. గుడిగాని, గుడిలో సెక్సుగాని ఎలా ప్రారంభమయ్యాయో తెలుసుకొనడానికి భారత దేశంలోని ఏ దేవాలయ చరిత్రనైనా తీసుకుంటే విశదం కాకపోవచ్చు. ఒరిస్సాలోని గుళ్ళు, ఖజురాహోలోని ఆలయాలు విశ్లేషిస్తే లోతుగా వెళ్ళి పరిశీలించి సమన్వయం చేస్తే ఆదిమ కారణాలు తెలుస్తాయి.

ఉత్కళ దేశంలోని నాలుగు ముఖ్యమైన పుణ్య క్షేత్రాల్లో బృహదాలయాలున్నాయి. అవి- [1] కోణాదిత్య – [2] విరాజ – [3] ఏకామ్ర – [4] పూరి – ఇవి

వరుసగా కోణార్క్, జాజ్‌పూర్, భువనేశ్వర్, పూరీ జగన్నాధాలుగా ప్రస్తుతం ప్రసిద్ధమయ్యాయి. కోణార్క్‌లో సూర్యుడు, జాజ్‌పూర్‌లో దేవి, భువనేశ్వర్‌లో శివుడు, పూరీలో పురుషోత్తముడు ఆరాధ్య దైవాలు అయినా ఆదిలో శక్తి వామాచారం అన్నింటిలో ఉండేవి. వజ్రయానం కూడా ప్రభావితం చేసింది.

సుప్రసిద్ధ బెంగాలీ పరిశోధక పండితులు – శ్రీ పి. బందోపాధ్యాయ గారు వంగ భాషలో రచించిన తమ "రచనావళి" అనే గ్రంథంలో పూరీ జగన్నాథ దేవాలయ నిర్మాణం గురించి రాశారు. దీనికి దేవి ప్రసాద చటోపాధ్యాయ గారు "లోకాయత"అనే గ్రంథంలో స్వేచ్ఛానువాదం చేశారు.– [పుట – 336]

"బౌద్ధ తాంత్రికులు కామ వజ్రయానం అనే శాఖను ప్రారంభించారు. మానవుడు ఎలా జన్మిస్తాడో విశ్వం కూడా అలాగే జనిస్తుందని వీరి విశ్వాసం. ఈ శాఖ వారి గ్రంథాల నిండా కోకొల్లలుగా అశ్లీల వివరణలున్నాయి. కనుక వీటిని సాధారణ పాఠకుల కోసం అనువదించి ప్రచురించడం సాధ్యం కాదు. ఈ శాఖ వారి నమ్మకాల ప్రకారం కామంనుండే మానవునిలాగా విశ్వం కూడా ఉద్భవించింది. అనంత **విశ్వ కామానికీ,** మానవ కామానికీ మధ్య సుశ్రావ్య సంబంధాలు సృష్టించడానికి ఈ శాఖ వారు నిరంతర కామ సాధన కావిస్తూ ఉంటారు. నా ఉద్దేశ్యంలో పూరీ జగన్నాథ దేవాలయం ఈ కామ వజ్రయానుల ప్రభావం వల్లనే నిర్మితమైనది. పూరీ దేవాలయాన్ని విమలాదేవి స్థానంగా చెప్పుకుంటారు. ఇది కామ వజ్రయానుల పవిత్ర స్థలం. పూరీ ఆలయానికీ




చిత్రం 35. గుడి – శరీరం. ఒరిస్సాలోని ఆలయం: మానవశరీర భాగాలను అనుసరించి రేఖా దేవళముల పేర్లు ఏర్పడటం ఇందులో కనిపిస్తుంది. 1. పాభాగ (పాదం) 2. జంఘా (మోకాలు) 3. గండి (మొండెం) 4. మస్తక (తల) 5. ఖపురి (కపాలం)

శ్రీ మందిరం అనే మరో పేరు ఉంది. ఇక్కడ కాస్మిక్ విశ్వ సృష్టికీ, మానవ శరీర సృష్టికీ మధ్య పొందికను సాధించారు. ఇక్కడ కనబడే కామ శిల్పాలన్నింటిలో మగవాళ్ళంతా కామ వజ్రయానులయిన బౌద్ధ భిక్షువులే. స్త్రీలందరూ దేవదాసీలే. దేవాలయమంతా కామ వజ్రయాన సిద్ధాంతాల పైననే నిర్మితమైంది."

బందోపాధ్యాయ గారు వివరించినట్లు మానవ దేహానికీ, ఆలయ రూపానికీ ఒరిస్సాలో పోలికలు కనబడతాయి. రేఖా దేవళం చిత్రాన్ని చూస్తే ఇది స్పష్టమవుతుంది. వామాచారులు దేహవాదులు. అందుకే మానవ శరీరం లాగే గుడిని రూపొందించారు. (చిత్రం...నెం. 35) గుడికి కూడా పాద భాగము, మోకాలు, మొండెము, తల కపాలం ఉంటాయి.

నేటికీ పూరీ దేవాలయంలోని అర్చనలలో వామాచారం అంతర్లీనంగా ఉంటుంది. అమెరికా స్మిత్ కాలేజీ [నార్త్ హాంప్టన్] లో ఆంత్రపాలజీ ప్రొఫెసర్ శ్రీమతి. ఫ్రెడరిక్ ఆఫెల్ మార్గలిన్ చాలా పరిశోధనలు జరిపి – "వైఫ్స్ ఆఫ్ ది గాడ్ కింగ్" అనే పేరుతో పూరీ దేవదాసీల మంత్ర చర్య విధానాలపై చాలా విలువైన పుస్తకం రాసింది. ఆలయంలోని పూజలను సాధారణ పూజా విధానం శాక్తపద్ధతి, వైష్ణవ మార్గం అనే మూడు విధాలుగా వ్యాఖ్యానించవచ్చును. సాయంకాలం నుంచి రాత్రి సేవల దాకా జరిగేవన్నీ శాక్త విధానంలోనే జరిగినట్టు అన్వయించుకోవాలని పూరీ రాజ గురువులు ఈమెకు విశదం చేశారు.

పూరీ గుడి సేవలలో పంచ మకారాలకు ప్రత్యామ్నాయాలు బహిరంగ సేవలలో ఉన్నా రహస్య తాంత్రిక చర్యలో అసలు సిసలు పంచ మకారాలు. వాటి నిజ రూపాలలో ఉంటాయి. మద్యం, మాంసం, మత్స్యం, ముద్ర, మైథునాలు ఏ యే మంత్రాలు పఠిస్తూ ఎలా సన్నద్ధం చేయాలో, చక్ర ప్రవేశం ఎలా చేయాలో అన్నీ సవివరంగా ప్రొఫెసర్ మార్గలిన్ ఈ గ్రంథంలో పొందుపరిచింది. శ్యామా పూజా బిధి [విధి], మహాకాళీ సపర్యా విధి అనే రెండు ప్రామాణిక గ్రంథాలను పూరీ రాజ గురువులు నేటికీ ఉపయోగిస్తారు.

త్రినయన అనే పూజాక్[పూజారి] రహస్యంగా చేసే వామాచార విధానాన్ని సాకల్యంగా వివరిస్తూ – పంచమ మకారమైన మైథునానికి సన్నాహం చేయడంలో ఒక యువతిని ఎన్నుకోవాలని తెలిపింది. ఈమె ఎంత మాత్రం వయస్సు చెల్లింది కాకూడదు. ఋతుస్రావ దశలో ఉండకూడదు. నటి, పాలిని, వేశ్య, రజకి, నాపితాంగన [మంగలి స్త్రీ] వీళ్ళల్లో ఏ ఒక్కరినైనా ఎంచుకోవాలి. ఈ వివరాల వల్ల ఆదిమ వామాచారమే నేటికీ పాటిస్తున్నారని స్పష్టమవుతున్నా మహా పూజ ప్రారంభం చేస్తున్నప్పుడు పూజకుడు కుల వనిత లాగా తన్ను తాను అలంకరించుకోవాలి. ఎర్రని వస్త్రాలు ధరించాలి. సిందూరం ధరించాలి. కళ్ళకు కాటుక పెట్టుకోవాలి. చేతులకు గాజులు తొడుక్కోవాలి. పెదవులు ఎర్రబడడానికి తాంబూల చర్వణం చేయాలి. [మార్గలిన్ పుస్తకం – పుట –224].

ఈ స్త్రీ వేషధారణ వల్ల వామాచరం ఆదిలో పూర్తిగా ఆడవాళ్ళ మంత్ర చర్య

అన్న సంగతిని చాటుతోంది. అయితే ఆదిలో ఇది వ్యావసాయిక సఫలత కోసం తల్లి హక్కు గల సమాజాలలో స్త్రీలు పాటించేవారన్న సంగతి కాలక్రమేణా మరుగున పడింది. చీకటి యుగాల అజ్ఞానంలోనే సృష్టి కార్యపు ప్రాథమిక లక్షణాలను కొద్దిగా ఆకళింపు చేసుకొని ప్రకృతి శక్తులను లొంగదీసుకుని తమ శ్రేయస్సు కోసం మంత్ర చర్యల ద్వారా వాటిచేత పని చేయించడానికి ప్రాకృత జనాలు ప్రయత్నించారు. ఉత్పత్తి విధానాలలో ఎన్ని మార్పులు వచ్చినా, ఎంత అభివృద్ధి జరిగినా, ఎంత విజ్ఞానం కలిగినా తొలినాటి ఆచారాలు, అస్థలనుపట్టి జాతి జనులలో ఉండిపోయాయి.

వామాచార వజ్రయానాలు ఈనాటి ఉత్పత్తి విధానాలలో సస్య సఫలతకు అవసరం కానేకావు. ఒకనాటి విశ్వాసాలకు నెలవులుగా దేవాలయాలూ, వాటిలోని కామ శిల్పాలు సాక్ష్యాలుగా మాత్రమే ఉంటే చాలు. చారిత్రక క్రమ పరిణామాల అవగాహనకు ఇవి అవసరం.

ప్రజలలో ఉన్న మూఢ నమ్మకాలను తొలగించుడానికి నిజమైన చరిత్రను తెలుసుకొని నిర్దాక్షిణ్యంగా విశ్లేషణ చేసి, నిష్పక్షపాతంగా వ్యాఖ్యానం చేసి అభ్యుదయానికి నిరాటంకమైన మార్గం వేయాలి. ఇది సామాజిక బాధ్యతలు గుర్తించిన రచయితల కర్తవ్యం.

భారతదేశంలో ఎన్నో దేవాలయాలున్నాయి. వాటిలో ఎన్నో కామ శిల్పాలున్నాయి. అన్నింటి గురించీ రేఖా మాత్రంగానైనా చెప్పడం ఒక చిన్న సంపుటంలో సాధ్యంకాదు. మచ్చు కేసుగా ఖజురాహోలోని దేవాలయాల చరిత్ర, ఆ శిల్పాల ముచ్చట తెలుసుకుందాం.

## అధోజ్ఞాపికలు

[1] బాఖస్ మన పురాణాల్లోని బలరాముని వంటి వాడు. వారుణీ ప్రియుడు.

[2] విన్సెంట్ ఏ.స్మిత్ - ఏ హిస్టరీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ ఇన్ ఇండియా అండ్ సిలోన్, ఆక్స్‌ఫర్డ్ 1930 పుటలు: 43-46

[3] తెలుగు అకాడెమివారి ఇంటర్మీడియట్ పాఠ్య గ్రంథం ప్రచురణ నెం.19, పుట: 101

# ఖజురాహోలో కామ శిల్పాలు

ఖజురాహో దేవాలయాల సంకీర్ణ ప్రాంగణం కామ శిల్పాలకు ప్రసిద్ధమైనది. అయితే అక్కడ ఉన్నవన్నీ కామ శిల్పాలే కాదు. వివిధ దేవతల ప్రతిమా శిల్పాలతో బాటు జనుల ఆచార వ్యవహారాలు నిత్య జీవిత దృశ్యాల చిత్రీకరణ కూడా అక్కడ ప్రస్ఫుటంగా కనబడుతుంది. ఏ ప్రత్యేక చారిత్రక కారణాల వల్ల అక్కడ శిల్పాలలో కామం గణనీయమైన స్థానం ఏర్పరచుకుంది? ఇది విపులంగా సమీక్షించి విశ్లేషణ చేయదగ్గ విషయం.

ఖజురాహో దేవాలయాలు ఎవరు కట్టారు? ఎప్పుడు కట్టారు?

ఖజురాహో ఛాందెల్లా వంశపు రాజుల రాజధాని. మధ్యప్రదేశ్‌లోని ఛత్తర్‌పూర్ జిల్లాలో ఉంది. ఛాందెల్లా రాజ వంశం క్రీ.శ.168 సంవత్సరం నుంచి చంద్రవర్మ కాలంలో ప్రారంభమైంది. ఈ రాజ వంశ చరిత్ర గమనార్హమైంది. కాశీలో గహడ-వారా రాజు ఇంద్రజిత్తు పాలిస్తూ ఉండేవాడు. అతని వద్ద హేమరాజు అనే పురోహితుడు ఉండేవాడు. ఆ గురువుకు హేమవతి అనే కుమార్తె ఉంది. ఈమె రపితలాబ్ అనే తీర్థంలో స్నానం చేయడానికి వెళ్ళింది. అప్పుడు ఆకాశంలోని చంద్రుడు ఆమె అందచందాలకు ముగ్ధుడై అవనికి దిగి వచ్చి ఆమెను ఆలింగనం చేసుకుని మళ్ళీ అంతరిక్షానికి వెళ్ళిపోయాడు. హేమావతి తన కన్యాత్వం దూషితమైనందుకు వగచి అది ఎలా దాచుకోవాలో తెలియక చంద్రుణ్ణి శపించింది. చంద్రుడు ఆమెను ఊరడించి ఆమెకు పుట్టబోయే మగ చిన్న వాడిని ఖజురాహోకు కానుకగా అర్పణ చేసి క్రతువు చేయమని ఆదేశించాడు. చంద్రుడు చెప్పిన హేమావతి కుమారుడు మహోబా మహీపతి అయ్యాడు. ఖజురాహోలో విఖ్యాతమైన కరింజరా దుర్గాన్ని నిర్మించాడు. ఛాందెల్లా రాజ వంశం మాతృగణ సంప్రదాయానికి చెందినదని చెప్పడానికే ఈ కథ పనికి వస్తుంది.

క్రీస్తు శకం168 నుంచి శాసన ప్రమాణాల వల్ల క్రీ. శ. 16వ శతాబ్దం దాకా పాలించిన రాజుల పట్టిక తయారు చేయవచ్చు. ఈ ప్రభువులలో యశో వర్మ వైష్ణవుడు. అతని తరువాత రాజ్యానికి వచ్చిన ధాంగా (క్రీ.శ. 954-1002)శైవుడు. మదన వర్మ (క్రీ.శ.1148-1158) జైనుడు. మొత్తం మీద ఛాందెల్లా రాజులు జైన, బౌద్ధ, శైవ, వైష్ణవ, సౌర, గాణాపత్య మతాలను ప్రోత్సహించారు. అందుకే ఖజురాహో సంకీర్ణ ప్రాంగణంలోని దేవాలయాలలో అన్ని మతాల గుళ్ళూ కనబడతాయి.

ఇప్పుడు ఖజురాహోలోని నిలిచిన దేవాలయాల సంఖ్య మొత్తం 24 ఉన్నాయి. వాటిని మూడు భాగాలుగా వర్గీకరించవచ్చు. పశ్చిమ విభాగంలో చౌషష్టి జోగిని, లాల్ గౌన్, కందారీ మహదేవ మొదలైన శాక్త శైవ దేవాలయాలు ప్రముఖం. తూర్పు విభాగంలో ఆదినాథ, పార్శ్వనాథ, శాంతినాథాదులైన జైన తీర్థంకరుల ఆలయాలు ఎక్కువ. దక్షిణ విభాగంలో దూలాదేవ్, చతుర్భుజ దేవాలయాలు ముఖ్యం. త్రిమూర్తులు, పంచాయతన దేవతలు, సప్తమాతృకలు, అష్టదిక్పాలకులు,

నవగ్రహాలు మొదలైన వివిధ దేవతలూ, శాక్త, జైన, బౌద్ధ విగ్రహాలు ఇక్కడ కోకొల్లలుగా ఉన్నాయి. ఒక్క ఆంజనేయ విగ్రహం తప్ప రామావతారం గురించి శిల్పాలేమీ ఇక్కడ లేకపోవడం గమనించదగ్గ విషయం.

ఖజురాహో ఇప్పడొక చిన్న కుగ్రామం. చుట్టూ కొండలూ, దుర్గమారణ్యాలూ ఉన్నాయి. ఇటువంటి చోట పూర్వం ఒక రాజ్యం ఎందుకుంది? ఒక రాజధానికి సరిపడేంత భుక్తి ప్రసాదించగల ఆహారోత్పత్తి సాగడానికి ఇక్కడ సౌకర్యాలు వున్నాయా? ఇక్కడి అడవులలో, కొండల్లో, లోయల్లో ఖజురాహో సాగర్ అనే చెరువూ, చిన్న ఏరూ మాత్రమే ఉన్నాయి. అయితే ఈ గ్రామానికి దగ్గరలో ఉన్న పన్నా అనే ఊరి ప్రాంతాల్లో వజ్రాల గనులు, కట్టుబడిరాళ్ళ పరిశ్రమా ఉండడం వల్ల అది నేటికీ వ్యాపార కేంద్రమే. వజ్రాల వల్ల ఇక్కడ రాజ్యం, వ్యాపారం, గుళ్ళూ, గోపురాలూ మొదలైనవి వెలిశాయి.

ఇతర మతాలతో బాటు ఖజురాహోలో కాలకాపాలిక మతాలు ఒకనాడు ఉధృతంగా వర్ధిల్లాయి. ఖజురాహోలో చౌషష్టి జోగినుల దేవాలయం అత్యంత ప్రాచీనమైనది. జోగినులను కపాల వనితలు అంటారు. కాపాలికులు కాలచుర్యుల రాజ్యంలో ప్రబలంగా ఉండేవారు. దాహాలదేశంలో పీఠం ఉంది. ఆ దాహాలం ఖజురాహోకు అత్యంత సమీపంలో ఉంది. అందువల్ల కాపాలికులూ, కపాల వనితలూ తమ తాంత్రిక జీవనం గడిపే వారు. వారి జీవిత విధానమే కామ శిల్పాలలో ప్రతిఫలించిందని చెప్పవచ్చు.

ఖజురాహో కామ శిల్పాలలోని మగవారు ముండిత శిరస్కులు. కాపాలికుల తలలు నున్నగా గొరిగినవే. ఈ కామ శిల్పాలలోని సాధువులకు నగలు కాని, వస్త్రాలు కాని లేవు. కమండలం, యోగ దండం మాత్రమే ఉన్నాయి.[1] తాంత్రికుల పంచమకారాలలోని మైథునం ఒక్కటే కాక తతిమా నాలుగూ కూడా ఇక్కడ శిల్ప చిత్రణ పొందినవని చెప్పవచ్చు.

సాంఘిక జీవనాన్ని చిత్రించే ఖజురాహో శిల్పాలలో వేట దృశ్యాలు కనబడతాయి. లేళ్ళనూ, అడవి పందులనూ వేటాడడం, చంపిన మృగాలను కర్రకు వేళ్ళాడదీసి మోసుకు పోవడం కనపడతాయి. మాంస భక్షణ అప్పటి జీవనంలో ఒక భాగమే. మధుపానం కూడా ఇక్కడి శిల్పాలలో కనబడుతుంది. ప్రతి దేవాలయంలో మునులు, సాధువులు పాత్రలలోంచి మధువు తాగడం కనబడుతుంది. ఒక శిల్పంలో నలుగురు సాధకులు కూర్చున్నారు. ముగ్గురు ఎదురు ముఖంగా చూస్తున్నారు. ఒకడు తన ఎడమ ప్రక్కకు చూస్తున్నాడు. చివర ఒక నిలబడ్డ వ్యక్తి వంగి ఒక కుండలోంచి మధువు పోయడం కనబడుతుంది. మొదటి ఇద్దరు సాధకులు తమ కుడి చేత పట్టుకున్న పాత్రల వంక ఆత్రుతగా చూస్తున్నారు. మొదటి వాడు మరి కొంత మధువు అడిగినట్టున్నాడు. మూడవ సాధకుడు అప్పటికే ఎక్కువ తాగినట్టు కనబడుతున్నాడు. చర్యలు విపరీతంగా ఉన్నాయి. నాలుగవ సాధకుడు ఇతని వంక కోపంగా చూస్తున్నాడు.[2]

కేవలం తాంత్రిక సాధకులే గాక స్త్రీ పురుషులు నిత్య జీవితంలో మధుపానం చేసే దృశ్యాలు ఖజురాహో శిల్పాలలో ఉన్నాయి. పురుషులు పాన పాత్రలు పట్టుకుని కూర్చునో, నిలబడో కనిపిస్తారు. స్త్రీలు చషకం నుంచి మధువు పోస్తూ ఉంటారు.

కొన్ని శిల్పాలలో స్త్రీలు కూర్చుని పాత్రలు పట్టుకుని ఉంటే మగవారు అందులో మధువు పోస్తూ ఉంటారు. ఒక యువతి పాత్రను పట్టుకున్న చేతులు పైకెత్తి మధువును అడగడం కనబడుతుంది. ఖజురాహో సమాజంలో ఆనాడు స్త్రీ పురుషులు కలిసి మధుపానం చేసేవారు. చేతుల్లో తామర మొగ్గలూ, పిల్లన గ్రోవులూ ధరించి ఆడా, మగా సంభాషించే వారు.[3]

ఖజురాహో దేవాలయాలలో ఒక్క శాక్తమే, కాక బౌద్ధం కూడా కనబడుతుందని గమనించాం. మహాయాన బౌద్ధంలోని అర్వాచీన సంఘాలూ, వజ్రయానీయులు త్యాగం కన్నా భోగానికి ప్రాముఖ్యమిచ్చారు. మహా నిర్వాణానికి బదులు మహా సుఖం ఆకాంక్షించారు. ముక్తి కన్నా భుక్తి ముఖ్యమైంది. బౌద్ధ సంఘాలలోనికి స్త్రీలు రావడంతో వాళ్ళతోబాటు చాలా ప్రవేశించాయి. ఒకనాడు పాన్పు నుంచి బహిష్కరించబడిన పడతి ఇప్పుడు పవిత్రమైన దేవాలయ కుడ్యాలపై ఆరాధనకు అర్హురాలైన శృంగార దేవతగా ఆవిర్భవించింది.[4]

దిగంబర జైనులు కూడా ఈ శిల్పాలలో కనబడతారు. పూర్తిగా చిసమొలతో ఉన్న ఒక దిగంబర జైనుడు ఎడమ చేత్తో ఒక పాత్ర పట్టుకుని నిలబడితే అతనికి అటూ, ఇటూ స్త్రీలు నిలబడి అతని చేయి చెరొక పక్క నుంచీ పట్టుకున్నారు. ఈ శిల్పం జగదంబి దేవాలయం వెలుపలి కుడి పృష్ఠ భాగాన ఉంది.

లక్ష్మణ దేవాలయం కుడి ప్రదక్షిణ క్రమంలో అడుగు దరజు చిత్రాలలో ఒక విడ్డూరమైన శిల్పం కనబడుతుంది. ఇద్దరు సన్యాసులు చెరొక దిండుల మీద కూర్చుని ఉన్నారు. వాళ్ళిద్దరి మధ్య మూడవ దిండు ఉంది. దీని మీద ఒక సన్యాసి ఎడమ చేయి ఆన్చుకుని వున్నాడు. రెండవ సన్యాసి చేతిలో ఒక లేఖిని ఉంది. ఇద్దరు వ్యక్తులు ఇతని చేత బలవంతంగా ఏదో రాయిస్తున్నారు. ఒక వ్యక్తి ఎదుట ఒక చేత్తో బల్ల పట్టుకుని రెండవ చేత్తో బెత్తం లాంటి ఆయుధం ధరించాడు. ఈ ఆయుధంతో సన్యాసిని బెదిరిస్తున్నట్లు తోస్తుంది. రెండవ వ్యక్తి కూడా ఆయుధపాణే. ఇతడు సన్యాసిని తల మీద కొడుతున్నాడు. ఈ రెండవ వ్యక్తి వెనుక మరొక ఆయుధపాణి నిలబడి ఉన్నాడు. ఈ విడ్డూరమైన శిల్పం వల్ల సన్యాసుల పైన సైతం జనం చెయ్యి చేసుకోవడానికి వెనుకాడే వారు కారని పరిశోధకులు భావిస్తున్నారు.[5]

ఖజురాహో శిల్పాల కాలంలో స్త్రీలకు సమానత్వం, స్వాతంత్ర్యం ఉన్నాయి. వాళ్ళు నిర్భయంగా సమాజంలో సంచరించవచ్చు. అటువంటి ఉదార పరిస్థితులలో సైతం స్త్రీలు ఆగడాలకు, ఆపదలకు దూరమని చెప్పడానికి వీలు లేదని చాటే శిల్పాలు ఖజురాహో సంకీర్ణ ప్రాంగణంలోని దేవాలయాల్లో కనపడతాయి.

ప్రస్తుతం స్థానిక వస్తు ప్రదర్శనశాలలో ఉన్న ఒక ఫలకంలో ఒక వ్యక్తి తన భార్యను తీసుకుని ఆమెను రక్షించడానికి పరుగెత్తి పారిపోతున్నాడు. ఎవరి బారి నుంచి తన భార్యను కాపాడుకొనడానికి ఆ వ్యక్తి జంటగా పరుగెత్తుకుపోతున్నాడో కూడా కనబడుతుంది. ఇద్దరు పురుషులు వాళ్ళను వెంబడిస్తున్నారు. బహుశా ఆమెను ఎత్తుకుపోవడానికి కాబోలు!

లక్ష్మణ దేవాలయంలోని ఫలకంలో ఒక వ్యక్తి భార్యను కొప్పు పట్టుకుని

లాగుతున్నట్టు, ఆమె గింజుకుని అడ్డు చెబుతున్నట్టు ఒక శిల్పం ఉంది. స్త్రీ పురుషుల మధ్య తగవులాటలో ఇతరులు జోక్యం కలిగించుకునే వారు కాదన్నట్టు ఈ దృశ్యాన్ని ఒక మూడవ వాడు పరికిస్తున్నాడు.

కామ సల్లాప వేళల్లో సైతం స్త్రీలు జాగ్రత్తగా ఉండాలి కాబోలు. స్థానిక వస్తు ప్రదర్శనశాలలో ప్రదర్శిస్తున్న ఒక శిల్పంలో పురుషుడు తన ఎడమ చేతితో ఒక యువతి వక్షోజాలను అదమబోతున్నాడు. ఆమె ఎడమ చేతిని తన కుడి చేత్తో పట్టుకున్నాడు. ఆమె తన కుడి చేత్తో ఒక వాడి మొనగల బాకును ధరించి ఉంది. దాన్ని ఆ పురుషునికి చూపించి హెచ్చరిస్తున్నట్లు ఉంది. అతను బలాత్కారం చెయ్యబోతున్నాడో లేదో ఊహించుకోవలసిందే.

ఖంజరీయ మహాదేవుని గుడిలోని ఒక శిల్పంలో ఇద్దరు పురుషులు చెరొక రెక్క పట్టుకుని ఒక స్త్రీని హింసిస్తున్నట్లు కనబడతారు. ఆమె చేతులు జోడించి తనను విడిచి పెట్టమని వేడుకుంటున్నట్టు కనబడుతుంది.

అక్కడక్కడ చెదురుగా ఇలాంటి దృశ్యాల చిత్రీకరణ ప్రస్ఫుటంగా ఉన్నా మొత్తం మీద ఖజురాహో దేవాలయ సంకీర్ణ ప్రాంగణంలోని శిల్పాలలో స్త్రీ పురుషులు సామరస్యంగా పరస్పరాభిమానాలతో మెలుగుతున్నట్టే చెప్పవచ్చు. పిల్లా పాపలతో సౌఖ్యవంతమైన సంసార జీవితం గడుపుతున్నారని చెప్పడానికి నిదర్శనాలుగా ఎన్నో శిల్పాలు కనబడతాయి.

కౌల–కాపాలికులు మండలార్చనలో స్త్రీపురుషులు కలిసి మధుసేవ చేయడం ప్రభావం మన తెలుగు పద్య కావ్యాల పైన కూడా పడింది. ఎఱ్ఱా ప్రెగడగారు తన నృసింహ పురాణంలో హిరణ్యకశిపుడు తన భార్యతోనూ, కాంతా జన పరివృత్తుడై మధుపానం చేయడం తొమ్మిది పద్యాలలో వర్ణించాడు.

*అందరగైకొనంబనిచి యాదట కాంతయు దాసునొక్క కో*
*రం దనుపార దివ్య మదిరా మధురామృత పాన కేళియం*
*దంద యొనర్పగా దొడగె నంబురహో క్షుల విభ్రమక్రియా*
*కందళికంబులైన సవికార విహారములింపు బెంపగన్.*

-[నృసింహ – 3–94]

కాపాలికుల భైరవి చక్రంలో కూడా ఆడా మగా తేడా లేకుండా సవికార విహారాలుంటాయని ఖజురాహో శిల్పాలలో కనబడతాయి. జైన మందిరం శిఖరం పైన, ముఖద్వార కుడ్యాల పైన వివిధ దేవతల రూప శిల్పాల పక్క పక్కనే అనేక విపరీత సంభోగ శిల్పాలు చెక్కారు. వ్యానతము, ధైనుకము వంటి బంధాలలో రతులు శీర్షాసనం వేసిన నాయకుని నడుమును తన కాళ్ళతో చుట్టుకుని పరచారికల సహాయంతో పురుషాయితం చేసే నాయికలు, ఆమ్ర చూషక (చిత్రం 36) కాకలిరతులు (చిత్రం 37) ఈ శిల్పాలలో కనబడతాయి. రతి క్రీడలలో కామ మోహితులైన స్త్రీల మదనోద్రేకాన్ని పక్కనున్న వాసకపాలికలే చూడలేక కళ్ళు మూసుకుంటున్నట్టున్న మందిరంలో చెక్కారు.

వివిధ దేవాలయాలలోని కామ శిల్పాలను చూడడానికి ఇవాళ ఎందరో పర్యా

# కుబేరాయ వైశ్రవణాయ

కులము గల్గువారు గోత్రము గలవారు
విద్యనేత విఱ్ఱవీగు వారు
పసిడి కల్గువాని బానిస కొడుకులు
విశ్వదాభిరామ వినురవేమ!

వేమనగారు చెప్పినది చాలా ప్రాచీన సత్యం. డబ్బుకు లోకం దాసోహం; ధనమూల మిదం జగత్ ఇత్యాది అనుభవ సూక్తులు పరమ సత్యాలు. మనం సత్యమేవ జయతే అంటాంగానీ నిజంగా జయించే సత్యం ధనవంతులు ప్రచారం చేసే సత్యమే.

ఏ సమాజంలోనైనా నాయకుడు రాజవడానికి అవకాశాలున్నాయి. రాజుకు డబ్బుంటుంది. చాలా డబ్బున్నవాడు రాజవడానికి అవకాశాలు వస్తాయి. రాకపోతే రప్పించుకోవచ్చు. మన దేవతలలో చాలా మంది రాజులయ్యారు. ఒకప్పుడు వరుణుడు రాజు. ఆ స్థానాన్ని ఇతరులు ఆక్రమించారు: లేక ఇతరులకే భక్తులు కట్టబెట్టారు. దేవతలలో రాజు లెందరున్నా రాజరాజు ప్రాచీనులలో కుబేరుడొక్కడే కంటికి అనుతాడు. మహా భారతం వన పర్వంలో అతడిని రాజరాజనీ, నరవాహనుడనీ పేర్కొన్నారు. (అధ్యాయం 275, శ్లోకం 3).

ఇప్పటికీ శుభకార్యాలలో కర్పూరహారతి మంత్రపుష్పం చదివే సందర్భంలో మనకు వినిపించే మంత్రంలో కుబేర స్తుతి వుంది.

రాజాధి రాజాయ ప్రసహ్యాసాహినే
నమోవయం వైశ్రవణాయ కుర్మ హే
సమే కామాన్ కామకామాయ మహ్యం
కామేశ్వరో వైశ్రవణోదదాతు
కుబేరాయ వైశ్రవణాయ మహారాజాయ నమః

ఈ మంత్రాన్ని చాలాసార్లు మనం వింటూనే వుంటాం. కుబేరుణ్ణి ఇంత గొప్పగా ఎందుకు స్తుతించాలని ఎవరో కొందరే ఆలోచిస్తారు. కుబేరుడు అష్టదిక్పాలకులలో ఒకడు. అంతమాత్రాన రాజాధిరాజు, మహారాజు అనే బిరుదులు ఎలా వచ్చాయి? కుబేరుణ్ణి పూర్వం పూజించేవారా? ఇటువంటి ప్రశ్నలు వేసుకొని సమాధానాల కోసం గాలిస్తే చాలా ఆసక్తికరమైన వివరాలు దొరుకుతాయి.

మౌర్య సామ్రాజ్యంలో కుబేరునికి గుళ్ళు కట్టి పూజించేవారు. గుడి అనగానే శిల్పాలు వుండాలి. కుబేర రూప శిల్పాలున్నాయా అని అన్వేషిస్తే చాలా కనబడతాయి. కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో దుర్గంలో నిర్మించవలసిన ఆలయాల గురించి చెప్పాడు.

"పుర మధ్యమందు అపరాజిత, అప్రతిహిత, జయంత, వైజయంత అనువారికిని, శివ వైశ్రవణులకును, అశ్వినీ దేవతలకును, శ్రీ మదిరా దేవతలకును ఆలయములు నిర్మింపవలెను. [అధికరణం - 2(ప్రకరణం 22) అధ్యాయం 4, వ. నెం.17] "

కౌటిల్యుని అర్థశాస్త్రాన్ని ఆంధ్రీకరించిన మామిడిపూడి వెంకట రంగయ్యగారు అధోజ్ఞాపికలో ఇలా వ్రాశారు.

"దేవాలయముల నిర్మాణము వైదికేతరమగు ఆచారము. కౌటిల్యునినాటికి అది ప్రబలినట్టు కనిపించును. వైశ్రవణునికి(కుబేరునికి), అశ్వినీ దేవతలకు దేవాలయములుండుట ఒక విశేషం. మదిరాదేవత – దుర్గయో, కాళియో కావచ్చును..."(పుట80)

వైదికేతర పురాణపురుషులలో కుబేరుడు చాలా ప్రసిద్ధుడు. అందుకే అతని కథలను ఉత్తర రామాయణం కథనం చేసింది. మహాభారతం వివిధ పర్వాలలో కుబేరుని ప్రసక్తి, ప్రశస్తి కనబడుతుంది. సభాపర్వంలో కుబేర సభను ఘనంగా వర్ణించారు (పదవ అధ్యాయం). అప్సరసలు, లక్షల సంఖ్యలో యక్షులు, ధనాధి దేవత లక్ష్మి బ్రహ్మర్షులు, దేవఋషులు, పిశాచజాతులు, నారదుడు కుబేరుణ్ణి స్తుతిస్తూ వుంటారు. భూత ప్రేత పిశాచ గణ పరివృతుడై పార్వతీ సమేతుడైన శివుడు కుబేర సభలో ఉంటాడు. వామన, వికట కుబ్జులు, అరుణనేత్రులు, కోలాహలకారులు, మాంసభుక్కులు కుబేరునితో సఖ్యంగా ఉంటారు. పర్వత తుంబరు, హా హా, హూ హూ ప్రభృత గాయకులు కుబేర సభలో ఉంటారు.

పురాణేతిహాసాలలోని సంగతులు కేవలం ఊహా గానాలేనా లేక వాస్తవానికి ఒక్కింత ఉత్ప్రేక్షలా అన్న సంగతి తెల్సుకోవాలంటే శాస్త్రాలలో కూడా ఈ వివరాలే చూచాయగానైనా కనబడాలి. కుబేరుడు రాజు. అతని చుట్టూ వామన, వికట కుబ్జులు వుంటారనడానికి కౌటిల్యుని అర్థశాస్త్రంలో రాజుల విషయంలో చెప్పిన అంశాలను దాఖలాలుగా తీసుకోవచ్చు.

రాజు ఆత్మరక్షణ కోసం తీసుకోవలసిన జాగ్రత్తలు చాలా ఉన్నాయి. అతడు శయ్య నుంచి లేవగానే మొదటి కక్ష్యలో ధనుర్ధారిణులగు స్త్రీలు, రెండు కక్ష్యలో కంచుకములను, పాగాలను ధరించిన నపుంసకులగు భృత్యులు, మూడవ కక్ష్యలో గూనివాండ్రు, పొట్టివాండ్రు, కిరాతులు ; నాల్గవ దశలో మంత్రులు, బంధువులు, శస్త్రధారులగు దౌవారికులు రాజునకు స్వాగతం చెప్పవలెను. (అధికరణం1, అధ్యాయం21, అంశం 1)

శాస్త్రాలలోని సంగతులకు సాక్ష్యాలుగా పురావస్తు శాస్త్రజ్ఞులు ప్రాచీన ప్రదేశాలలో జరిపిన తవ్వకాలలో బయటపడ్డ శిల్పాలు మొదలైనవి దొరికితే చారిత్రక నిర్ణయాలకు ఇక తిరుగు వుండదు. సాంచీ, బార్హూత్, మధుర, అమరావతి మొదలైన ప్రదేశాలలో బౌద్ధ శిల్పాలలో లెక్కలేనంతగా మరుగుజ్జుల శిల్పాలు లభిస్తున్నాయి. యక్షులు, యక్షిణులు మొదలైనవారి కాళ్ళ దగ్గర ముఖ్యంగా ఈ వికట కుబ్జుల రూపాలు కనబడుతూ వుంటాయి. [చిత్రం 38] (యమునా నదీ తీరాన వుండే) మధురానగరి మ్యూజియంలో కుబేర రూప శిల్పాలు కూడా కొన్ని ఆలనాటి సామాజిక పరిస్థితులను మౌనంగా చాటుతూ ఉంటాయి. 1836లో కర్నల్ స్టాసీ, తర్వాత డాక్టర్ వోగిల్ కొన్ని కుబేర శిల్పాలను గుర్తించారు. ఈ బొమ్మలలో కుబేరుడు తప్పతాగిన మైకంలో వున్న వ్యక్తిలాగా కనబడతాడు. ఒక రూపశిల్పంలో కుబేరుడు మొరటువాడిలాగా, రమారమీ నగ్నుడిగా, మఠం వేసుకుని కూర్చొని కుడి చేతిలో పాన పాత్ర, ఎడమ



చిత్రం 38. నరవాహన సుందరి

చేతిలో పొడుగాటి డబ్బుల సంచీ పట్టుకొని దర్శనమిస్తాడు. కుడిచేతి పక్క నిలుచున్న పరిచారిక పానపాత్రను నింపడం చూడొచ్చు. కుషాన్ యుగంలో కుబేర శిల్పాలు కోకొల్లలుగా వున్నాయి. (చూ.విన్సెంట్ స్మిత్ రచించిన'ఎ హిస్టరీ ఆఫ్ ఫైన్ ఆర్ట్ ఇన్ ఇండియా అండ్ సిలోన్', పుటలు :43-46)

తెల్లదొరల కాలం నుంచీ ఈ కుబేర చిత్రాలను 'బఖలానియన్'చిత్రాలని మన పురావస్తు శాస్త్రజ్ఞులు వ్యవహరిస్తూ వుంటారు. 'బఖస్' అనే నామం గ్రీకు దేవతలలో ఒకడైన 'డయొనైసస్'కి అన్వయిస్తుంది. బఖనాలియా అనేది ఒక ఉత్సవం. బఖనాలియన్ అనే మాటకు అర్థం "BACCHUSఅనే దేవుని యొక్క ఉత్సవంలో తాండవమాడేవాడు" అని బ్రౌను దొరగారు తమ ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో ఇచ్చారు. మన పురాతత్వ శాస్త్రజ్ఞులు 'బఖలానియన్'అన్న పదాన్నే తెలుగు పాఠ్య గ్రంథాలలో కూడా వాడుతున్నారు. మన దేశంలో ఇటువంటి శిల్పాలు అభ్యమైనా, ఇవి మన సంప్రదాయం కాదు పొమ్మంటున్నారు. చూడండి!

"బఖలానియన్ కపాటాలలో స్త్రీలు మద్యం సేవించి కాముక చేష్టలను ప్రదర్శించే విషయాలున్నాయి. స్త్రీలు మద్యం సేవించడం భారతీయేతర సంప్రదాయం. ఈ రకపు చెక్కడాలను అనతి కాలంలోనే విసర్జించడం జరిగింది. కుషాన్ రాజులు పోషించిన గాంధార శిల్పరీతులు కూడా వారి రాజ్యంతోపాటు 3వ శతాబ్దం నుంచి క్షీణించి క్రమంగా అంతరించాయి.(చూ."పురావస్తు శాస్త్రము - ప్రాథమిక సూత్రాలు" తెలుగు అకాడమీ ప్రకటించిన ఇంటర్‌మీడియెట్ పాఠ్య గ్రంథం పుట 101)"

కుషానుల రాజ్యం 3వ శతాబ్దంలో క్షీణించి అంతరించవచ్చు. గాంధార శిల్పాలు కూడా అంతే కావచ్చు. అయితే బఖలానియన్ సంప్రదాయం మాత్రం అంతరించలేదు. ఈ పేరు గ్రీకు దేవునికి చెందినంత మాత్రాన మన హైందవ 'నాగరికత'లో దీనికి సరియైన ప్రతినిధి లేకపోలేదు. బఖస్ అనే ఆంగ్ల పదానికి అర్థం రాస్తూ బ్రౌను దొరగారు "బలరామ నామం - తాగుబోతుల దేవుడు" అని స్పష్టం చేశారు. మధుర మ్యూజియంలోని కుబేర శిల్పాల చిత్రాలను చూస్తే సరిగ్గా బలరాముడే స్ఫురిస్తాడు.

హరివంశంలో బలరాముడు ఒంటరిగా వనవిహార జీవం పొంది, దాహం వేస్తే 'కాదంబరియను పేర సతి మనోహరయగు రసధారను గ్రోలి'మదమెయ్యన యెక్కగ కింపొద్దపుడు నేత్రములు ఘూర్ణి తోజ్జ్వలములుగా బొదలగ అంగంబులు వివశ హృదయుడై యున్నయెడ' మదిరాదేవి సాకారమై అతని ముదర నిలచి కేలు ముడిచి "నిన్ను వరింప వచ్చితిన్" అని చెప్పింది.(చూ.ఎర్రనగారి హరివంశం ఉత్తర భాగం. అశ్వాసం 1 పద్యాలు 56 నుంచి 62)

హరివంశంలో ఇంకా బోలెడు వివరాలున్నాయి గాని ఇక్కడ ప్రస్తుతం మనకు కావలసిన పాయింటు ఏమిటంటే కౌటిల్యుడు నగర మధ్యంలో కట్టాలని చెప్పిన కుబేర, మదిరా దేవతల ఆలయాలకి వున్న సంబంధం. మదిరా దేవతల ఆలయాలని కౌటిల్యుడు బహువచనంలో చెప్పాడు. మదిరాదేవి బలరాముణ్ణే వరించినట్టు హరివం. శంలో ఆధారాలున్నాయి. పాణిని కాలం నుంచి కృష్ణ, వాసుదేవ ఆరాధనలు మన

ంలో ఉన్నాయి. అప్పుడు కృష్ణుని పక్క బలరాముడు వుండేవాడా? కా
నికి ప్రచారంలో వున్న మదిరా దేవతల గుళ్ళలోని దేవతలు ఎవరెవరు?
రా దేవతల అనుబంధం ఒకపక్కా, బలరామ మదిరా దేవతల పరిణయం
క్క వున్నాయి కనుక కుబేరబలరాముల మధ్య సంబంధం ఏదైనా చరిత్ర అ
లలో నిక్షిప్తమై వుందా? చాలా పరిశోధించాలి.

చిత్రం 39. కుబేరుడు-హారీతి (సాహ్రిబాహ్‌లోప్‌లో లభించినది )



రుణ్ణి మదిరాదేవితో కాకపోయినా హారీతి అనే దేవతతో కలిపి ఆ భారతదేశంలో ఉండేది. సాహ్రిబాహ్‌లో ఒక శిల్పం లభించింది హారీతీ ఒకరి ప్రక్క ఒకరు ఒకే ఆసనంపై కూర్చున్నా త్రి(ఒడిలో ఒక బిడ్డను చూడవచ్చు) బిడ్డలతల్లి. ఇంకొక నలుగ కనపడతారు. (చూ॥ చిత్రం నెం. 39) హారీతి శిశువులను కాపా లను పోగొడుతుంది.



చిత్రం 40. కుబేర శిల్పం (లాహోరు )

ఆంధ్రదేశంలో ఒకప్పుడు హారీతిని ఆరాధించేవారు. నాగార్జున కొండవద్ద జ
్యకాలలో హారీతి గుడి బయలు పడింది. బౌద్ధం ప్రబలంగా ఉన్నప్పుడు వ
్నలు ఉండేవనుకోవచ్చును. బొజ్జనకొండ (అనకాపల్లి దగ్గర) అందుకు సాక్ష
ితితో కలిపి కుబేరుణ్ణి తెలుగు దేశంలో ఆరాధించేవారో తెలియదు గాని వ
ాగాల దాకా తెలుగు గడ్డ మీద కుబేర శిల్పాలు ఉండేవని పురావస్తు శాస్త్రవే
న్నారు. ఈ కుబేరుడు నగ్నుడు.బానపొట్ట. అయితే భారతదేశంలోని ఇతర క
ాలలో వస్త్రాలు కనబడతాయి. లాహోరు మ్యూజియంలో ఒక కుబేర శి
ది. ఇందులో వ్యక్తి ధోవతి కట్టుకొన్న వాడే. ఎడమచేతిలో ఆయుధం ఉ
త్రం 40]

భారతదేశంలోని కుబేరు శిల్పాలలో మదిరాపానుడుగా అతడు కనపడతాడు
ు దేవత అయిన బాఖస్ శిల్పాలు విభిన్నంగా ఉంటాయి. ప్రష్యాదేశంలోని అ
పెల్‌లో లభించిన ఒక శిల్పంలో బాఖస్ నగ్నుడు. ఎడమకాలు యత్కిం
ుచితం. కుడి చేత్తో ద్రాక్ష తీగెను పట్టుకొని నిలబడ్డాడు. భారతీయ శిల్పా
ుభంజికలే వృక్షాలను ఆనుకొని కనపడతారు. ఆదిలో ఈ యక్షిణులు
ుదరులేగాని ఉత్తరోత్తరా కొద్దిగా వస్త్రధారణ చేసిన వారుగా కనపడతారు. బాఖ
ుభంజికను తులనాత్మకంగా పరిశీలించవచ్చు.(చూ॥ చిత్రాలు నెం. 41, 42)



చిత్రం 41. బాఖస్ శిల్పం (ప్రష్యా )



చిత్రం 42. యక్షిణి. (గాంధార శిల్పం

ఇంతో అంతో పురాణ పరిజ్ఞానం ఉన్న చదువరికి కుబేరుడి పుష్పక విమానం అన్నమాట పరిచితమైనదే. అయితే దేవాలయానికి విమానం ఒక పర్యాయపదం. విమానాలు అయిదు రకాలుగా ఉంటాయి. అవి వరసగా బ్రహ్మ, కుబేరుడు, శివుడు, వరుణుడు, ఇంద్రుడు అనే దేవతలకు సంబంధించినవి. వీటినే క్రమంగా వైరాజ, పుష్పక, కైలాస, మణిక, త్రివిష్టపాలని పిలుస్తారు. ఇవి వేరువేరు ఆకారాలలో ఉంటాయి. కుబేరుని పుష్పకం దీర్ఘచతురస్రపు ఆకారంగలది. దీనిని ఆయతాస్రం అంటారు.

అయితే ఒకటిమటుకు చెప్పకోవాలి. కుబేరుణ్ణి ప్రాచీన దైవంగా ఆరాధించే రోజులు పోయినందుకు సంతోషించాలి. కాని, కుబేర సంపదలు మన దేశంలో కుచేల సంతానాన్ని పీల్చి పిప్పిచేయడం ఆగితే ఇంకా సంతోషించాలి. పసిడిగలుగువాడు ఏ ఒక్కడో కాకూడదు. సమాజంలో సంపద ఉమ్మడిగా వుండాలి. దానికోసం పోరాడాలి.

భూమి నా దటన్న భూమి ఫక్కున నవ్వు
దానహీను జూచి ధనము నవ్వు
కదన భీతు జూచి కాలుండు నవ్వురా
విశ్వదాభిరామ వినురవేమ!






## కొన్ని ఉపయుక్త గ్రంథాల సూచిక


- ఆదినారాయణ శాస్త్రి పంచాగ్నుల
  గౌతమ ధర్మ సూత్రములు (ఆంధ్ర వివరణ)
  మద్రాసు. ఆంధ్ర భారతీ గ్రంథమాలిక 1927
- ... వాత్స్యాయన కామ సూత్రములు (ద్వితీయ ముద్రణ)
  మద్రాసు. ఆంధ్ర భారతీ గ్రంథమాలిక 1934
- కృష్ణకుమారి నాయని & బి.రామరాజు
  జానపద గేయాలు - సాంఘిక చరిత్ర
  హైదరాబాదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1974
- గంగాధరం నేదునూరి
  మున్నేరు (జానపద గేయ సంకలనం)
  రాజమండ్రి, ప్రాచీన గ్రంథావళి (1973)
- ధర్మారావు తాపీ
  దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు (ఎనిమిదవ ముద్రణ)
  విజయవాడ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ 1984
- దొణప్ప తూమాటి
  జానపద కళా సంపద
  విశాఖపట్నం నిర్మల పబ్లిషర్స్ 1975
- పాపయ్య శాస్త్రి చిలుకూరి (పీఠిక)
  శ్రీనాధుని శ్రీభీమేశ్వర పురాణము
  రాజమండ్రి, అద్దేపల్లి అండ్ కో 1958
- ప్రతాప్ డి. ఆర్.
  ఆంధ్రప్రదేశ్ ఆదిమ వాసులు
  హైదరాబాదు ఆదివాసి సాంస్కృతిక పరిశోధన సంస్థ
  మరియు శిక్షణా సంస్థ 1975 (?)
- ప్రతాపరెడ్డి సురవరం
  హిందువుల పండగలు
  మద్రాసు-కర్నూలు, బాల సరస్వతి బుక్ డిపో 1953
- బ్రౌన్ సి.పి
  బ్రౌణ్య తెలుగు నిఘంటువు
  హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1968

- రాధాకృష్ణ బూదరాజు (సంపాదకుడు - సంకలన కర్త)
  మాండలిక వృత్తి పదకోశం వాస్తుపదజాలం
  *హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1968*
- రఘునాథాచార్య ఎస్.బి (ప్ర.సం)
  ఆర్థ విజ్ఞాన సర్వస్వము (ప్రథమ సంపుటం)
  *తిరుపతి తిరుమల తిరుపతి దేవస్థానం 1985*
- రామమూర్తి పురాణపండా
  ఆంధ్ర మహా భారతము (సమూలము)
  *కాకినాడ శ్రీమహాభారత ప్రచార సంఘము 1957 లగాయతు*
- విజ్ఞాన సర్వస్వము వాల్యూమ్. 14 లలిత కళలు
  *హైదరాబాదు, మద్రాసు. తెలుగు భాషా సమితి 1979*
- వెంకట నరసింహ శాస్త్రి నేమాని
  సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత (4వ సంపుటం)
  *తిరుపతి. తిరుమల తిరుపతి దేవస్థానం 1981*
- వెంకట రంగయ్య మామిడిపూడి
  కౌటిల్యుని అర్థశాస్త్రం (తెలుగు అనువాదము)
  *హైదరాబాదు. ఆంధ్ర రచయితల సహకార సంఘ ముద్రణాలయము 1968*
- శ్యామల కామశాస్త్రి కొట్రా
  ఆంధ్ర వాచస్పత్యం మూడు సంపుటములు
  ఆంధ్ర ప్రతిపదార్థ పర్యాయ పద నిఘంటువు
  *తెనాలి ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ 1953*
- శ్రీనివాసరావు కోలాచలం (మొ.సం)
  ఋగ్వేదము
  *బళ్ళారి వేదార్థచంద్రిక ఆఫీసు 1914*
- శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు
  *హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1979*
- సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము వాల్యూమ్ 8 వారసత్వ సంస్కృతి
  *హైదరాబాదు. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశ సమితి 1971*

## SELECT BIBLIOGRAPHY


- Agarwal Urmila - Khajuraho Sculptures and their Significance - S. Chand & Co. - 1964
- Battacharya Narendra - Ancient Indian Rituals- Manohar Book Services - 1975
- Briffault. R. - The Mothers - London, 1952.
- Buhler G. (Trans) The laws of Manu, Delhi, Motilal Banarasi Das - 1964
- Burrow.T. and Emeneau. M.B.- A Dravidian Etymological Dictionary. The clarendon Press, 1961.
- Chattopadhyaya Debi Prasad - Lokayata- A study in Ancient Indian Materialism- People's Publishing House - 1959
- Elwin Verrier Maria Murder and Suicide London EGA Oxford University Press 1943.
- Frazer.J.G. - The Golden Boug(abridged.ed.) London 1949
- Kane.P.V. - History of Dharma Sastra Vol.I.- Puna, 1930 ; Vol II - 1941
- Kosambi. D.D. - Myth and Reality - Bombay, Popular Prakashan - 1984
- Kramrisch Stella - The Hindu Temple - University of Calcutta ; vol.I - vol II - 1946
- Kunwarlal - Apsaras of Khajuraho - Asia Press, Delhi, 1966.
- Macdonell A.A. & Keith A.B. - Vedic Index of Names and Subjects Vol. I, II John Murray, Albemarle Street.W.London- 1912.
- Mackenzie Gordon - Manual of Krishna District - Madras 1893.
- Marglin A. Frederique - Wives of the God-king - The Rituals of the Devadasis of Puri -Delhi, Oxford University Press, 1985.
- Parmar .Y.S. - Polyandry In Himalayas - Delhi, Bombay, Banglore, Kanpur - Vikas Publishing House Pvt.ltd. - 1975
- Patil Sarad-Dasa-Sudra slavery - Allied Publishers Pvt. Ltd. 1982
- Sastri Sakuntala Rao - Women In The Vedic Age- Bombay, Bharatiya Vidya Bhavan - 1954
- Smith Vinsent T.A. - A History of Fine Arts in India and Ceylon - Oxford, 1930
- Thomson George - Studies in the Ancient Greek - London, vol. I - 1949 ; vol II -1955.
- Williams Sir Monier Monier - A Sanskrit - English Dictionary - Etymotogically and Philogically arranged. - The Clarendon Press, Oxford - 1956.
- Wilson.H.H - Rigveda (tran) - Calcutta

